శ్రీరామచంద్రాయనమః

# విజ్ఞాపనము.

పాఠకమహాశయులారా! నమస్కారములు.

ఈ శ్రీబ్రహ్మేశ్వరపురాణము, శ్రీశైలపశ్చిమద్వారమును, దక్షిణకాశి యని విఖ్యాతి నొందినదియును, నగు అలంపూ రను మహాక్షేత్రముయొక్క స్థలపురాణము. ఈక్షేత్రరాజము మా జన్మస్థాన మయిన కర్నూలున కనతిదూరమున నుంటఁజేసియును, మఱికొన్ని కారణములం జేసియును, నాకు భక్తిఁబొడమించినది. ఆయలంపూరఁ గల యొక్క మిత్రసత్తముఁడు నాకు సంస్కృతభాషలో నుండు ఆ యలంపూరి స్థలపురాణమూలము నొసంగెను. దానిని బట్టియే నే నీ తెలుంగుపద్యకావ్యము వ్రాసితి. అందునుండి ఈ తెలుఁగుపుస్తకమునందుఁ గొన్ని శ్లోకముల నుదాహరించితి. అయ్యవి శిష్టాచారపరాయణులయిన కొందఱు తత్క్షేత్రభక్తిపరు లగు బ్రాహ్మణాదులచే పారంపర్యముగాఁ బఠింపఁబడుచున్నవి. కనుక దిద్దుఁబాటులు చేయవలసినట్లు కనుపట్టినను, నే నా పని చేయలేదు—చేయింప లేదు. ఇందలి శైలి కొంత కఠినమయినదని పెద్దలు కొంద ఱనిరి. అది ప్రయత్నసిద్ధము కాదు. అది క్షేత్రపతి యగు శ్రీబ్రహ్మేశ్వరుని దయయో? లేక కృతిభర్త లయిన మత్పితరుల యాశీస్సో? ఏ మనఁగా ఇతఃపూర్వము మద్రచితంబు లయిన శ్రీపరకాలవిలాస ప్రేమాభిరా మాదికృతులును, ఇటీవల వ్రాయఁబడుచున్న శ్రీ బ్రహ్మవైవర్త పురాణమును మిక్కిలి సులభతరశైలిలో నున్నవి.

ఈ పుస్తకమూలమును నా కొసంగిన యాస్తికులకును, వ్రాయునప్పుడు విని ప్రోత్సహించిన యభిజ్ఞులకును, దీనికిఁ బీఠికాభిప్రాయాదులు వ్రాసి యిచ్చిన మాన్యులకును, ఏతన్ముద్రణార్థము ద్రవ్యసాహాయ్యము చేసిన దాతలకును కృతజ్ఞతాభివందనములు గావించుచున్నాను.

ఈ పొత్తమును, నాచే రచింపఁబడిన యితరగ్రంథములను, ఇతరులయిన యభిజ్ఞుల పొత్తములను బ్రచురించుటకై "శ్రీవాఙ్మయవినోదినీగ్రంథమాల" యను పేరితో నొక గ్రంథమాల నెలకొల్పితి. తా మందఱీ గ్రంథమాలను బోషించి నన్నుఁ బ్రోత్సహింప వలయు నని వేఁడెద. అజ్ఞుఁడను కాన నా దోసంగులను మన్నింప వలయు నని పెద్దలను బ్రార్థించెద. సర్వదా సర్వథా నాయందను గ్రహ ముంచ వలయును. నమస్కారములు.

క్రిష్టియన్ కాలేజి
జార్జిటవున్
మదరాసు
అక్టోబరు 1931.

ఇట్లు
విధేయుఁడు
దోమా. వేంకటస్వామిగుప్తం

శ్రీః

కడప మునిసిపల్ హైస్కూలు పండితులును, శ్రీహాలాస్యమాహాత్మ్య బ్రహ్మాండ బ్రహ్మపురాణ రామాయణాద్యనేకగ్రంథకర్తలును, ఆస్తికశిరోమణులును, శ్రీమదఖిలవాంధ్ర వాల్మీకి వ్యాస బిరుదాభిరాములును, కావ్యస్మృతి తీర్థులును అగు బ్రహ్మశ్రీ జనమంచి. శేషాద్రిశర్మగారు దయచేసిన

## పీఠిక (1)

మాత ర్నాతః పర మనుచితం యత్ఖలానాం పురస్తా!
దస్తాశంకం జరరపిఠరీ పూర్తయే నర్తితాసి।
తత్క్షంతవ్యం సహజసరళే వత్సలే వాణి కుర్యాం।
ప్రాయశ్చిత్తం గుణగణనయా గోపవేషస్య విష్ణోః॥ శ్రీకృష్ణకర్ణామృతము.

భాషాభిమానులారా! సత్యసంధులారా!

మానవులయందుఁ బక్షపాతము భగవంతునకు మిక్కిలి నెక్కొనియుండును. సర్వసముఁడగు పరాత్పరున కీ పక్షపాతము సమకూరఁదగునా యని కొందఱందురు. ఈ పక్షపాతమే యా మహాత్ముని నేర్పును వేనోళ్లఁ గొని

యాడునట్లు చేయుచున్నది. సర్వప్రాణులు నా మహనీయుని బిడ్డలనుట నిర్వి వాదము. ఆ తత్త్వము సర్వసముఁడని, నిర్లిప్తుఁడని కొనియాడఁబడును. జగ పరిపాలనమున మిగుల నేర్పు గల పరతత్త్వ మనంబడు నా భగవంతుఁడే పరి కల్పజీవులగు మానవులనే యెక్కుడుగఁ బ్రేమించునట్లు తోఁపఁజేయును. దానినే మనము పక్షపాత మందుము. ఆయన కట్టి పక్షపాతము కల దను నూహ కలిగించినది కర్మము. కర్మానుసారము కొన్ని ప్రాణికోటులు భగ వత్కృపకుం బాత్రము లగును. మఱికొన్ని కాఁజాలక యుండును. ఈ రెండిం టికిం గారణము కర్మము కర్మమార్గము నూహింపఁ జాలని వారు భగవంతు నిపైఁ బక్షపాతనిందను మోపుదురు. అంతియ కాని యతఁడు నిర్లిప్తుఁడే. అద్వి తీయుఁడే.

కర్మము భగవత్స్వరూపమే కాని వేఱు కాదు. పుణ్యపాపభేదముల నయ్యది మాఱు పేరుల నొందుచుండును. పుణ్యపాపములను జేయునట్లు చేసిన దెవ్వరు ? కర్మమే యన వలయు. అ దెట్లు? అన్న ప్రశ్నమునకు సమాధానము కుదురునట్లు చెప్పఁజాలకయే కర్మ మనాది యనిరి. అనాదిత్వము కర్మమునకు సిద్ధింపఁగా, నా ప్రశ్నముకూడ నశించినది. ఇట్లు కాఁగా భగవంతుని నిర్లిప్త త్వము స్థిరపడినది. ఏది యెట్లు మార్పు నొందినను దుష్ఫలానుభవము తఱి నా పరాత్పరునకుఁ జీవాట్లు తప్పినవి కావు. సుఖానుభవకాలమున మెచ్చుకొను పాపమునఁ బోవు వారు మాత్రము కాన రారు. ఇట్టి యిక్కట్టున నా పరాత్ప రుఁడు మాత్రము మానవపక్షపాతమును వదలఁ డయ్యెను. ఆ మహాత్మునకుఁ గల రౌా ర్పింత యని పరిగణించు వాఁ డెవ్వఁడు ?

భగవత్పక్షపాతఫలము ననుభవించు మానవుల సంఖ్య చాలఁ గొంచె మన వచ్చును. జ్ఞానప్రధానుల సంఖ్య మిగులఁ దక్కువ యని యెల్ల రుల్లముల విశ్వ సింతురు యత్కించిజ్జ్ఞానము పెక్కండ్రకుం గలదు. కాని భగవదనుగ్రహము నకుఁ బాత్రునిగ నొనరించునట్టి నిర్మలజ్ఞానము సాధారణముగా నలవడుట కష్టము. నీటి మట్టమువలె జ్ఞానము భేదమును మాన్పి సమదృష్టిని గల్గింప వల

రయును. అది యనేక జన్మకృతసుకృతవిశేషఫలము గదా. అట్టి సమదృష్టి గల వారినే పెద్దలు సమదర్శను లని పిలుతురు. వారలే పండితులు.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః॥ ౧౮
తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః ।
గచ్ఛం త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః॥ ౧౭ గీ. ౫ అ.

అను నీ గీతావాక్యములు పైని వ్రాసిన భావమును స్థిరీకరించుచున్నవి.

సుకృతము భగవదనుగ్రహపాత్రుని గా మానవుని జేయఁ జాలు ననుట సర్వసమ్మత మగు విషయము. సుకృతము లభించుట కనేకమార్గములు కల్పింపఁ బడినవి. అందు సూనృతము లోనగునవి ప్రధానస్థానము నాక్రమించినవి కావున దానిని సామాన్యు లారాధింపఁ జాలరు. మానవుల కెల్లరకు సుకృతము లభించుటకై పూర్వు లగు నార్యులు తీర్థయాత్రల నిర్మించిరి. యాగములు వ్రతములు లోనగు వాని నిర్మించిరి. ప్రతివిషయమునందు భగవద్బుద్ధి కలిగియుండవలయు నన్న మూలసూత్రమును వదలక సులభోపాయములను దెల్పిరి. తీర్థయాత్రయు యజ్ఞము సమానములా యన్న నౌ ననవలయును. దీనికిఁ గొందఱ అంగీకరింపరు, కాని వివేకము గల వార లంగీకరింతురు. ఇం దొక్క రహస్యము కలదు. భక్తి శ్రద్ధలు గల్గిననే సమము లగును. అవివేకయజ్ఞము చేసినను దీర్ఘయాత్ర చేసినను ఫలము శ్రమరూపమున సమానమే యగును. తీర్థమును భగవద్రూపముగా భావించిన "భావనామాత్రసంతుష్టహృదయః పరమేశ్వరః" అన్న సూక్తి ప్రకారము తీర్థరూపుఁ డగు భగవంతుఁడు భక్తులను గాఁపాడకుండునా ?

న హ్యమ్మయాని తీర్థాని నదే వా మృచ్ఛిలామయాః ।
తే పునం త్యురుకాలేన దర్శనా దేవ సాధవః.

అను భాగవతోక్తి వ్యర్థము కాదు గదా. "సర్వం పునంతు మా మాపః" అన్న శ్రుతియుఁ బై యర్థమునే తెల్పును. కావున శ్రద్ధాభక్తులు గలిగి మానవుఁ

డే రూపమున భగవంతు నారాధించినను గరుణానిరధి యగు నా పరమేశ్వ రుఁడు వానిం గృతకృత్యునిగఁ జేయు ననుట నిక్కము.

అపిచేదసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సంతరిష్యసి॥ ౩౬. గీ. ౪ అ

అన్న గీతోక్తి యెట్లు సార్థక మగు నని ప్రశ్నింప వచ్చును. తీర్థయాత్ర మనస్సు నిర్మలముగఁ జేయును. దాన భేదబుద్ధి నశించును. సూత్మరూపమున నున్న భక్తి వృద్ధి యగును. దానిచే భగవదనుగ్రహపాత్రుఁ డగును. కావునఁ బరంపరాసంబంధమున నీ తీర్థక్షయాత్రాదికము భగవత్కారుణ నొందు సాధన మగును. కొందఱు "భక్తిమార్గము వేఱు జ్ఞానమార్గము" వేఱు, అని మధ్యవైష్ణ వులు లోనగు వారుప చింతురు. చంద్రచంద్రికాన్యాయము ననుసరించి జ్ఞానరహిత భక్తియు, భక్తిరహితజ్ఞానము నుండ నవకాశమే లేదు. జ్ఞానరహితభక్తి యనఁగా బకధ్యానాదికమే కాని వేఱు కాదు.

తీర్థములు పరమేశ్వరస్వరూపములు. వానిని భక్తిమెయి సేవించిన యెడల నవి మానవుల నుత్తమగతికిం దెచ్చును. ఆ భావము నిర్మలతమము గావ లయును. లేకయున్న నిష్ఫలమే. ప్రాయశః మానవుల కందఱకు నీ తీర్థయాత్ర లుత్తమగతికి మార్గమును జూపునవి యన వచ్చును. తీర్థయాత్రయు నొక తపస్సే. ప్రథమసోపాన మనఁ దగిన తపస్సు. మనస్సును నిర్మలము చేయఁ దగిన సాధన మనుట సత్యము. తీర్థము జలరూపము స్థలరూపము నగును. స్థల రూపతీర్థమునకు క్షేత్ర మనియు నామాంతరము గలదు. నద నదీ హ్రదాదుల విధిగా స్నాన మొనరించి యందుఁ గల భగవంతు నర్చారూపముల దర్శించి ధ్యానించినయెడలఁ గొన్ని పాపములు తొలంగును. అంతియ గాక మరలఁ బాప కార్యముల నొనరించు నూహ యడంగు. ఇట్టి మహోపకారము చేయు తీర్థ యాత్ర నెవ్వఁడు నిరర్థక మనును ?

కొందఱు విష్ణుస్థలము లుత్తమము లందురు. కొందఱు శివస్థలము లుత్త మము లందురు. కొందఱు శక్తిస్థలములు పూజ్యతమము లందురు. ఈ మూఁడు

నింక నిట్టివి డెబ్బదివదునొకండును భగవచ్చిహ్నము లన్న వా రుండుట యరుదుగ నున్నది. ఈ భేదవాదము లంతరించినఁ గాని సాధువులకు మర్యాద రాదు. సర్వసమత్వ మలవడినఁ గాని యీ భేదము నశింపదు. అది నశించినఁ గాని యైకమత్యము కుదురదు. అట్టి కాల మెపుడు వచ్చునో తెలియక యున్నది. ఏది యెట్లున్నను శివకేశవాదిసకలనామములు పరమాత్మకుం జెల్లు ననుట నిక్కము. చెల్లవన్నచో నతఁడు భగవంతుఁడే కాఁ డనవచ్చును చెల్లునన్న యెడల భేదభావమునకవకాశమే లేదు. ఏ రూపమున నే నామధేయమున నే భక్తుడు తలంచునో యట్లే యాతని కా కరుణానిరధి పొడసూపును. అట్టు లుండ ని భేదవాదము లేలొకో తెలిసికొనఁ జాలక యున్నాఁడను.

ఈ భరతఖండమున ననేకతీర్థములు క్షేత్రములును గలవు. అవన్నియుం సమానములే. ఏవాని కెందు భక్తి కుదురునో యది యాతనికి సేవ్యం బగును. క్షేత్రములు నట్టివే యన వలయు. "దేవాలయములు శివకేశవులవే మిక్కిలి కలవు. శక్తిదేవాలయములు తక్కువ" యని కొందఱ మతము. అది పొరపాటు. శక్తి లేని దేవాలయములే లేవనవచ్చును. కేవలపురుషవిగ్రహములే కలవి యే కొలఁదిలో యుండవచ్చును. ప్రకృతిపురుషులకుం గల యవినాభావసంబంధమును దెలుపుటకే యీ దేవాలయములు నిర్మింపఁబడిన వన వచ్చును. కావున శక్తిదేవాలయములే యన్నియు ననుటకు జంకుపడ నక్కఱ లేదు. విష్ణుదేవాలయములయందు విష్ణుమాయ యనియు, శంకరాలయములయందుఁ బరాశక్తి యనియు నా ప్రకృతి పిలువంబడును. ప్రకృతి యీయిరువురకు సమాన మగునపుడు. శివకేశవులు సమానులు కావలదా. విష్ణ్వాలయములందుఁ బ్రకృతికిఁ జోటు లే దందురేని,

దైవీ హ్యేగా గుణమయీ మమమాయా దురత్యయా ।
మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే॥ ౧౪ గీ. ౭ అ.

అను నీ భగవద్గీతావాక్యములు వ్యర్థము లగును. శ్రీమహాభాగవతమునందుఁ గల

"గచ్ఛ దేవి వ్రజం భద్రే గోపగోభి రలంకృతం॥

అను నీ శ్రీకృష్ణవాక్యము వ్యర్థ మగును. అంతియ గాక విష్ణునాయకు

నామధేయాని కుర్వంతి స్థానానిచ నరా భువి ।
గు ర్గేతి భద్రికా శ్రీతి విజయా వైష్ణ వీతి చ ।
కుముదా చండికా కృష్ణా మాధవీ కన్య కేతి చ ॥
మాయా నారాయ ణీశానా శార దే త్యంబి కేతి చ ॥ ౧౩

అను నీనామములు కలవు వీనింబట్టి చూడఁగా మహాలక్ష్మికిఁ బార్వతికి భేదము లే దనియుఁ బురుషసాన్నిధ్యమున నుండి ప్రకృతి సర్వకార్యముల నిర్వహించు ననియుఁ బ్రకృతిసంబంధము లేక పూరుషుఁ డే కార్యమును జేయఁ జాలఁ డనియు స్పష్టము.

శివశ్శక్త్యా యుక్తో యది భవతి శ క్తః ప్రభవితుం
న చే దేవం దేవో న ఖలు కుశల స్స్పందితు మపి॥

అన్న శ్రీశంకరభగవత్పాదోక్తియు శ్రీకృష్ణ వాక్యము నేకార్థమునే బోధించు చున్న దని మన మెఱుంగ వలయును.

దేవాలయమునకుఁ బామరులు విశేషించి పోవుదురు. మూర్తిని దర్శించు నపుడు పరాత్పరుఁడే యిందు నీ రూపమున వెలసె ననియుఁ బ్రకృతి యీ రూపమున నిలిచెననియుఁ దలపోసి ధ్యానింతు రేని యా యాత్ర సార్థకమే యగును. వేఱుభంగిఁ దలంతు రేని వ్యర్థమే యగును. కావుననే మహాత్ములగు మన పూర్వులు వ్యయప్రయాసములకు నోర్చి పామరజనుల నుద్ధరింపఁ గోరి దేవాలయములఁ గట్టించి యందు స్త్రీపురుష విగ్రహముల నెలకొలిపిరి. సకల విధోత్సవములందు సాగుచుండ నేర్పాటు చేసిరి. ఉత్సవ వ్యాజముననైనఁ బామరు లా భగవంతుని ధ్యానింతు రని యేకదా వా రిట్లు శ్రమఁపడిరి. లేకున్న నీ దేవాలయము లేల? జ్ఞానులే రైన సర్వంబును భగవన్మయముగాఁ దల పోయుదురు. ఆ స్థితియం దుండు వారలకు దేవాలయము లక్కఱ లేదు. ఎన్ని భంగుల నాలోచించినను దేవాలయములు పామరజనులకు సన్మార్గమును జూప నిర్మింపఁ బడిన వని తోఁచును. అంతియ కాని జ్ఞానుల కొఱకుఁ గాదు.

క్షేత్రములయం దిట్టి మహిమను కల దని పురాణములు తెలుపును. ఇతిహాసములు కూడ నట్లే యొతిఁగించును. ఫల మధికముగా వర్ణించుట కలదు కదా యని కొందఱందురు. కాని వారికిఁ బురాణముల యాశయములు తెలియవేమో ? పామరులు తఱచుగా ఫలాభిసంధిసహిత కర్మముల నాచరించు వారలు. మహాఫలము గల దని బోధించినఁ గాని వా రా యాత్రకుం బోవరు. యాత్రనైన నొనరించినఁ గాని భక్తి కుదురదు. కావున ఫలము నెక్కువగా వర్ణించుట నుసంగతమే కాని యసంగతము కాదు. ఉద్దేశమే మని యూహింప వలయుఁ గాని యల్పము లగు విషయముల నెంచ రాదు.

శ్రీరామ రామ రా మేతి రమే రామే మనో రమే ।
సహస్రనామత స్తుల్యం రామనామ వరాననే॥

అనుసూక్తియు,

కోటయో బ్రహ్మహత్యానా మగమ్యాగమకోటయః ।
సద్యః ప్రళయ మాయాంతి మహాదే వేతికీర్తనాత్ ॥

అను సూక్తియు ఫలస్తుతులు గావా ? వీని సారము భగవన్నామము పాపహరమే కాని విష్ణుసహస్రనామ పారాయణము మాని యొక్క సారి రామా యన్నఁ జాలుననియు మహాపాపము లెన్నియో చేసి మహాదేవా యన్నఁ జాలుననియుఁ బెద్దల యభిప్రాయమా ? కానే కాదు. ఇంత ఫలము కల దని వర్ణించినఁ బామరులు భగవంతుని నామకీర్తనమున నాసక్తు లగుదు రనియే పూర్వుల తాత్పర్యము.

మహనీయు లగు పెద్దలుకూడ నట్టి క్షేత్రములఁ గొంత కాలము నివసింతురు తమ్ముం గాంచి పామరులు భక్తి నభ్యసింప వలయు ననియే వారి భావము. అట్టి పెద్దలుకూడ నం దుండుటం గాంచి మూఢజను లం దేమో విశేషము కల దని భక్తిగా నందు నెలకొల్పఁబడిన మూర్తి నారాధింతురు. వారిం గాంచి సజ్జనులు తమ ప్రయత్నము ఫలించిన దని మహానందము నొందుచుందురు. అట్టి క్షేత్రముల మాహాత్మ్యములు పురాణములయందుఁ గలవు. విశేషించి స్కాంద

మహాపురాణమునఁ గలవు. బ్రహ్మాండాది పురాణములయందును గొన్ని గలవు. కొన్ని క్షేత్రమహాత్త్వములు బ్రహ్మాండపురాణాంతర్గతము లని పేర్కొనఁబడును. కాని యవి తఱచుగాఁ గల్పితములు నా యెఱింగినంతదనుక నట్టి కల్పిత స్థలపురాణము లెన్నియో గలవు వ్రాతము లనేకములు బ్రహ్మాండాంతర్గము లనియే వ్రాయఁబడినది. కాని యందొక్కటియు నందుఁ గానరాదు బ్రహ్మాండ మనఁగాఁ గడుంగడుం బెద్దది యనుకొని యందుఁ జేర్చిన బాధ లే దని కల్పించిన వ్రతకథలను మెలమెల్లన నా పురాణమున నున్న యట్లు ప్రణాళిక నిర్ణయించిరని తోఁచెడు.

కొన్ని క్షేత్రములలో నొక్క తాటియాకు పొత్తమున నా స్థల పురాణము వ్రాయఁబడి యుండును. పదిపదునొకండు పత్రములలో నది వ్రాయఁబడి సమయమునకుఁ దోఁచిన పురాణము పేరు వ్రాసి ంయ దిది యున్న యట్లు వ్రాయఁబడి యుండును. పెక్కంటి నట్టి వాని నేను గాంచితిని. వాని నాధారము చేసికొని కొందఱు కవిత్వశక్తిని గనఁబఱచుచుఁ దెనిఁగించి తమకుఁ దోఁచిన కొన్ని కథల నందుం గలిపి ప్రకటించిరి. దాని నమ్మి తన్మూల పురాణము చూడ నం దీ ప్రస్తావమే యుండదు అపు డా క్షేత్రమునఁ గల భక్తి యాతనికడ నుండక కాలికి బుద్ధి చెప్పును ఇ ట్లేల కల్పించిరో తెలియక యున్నది. తఱచుగా నా క్షేత్రవాసులే యిట్టి వానిం గల్పించియో యితరులఁ గల్పింపఁ బ్రోత్సహించియో యుందురు. మచ్చున కొక్క యుదాహరణముం జూపెద. "ఈ నది గంగాదేవికిం గూఁతురు. ఒకానొకప్పుడు తల్లితోఁ గలహించి యెచ్చటికో పోవుచుండెను. నారదుఁ డపుడే యీ దేవాలయముకడఁ గూరుచుండి వీణాగానము చేయుచుండెను. తల యెత్తి చూచి యా నదిం గాంచి పిలిచి కూరుచుండఁ జేసి యామె యుదంతం బడిగి యాశ్వాసించి యందే ప్రవహించుచు నివసించఁ జేసెను. ఇందు మునింగిన గంగాస్నానాతిశయపుణ్యము లభించును. ఇందు మునింగి తన్నునాయార్ద్రివస్త్రిములతో దర్శించు భక్తుల కీ మహావిష్ణువు ముక్తి నపుడే ప్రసాదించును." అని యొక స్థలపురాణమున వ్రాయఁ

బడినది. ఇదియు బ్రహ్మాండపురాణాంతర్గతమే యఁట. అందు నుత్తరభాగమునఁ గల దఁట. రామరామ! దీని ప్రస్తావమే యం దుండ నవకాశము లేదు. ఇట్లే యన్నియు నుండు నని నా యాశయము కాదు. ప్రకృత మనుసరించెదను.

బ్రహ్మేశ్వరక్షేత్ర మాహాత్మ్యమును దెలుపు నీ బ్రహ్మేశ్వర పురాణము స్కాందపురాణాంతర్గత మని వ్రాయఁబడినది. బ్రహ్మేశ్వర క్షేత్రమునకు నలంపుర మని ప్రసిద్ధనామము గలదు. తఱచుగా నలంపూ రని పిలుతురు. ఇయ్యది కందనూలునకు (కర్నూలునకు) సార్ధగవ్యూతి మాత్రదూరమున నున్నది: బాలబ్రహ్మేశ్వరనామధేయమున శంకరుఁ డందు విజయంచేసిన యుండును. జోగులాంబ యనఁ బరఁగు యోగాంబిక యందుఁ గల శంకరునకు ధర్మపత్నిగ నుండును. ప్రకృతము కాకున్న నించుక యీదే వీ విషయమును వ్రాసెదను.

ఒకానొక కాలమున నీ దేవత పగ లెల్ల నాలయమున నుండి రాత్రి యందుఁ బ్రయాణమై కనఁబడిన వారి నెల్ల భక్షించుచుండెను. ఎవ్వరును రాత్రియందు సంచరింప మానిరి. గృహములలోనికి మాత్ర మా యంబ రా నోడుచుండును. ఎంత కాలమో యిట్లు సాగెను. అవల నాదిశంకరాచార్యులవారీ దేవత చేయు బాధలను గాంచి ప్రజల యార్తిఁ బాఁపనెంచి యామెను నిర్బంధించి సంచరింపఁజేసెను. నాఁడు మొదలుకొని సంచరింపక యోగాంబ యున్నది అను నొక కథను జెప్పుదురు. కాంచీనగరమున నిట్లే యాచార్యులవారు చేసిరని పల్కుదురు. ఈ కథ కేవల మజ్ఞానులచేఁ గల్పింపఁబడినని ఈపాషాణములు పగ లూరక యుండి రాత్రి సమయమున సంచరించుట విశ్వాసపాత్రము కాదు. శ్రీశంకర భగవత్పాదులు పాషాణరూపమున నున్న వీని యుద్ధతి నాఁపఁ బూనెననుటయు నసంగత ప్రసంగమే. పాషాణములయం దా మహనీయునకు భక్తి కుదిరె ననుట యంతకంటె నసంగతము.

సంద ర్శ్యాథ శిలాం శిలామయగృహే సాక్షా దయం శ్రీహరి।
ర్భక్తేభ్యో వివిధాన్ ప్రయచ్ఛతి వరాన్ సంసేవ్యమాన స్త్వితి ।

ఉక్తాం దేశలతిస్యవాచ మధికం విశ్వాస్య సంసేవతే।
త్వర్థం తత్త్వమ సీతి వేదగదితం నో విశ్వాస త్యల్పధీః॥

అని ప్రతిపాదించిన మహాత్మునకు విగ్రహార్చనాసక్తి పొడమె నన రాదు. అందును బరదేవీభక్త కాలశంకరభగవత్పాదుల కెట్టి వెఱ్ఱి నమ్మకము లుండునా.

అలంపూరున భక్తానుగ్రహార్థము వెలసియున్న పరాశక్తి యోగాంబ (జోగులాంబ) భీకరముగఁ గన్పడును. కాని భక్తానుగ్రహమున మాత్రము మంబయే యన వలయును. పెద్దలు పదునెనిమిది స్థలములయందు నీశక్తిపీఠముల నిలిపిరి. అందే చోట నైన నిలిచి దృఢభక్తి గలిగి మంత్రోపాసన మొనరించిన మానవున కా యంబ సాక్షాత్కరించును. దుర్వాంఛలు గల వారల నిర్మూలించును. సద్వాంఛలు గలిగినవా సంరక్షించును. పూర్వమహర్షులు విగ్రహముల నెల కొల్పుట పామరు లవ్వానిని దర్శించి దర్శించి కొంతకాలమున కైన మానసికారాధనతత్పరు లగుదు రనియే కాని వేఱు కాదు.

శ్లో॥ ప్రదీపజ్వాలాభి ర్దివసకరనీరాజన విధి।
సుధాసూతే శ్చంద్రోపలజలలవై రర్ఘ్య రచనా!
స్వకీయై రంభోభి స్సలిలనిధి సౌహిత్యకరణం।
త్వదీయాభిర్వాగ్భి స్తవ జనని వాచాం స్తుతి రియం॥

అన్న భావము గల మహనీయుఁ లేల పాషాణవిగ్రహములను స్థాపింతురు? అర్చారూపములు ధ్యానగమ్యములు గావలయును. లేకున్న వానివలన లాభము లేవియుఁ నుండవు. ప్రకృతవిషయమున యోగాంబ మహిమమును గుఱించి పెంచి వ్రాయ నక్కఱ లేదు. జగత్ప్రసిద్ధవిషయము. ఈ యోగాంబ శాస్త్ర తంత్రోక్తపంచాశత్పీఠదేవతలలో నొక పీఠదేవత కాదు. కాని లోకానుగ్రహార్థ మవతరించిన పరమేశ్వరి మూలప్రకృతియే యన వలయును. ఎందఱో భక్తు లిందు నివసించి సేవచేసి కృతార్థు లై రని వినికి గలదు.

ఈ బ్రహ్మేశ్వరపురాణము స్కాందపురాణాంతర్గత మని కవియే వ్రాసియున్న వారు. శ్రీశైలఖండము స్కాందాగ్గత మని విన్నాఁడను. కాని

నే నాభాగముఁ జదువ లేదు. శ్రీశైలమునకు నీక్షేత్రము పశ్చిమద్వార మని యీపురాణమునఁ గలదు. (1) స్కాందమహాపురాణ మాఱు సంహితలుగను, ఏఁబది ఖండములుగను విభజింపఁబడినది. అందు నీ ఖండ మొక్కఁడుగా నుండ వచ్చును. ఆ పురాణము నాధారము చేసికొని యి క్కవివర్యులే పుస్తకమును వ్రాసిరి. మూలమున కిది యెట్టి భాషాంతరీకరణమో నిర్ణయింప నవకాశము నాకు లేదు. (2) కావున నా జోలికిం బోవక "స్థితస్య గతి శ్చింతనీయా" అన్న న్యాయము ననుసరింతును.

భాషాంతరీకరణ మొనర్చిన వా రార్యవైశ్యులు. దోమాస్వవాయులు. కందనూల్పురవాసులు, కోటాంబికాగోవిందార్య తనూభవజ్యేష్ఠులు. శ్రీరామ చంద్రపాదారవిందభక్తులు. నానాదేశబుధానీకప్రదత్తశ్రీమదాంధ్రవిద్యావాచస్పతి సాహిత్యసరస్వతీ, విద్యావినోద, కవిభూషణాదిబిరుదాంచితులు. వేంకటస్వామినామధేయులు, ఇట్టి వీరు

శా. శ్రీరాముండు మదిష్టదైవతము, లక్ష్మీవేంకటేశుండు క
ల్యారంభాంతకుఁ డింటి వేల్పు, గిరిజాబ్రహ్మేశ్వరుం డీ కథా
ధారుం డెంతయుఁ గుందు నా దయిన హృత్కంజాతముం. బేర్మి వి
స్తారానందము నొందఁ జేసి ననుఁ గాంచం జేయుతన్ మోక్షమున్.

అని వ్రాసికొన్నందున భక్తిభావమున ముక్తిని గోరి యీ పురాణము వ్రాసినట్లు కనుపట్టు. ఈ వాంఛ గల్గుట మిగుల శ్లాఘ్యము.

.....................పాపవ్రాతదూరంబు, శాం
భవసంబంధము నీ ప్రబంధమును జల్పం బూను వాఁడం బురా
భవదుర్వారతరాఘవారణముగా బ్రహ్మేశ్వరాఖ్యానమున్.

అనియు వ్రాసియుండుటంబట్టియు నీ పురాణమూలమునఁ బరమేశ్వరు నారాధించి పురాకృతదుష్కృతము లున్న వానిని భస్మముచేయ వలయు నని ప్రయత్నించినట్లు స్పష్టము. ఇట్టి యూహలు సత్కృతులకే కలుగు ననుట నిర్వివాదాంశము.

"వ్రాసితి నెన్నియో కృతులు వ్రాయఁగ నుంటి నిఁ కెన్నియో దయా
భ్యాసురరామచంద్రసదపారకృపాపరతంత్రసత్కవి
త్వాసమధోరణీవిభవ మందముఁ జందము నొందునట్లు."

అని యుండుటం బట్టి వీరి ప్రయత్న మెట్టిదో స్పష్ట మగును. ఇట్టి మంచి యభిప్రాయము గల మాన్యులకు స్వప్నమున బ్రహ్మేశ్వరస్వామిప్రత్యక్షమై యీ పురాణము తెనిఁగింపు మని పురికొలుపకపోవుట యచ్చెరువు గల్గింపక మానదు. ఈ విషయమున నా కించుక సంశయము కలదు. స్వప్నమునఁ దోఁచినను బయలుపఱుప రా దను భావ మాని యుందురా ? లేక పరమేశ్వరుఁడు ప్రత్యక్షమే కా లేదా. ఈ సంశయ మెట్లునివర్తించునో తెలియదు. (3)

ఈ వేంకటస్వామిగుప్తగారి కవిత్వము మిగుల సొంపుగా నున్నది. పదములు కుదురక నిఘంటువులఁ ద్రిప్పిన ట్లగపడదు. భావము స్పష్టముగాఁ దోఁచుచుండును. కాని వెదక వలసిన యవసరము లేదు. దీర్ఘసమాసములయందు వీరికి మిగుల మక్కువ గల దని యీ పురాణమే తెల్పుచున్నది. కథ లన్నియు భక్తిరసప్రధానములు. హృదయంగమములు. కావున నీ పురాణము సర్వజనులకుఁ బఠింపఁ దగినది. ఇట్టి యుత్తమపురాణమును రచించి యిక్కవితల్లజుఁడు ధన్యుఁ డయ్యెను. ఇంక నిట్టి యుత్తమపురాణముల రచించి తెలుఁగుదేశవిఖ్యాతిని బెంపొందఁ జేయుఁగాక. రాయలసీమ వీరిమూలమున విశేషించి విఖ్యాతిని గాంచుఁ గాక. భగవంతుఁడు వీరి కాయురారోగ్యములు ప్రసాదించి కాపాడు చుండుఁగాక. ఈ పురాణమునుగూర్చి వ్రాయఁదగిన విశేషము లనేకము లున్నను గ్రంథవిస్తరభయమున విరమించుచు నీ ప్రబంధకర్తలను సత్కవు లాశీర్వదించి యీ గ్రంథము నెల్లయెడల వ్యాపింపఁ జేయుదురు గాక యని వారక కోరుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు సుజనవిధేయుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ.

## బ్ర॥ శర్మగారి పీఠికలోని విషయములలో గొన్నింటి కీష ద్వివరణము.

(1) శ్రీశైలమునకు నాలుగు ద్వారములు.

పూర్వద్వారము—త్రిపురాంతకము—కర్నూలుజిల్లా మార్కాపురము తాలూకాలో నున్నది. దక్షిణద్వారము—సిద్ధవటము కడపజి పశ్చిమద్వారము అలంపురి, నైజాంఇలాకా—కర్నూలునకు దగ్గఱ. ఉత్తరద్వారము—ఉమామహేశ్వరము—నైజాంఇలాకా—అచ్చెమ్మపేటకు సమీపము.

(2) బ్ర॥ శర్మగారికి మూలము పంప వీల్గా లేదు. దానిని నాకుఁ గొన్ని సం॥లు ముందుగా నొసంగియుండిన మిత్రములు కోరినందున ఆపుస్తకము వారి కప్పటికే పంపఁబడియుండెను. నేను కోరినను అయ్యది మరల నెందుకో నాకడకు పంపఁబడ లేదు. ఈ కారణమున "పెంపులో కుంచింపులో యున్నను విషయములుమాత్రము మూలము ననుసరించియే వ్రాసితి"నని నే నీ మనవి చేసికొనుచున్నాను. మ॥ ప్రతాపరెడ్డిగారి యభిప్రాయమును అదియే.

(3) ఏతద్గ్రంథరచనకారణము నా కెట్టిదేనియు స్వప్నము గల్గుట గాదు. ఆ తీర్థరాజంబున నా కేర్పడిన మక్కువంజేసియే యీ స్థలపురాణమును వ్రాసితిని.

దో. వేం. గు॥

శ్రీ.

గ్రంథకర్తకు మిత్రములును, ప్రకృతముదక్కన్ హాయిదరాబాదులో న్యాయవాదులును, అభిజ్ఞులును, దేశభాషాభిమానులును, చరిత్రాంశపరిశోధకులును అయిన మ॥ సురవరము. ప్రతాపరెడ్డి బి. యె. బి. యల్ గారు దయ చేసిన చరిత్రాంశయుక్తమయిన

# పీఠిక (2)

శ్రీ బ్రహ్మేశ్వరపురాణమును సంస్కృతమునుండి యాంధ్రములోనికిఁ బరివర్తనము చేయు నదృష్టము శ్రీ దోమా. వేంకటస్వామిగుప్తగారి కబ్బినది.

ఈ పురాణము అలంపూరునకు సంబంధించినది. అలంపూరు రాయచూరుజిల్లా లోనిది. ఈ యలంపూరు ననేక నామములతో వ్యవహరించి యున్నారు. కాని శాసనములందు మాత్రము "హతంపురము"నియే పేర్కొనఁబడినది. ఈ క్షేత్ర మాహాత్మ్యమును గురించి యస్మన్మిత్రు లగు శ్రీ వేంకటస్వామిగుప్తగా రాంధ్రీకరించిన గ్రంథమునుండి పాఠకలోకము గుర్తెఱుంగఁ గలదు.

సాధారణముగా నార్యావర్తమందలి యనేక పుణ్యక్షేత్రములకు నేదో యొక మాహాత్మ్యము భక్తుల దృష్టిలోఁ గల దనుట నిర్వివాదాంశము. అది సహజము. కాని యిన్ని క్షేత్రములవలెఁ గాక యీ యలంపురీక్షేత్రము ప్రాచీనవైభవముఁ బట్టియు, క్షేత్రదేవాలయశిల్పసౌందర్యమును బట్టియుఁ, బూర్వరాజుల శ్రద్ధావిశేషమును బట్టియు, నెక్కుడు గౌరవస్థానమున కర్హత పొందినట్టిది. ఈ స్థలపురాణము స్కందపురాణాంతర్గత మని వ్రాయఁబడినను గ్రంథమందలి యొకటి రెండు మాటలను బట్టి యీ మాహాత్మ్య మిటీవల నెవ్వరో యొక భక్తునిచే వ్రాయఁబడినట్లు కనఁబడుచున్నది.

ఈ పురాణములో "ఎల్లమ్మ" "జోగులమ్మ" యను దేవతలను జేర్చుటయే నాయీ యనుమానమునకుఁ గారణము. ఈ రెండును తెనుఁగు శబ్దములు. ఎల్లమ్మ రేణుకయే యని పురాణమునఁ బేర్కొనఁబడినది. ఈ యెల్లమ్మ దేవత యైన నాటినుండి యీస్థలము ఎల్లమ్మపురమని వ్యవహరింపఁబడి దాని యపభ్రంశముగాఁ దర్వాత అలంపురమని యయ్యెనో యేమో! ఈ ఎల్లమ్మనే సంస్కృతమున "హేమలా" దేవినిగాఁ జేసియుందురు. "జోగుళ"యను పదమును దెనుగుపదమే. ఈ జోగులాంబ జోగులైన జైనభిక్షుకుల దేవతయై తర్వాత హిందూదేవత యై యుండును. జోగిణి యను నొక దేవత యుండినట్లు నాచనసోముఁడు "జోగిణీఁ గొసరి బైనుకవెట్టి"యని వర్ణించినాఁడు.

ఏది యెట్లున్నను నీ క్షేత్రము శైవక్షేత్రములలోఁ బ్రధాన మైనది. ఇక ఈస్థలమందలి దేవాలయము లెప్పుడు కట్టఁబడెనో, యీ క్షేత్ర మెప్పటి నుండి భక్తజనసంసేవ్యమయ్యెనో యను నంశములఁ జారిత్రకముగా విచారించు

టకుఁ బూర్వము స్థలపురాణ మేమి చెప్పనో విచారింతము. ఈ క్షేత్రమందలి దేవాలయములు ద్వాపరయుగాంతమందు రసాసిద్ధుఁ డను నొక మహానుభావు నిచే నిర్మింపఁబడినట్లు స్థలపురాణమం దున్నది. ఈ రసాసిద్ధుని కాలమునందే "విలసత్" అను దుష్టరాజొకఁడు రసాసిద్ధునితోఁ బోరినందున రసాసిద్ధుఁడు శివసాయుజ్య మొందెననియు, దర్వాత విలసద్రాజు క్షేత్రము నంతయు నాశనము చేసెననియు నీపురాణము చెప్పుచున్నది. ఈ రాజు వివరము లేవియు మనకుఁ దెలియవు. ఈ క్షేత్రమందు రసాసిద్ధుని విగ్రహ మొకటి నేటికినిఁ గలదు.

పురాణమందలి రసాసిద్ధవిలసద్రాజయుద్ధమువలన మన మింత గ్రహింపవచ్చును. రసాసిద్ధుఁడు అను మహాపురుషుఁ డీక్షేత్రదేవాలయములఁ గట్టించి యుండవచ్చును. విలసత్తుఅను వాఁడో మఱి యెవ్వరో యొక్క హిందూమతేతర రాజీ క్షేత్రముపై విజయధ్వజ మెత్తి రసాసిద్ధుని యుద్ధమందుఁ జంపి దేవాలయముల ధ్వంసము చేసి యుండును. మొత్తముపై నీ క్షేత్రము జైమ విజృంభణకాలములో ననగా క్రీస్తుశకారంభము వఱకే ప్రసిద్ధస్థలమై యభివృద్ధి నొందినట్టిది.

ఈ యలంపురిని శాసనములో "హతంపుర" మనియేల వ్యవహరించిరో స్థలపురాణమునుండి గాని స్థాపకులవలనఁ గాని యేమియు బోధ యగుట లేదు. బహుశః పై విలసత్తే యీపురిని "హతము" గావించిన దీనికీపేరు వచ్చెనో యేమో !

ఇంతవఱకు స్థలచరిత్రావిషయమై మన మూహాప్రపంచమందే సంచరించు చున్నాము. ఇఁక చరిత్రను గొంత లేవనెత్తి విచారింతము. ఈ స్థలచరిత్రమును నిర్ణయించుట కష్టమైన పని. ఏల యన నిం దనేకశాసనములు భూమిలో విశేషభాగము పూడియున్నవి. ఇచ్చటి దేవాలయములందును నదీతీరమందును నితరస్థలములందును సుమారు ౫౦ వఱకు శాసనము లున్నవి. దృష్టిగోచరముగాని విఁకెన్ని యున్నవో యా బ్రహ్మేశ్వరునికే యెఱుక. ఒక శాసనము ఇటికేలపాడను గ్రామపుఁ బొలిమేరరాతిగాఁ బాతఁబడి యున్నది. అందుఁ గనఁబడు

భాగములోఁ బ్రోలరాజు పే రున్నది బహుశ యతఁడు ఓరుగల్లురాజులలోని వాఁ డేమొ! అనేకశాసనములు బట్టబయల వాతాతపముల పాలై మాసిపోవుట చేతను, నొకటి రెండు దేవాలయములు మసీదులుగా మార్పఁబడుటచే నందలి విగ్రహములతోఁబాటిగ శాసనములును మాయమై యుండుటచేతను, నీదేవాలయ ములు మారుమూలలం దుండి పథికులకుఁ బరిచితములు గానందునను, చరిత్రకారు లెవ్వరును నీవైపునం దమ దృష్టిని బ్రసరింపఁ జేయనందునను నిచ్చటి చరిత్రము నిదమిత్థ మని నిర్ణయించుట కష్టము.

మన కిచ్చట లభించుశాసనములలో శ్రీకృష్ణదేవరాయలయొక్కయు, ఓరుగల్లురాజులయొక్కయు, చాళుక్యులయొక్కయు శాసనములు గలవు. నేను జూచినంతవట్టు త్రైలోక్యమల్లదేవర శాసనము కట్టకడపటిదిగాఁ దోఁచు చున్నది. ఇతఁడు క్రీ. శ ౧౬-వ శతాబ్ది వాఁడు. శ్రీకృష్ణదేవరాయల దింతకన్న పూర్వశాసనము. ఈరెండును దానశాసనములు. ఇంతకన్నఁ బూర్వముది, "పేర్మాడిదేవమహారాజుల ప్రధాని అయితంరాజుగారు" "కంచికామాక్షి" గుడిదగ్గఱ శా. శ. ౧౨౭౧ లో వ్రాయించిన శాసనము. దీనికన్నను పూర్వముది శా. శ. ౧౨౨౧ లో వ్రాయించఁబడినది. ఈ రెండును దెనుఁగుశాసనములు. అన్నిఁటిలో నీ కడపటిదే ముక్కుమొగము గల్గి చదువ వీలుగలది. ఈ శాసన ములో "హతంపుర"మనియు, "అలంపూరు" అనియు రెండుపేరులు కనఁబడు చున్నవి. ఇంతకుఁ బూర్వపు శాసనములో (౧౨౭౧ లో) 'హతంపుర'మనియే యున్నది. ఇందుచే అలంపురమను పదము ౧౨౭౧ శా. శ. తర్వాతనే వాడుక లోనికి వచ్చిన దనియు, ఆ నాటినుండియే "ఎల్లమ్మ" దేవత ప్రాముఖ్యతఁ గన్న దనియు మూహింప వచ్చును.

తక్కిన శాసనములు విశేషముగాఁ జాళుక్యులవై యున్నవి. ఇం దొకటి చాళుక్యవిక్రమశక ౧౦ అనియు, ఒకటి చాళుక్యవిక్రమశక ౩౨ సర్వజి త్సంవత్సర ఉత్తరాయణసంక్రాంతి నాడు బాలబ్రహ్మేశ్వరునికి దాన మిచ్చిన దనియు, నిం కొకటి చాళుక్యశక ౩౭ అనియు నున్నవి. చాళుక్యవిక్రమశకము

గ్రంథములో నిట్లు వ్రాసినారు. "ఒక కాలమందు హిందూస్థానమందు పురుషచిహ్న (Phallus) పూజ జరుగుచుండెను. ఈ లింగము తర్వాతికాలములో శివునియొక్క "అవ్యక్తచిహ్నము"గా నేర్పడెను. గోపీనాథరావు గుడిమల్లములోఁ గనిపట్టిన లింగము ౫ అడుగుల యెత్తైనది. దీనిలో నొక (నగ్నమైన) యనార్య విగ్రహమున్నది ......ఇది బహుశః క్రీ. పూ ౨ వ శతాబ్దముదో ప్రథమశతాబ్దముదో కావచ్చును."

గుడిమల్లలింగమునకు, అలంపూరి లింగమునకు భేదము విశేషముగాఁ గాన రాదు. అందుచే ఆలంపూరి లింగమున్నైపై దానికి సమానకాలమున్నదై యుండును. అలంపూరి విగ్రహములు చాల సుందర మైనవి. సాధారణముగా నాయా దేశములందలి దేవవిగ్రహము లాయా దేశముల యాకారములఁ బట్టి యుండును. వరాహమిహిరుఁడు తన బృహత్సంహితయం దిట్లు వ్రాసినాఁడు. "దేశరూపభూషణవేషాలంకారమూర్తిభిః కార్యా ప్రతిమా లక్షణయుక్తా సన్నిహితా వృద్ధిదా భవతి" ఈ నియమములఁ బట్టి చూచినను నిచ్చటి విగ్రహములు ద్రావిడదేశవిగ్రహములవలెఁ గాన రావు.

ఇట్టి యపూర్వశిల్పరామణీయకము మహమ్మదీయరాజ్యాక్రమణకాలములో బహువిధముల నాశనముచేయఁ బడినట్లు నిదర్శనము లున్నవి. నవబ్రహ్మ దేవాలయములలో నొకటి పూర్తిగా మసీదుగాఁ జేయఁబడినది. ఆ దేవాలయ గోపుర మెగిరిపోయినది. దేవళముచుట్టు నుండిన (ఆక్షేపణీయములు గాన) విగ్రహములన్నియుఁ జెక్కివేయఁ బడినవి. ఈజాడ లన్నియుఁ జూచువారికిఁ గనఁబడుచున్నను ౧౯౨౭ సంIIపు నిజాంరాష్ట్రపు ఆర్షశాఖానివేదికలు తెలిసియో తెలియకయో యట్లు వ్రాసినారు. "దేవాలయసమీపమున నొక మసీదున్నది." విమర్శ అనవసరము. ఇదే నివేదికలో నింకొక పొరపాటు కలదు. "నవబ్రహ్మదేవాలయముల కట్టబడిన నొకగోరీకలదు. షా అలీ అను నొక ఫకీరు కంచికామాక్షిని మోహించ నామెను నతనికి యుద్ధము జరిగెను. ...., కామాక్షి దేవి ఫకీరుతల నరికెను. ఫకీరుతలయే యిచ్చటిఁ గోరీలో నున్నది." కాని యీకథ

సరియైనదిగాఁ దోచదు. ఫకీరేమి, కామాక్షీవిగ్రహముతోఁ బోరాడు టేమి. అలంపూరుప్రదేశమందలి జనులు నేటికిని నొక గాథ యిట్లు చెప్పుదురు. "ఒక బ్రాహ్మణు డచ్చట సన్యసించి ముసల్మానుల భోజనముగూడ నంగీకరించు చుండెను. అందుచే హిందువు లతని దూషించిరి అవసానకాలమం దతని మాహాత్మ్యములు కొన్ని చూచి యతని సమ్మతిచే హిందువు లతని కా దేవాలయమందు సమాధి చేయ మొదలిడిరి ముసల్మాను లతనిని తమ వాఁడని వాదించి నుదకు వాదమున కుపబలముగా నతని తలను గోసికొనిరి. అంత హిందువులు శవమును వదలిరి. తర్వాత ముసల్మాను లతని నచ్చటనే పాతి పెట్టి అతనికి షా అలీ నూశననామకరణము చేసి యిప్పు డేఁటేట ఉరుసు చేయుచున్నారు." ఇక్కడయే నిక్కము మండ నోపు.

నాకుఁ దోచినట్లు అలంపురీదేవాలయచరిత్రము నివేదించికొనినాఁడను. ఆరంభమునుండి నేటివఱకును వీని సంబంధ మగు విషయముల వ్రాసినాఁడను. ఇట్లు చూచిన నీ యలంపురీదేవాలయములు కనిష్ఠము క్రీస్తుపునకుఁ బూర్వము ౨౦౦ సంవత్సరముల నాఁడు ప్రారంభమై జైనశైవమతసంఘర్షణమునకు లోనై క్రీ. శ ౭-వ శతాబ్దమందు ప్రాకారనిర్మాణమై తర్వాత చాళుక్యాంధ్ర రాజుల భక్త్యాదరయుతమై, క్రీ. శ. ద్వాదశపంచదశాబ్దముల మధ్య వీరశైవ మతస్థుల దృష్టిలో సప్తాదశతీర్థరాజములలో గణనీయమై పంచదశాబ్దానంతరము మహమ్మదీయకల్లోలములకు లోనై నానాటి కీపవిత్రక్షేత్రము క్షీణదశ నొందుచు వచ్చిన సంగతి పాఠకులు నేను పై నుదహరించిన యంశములనుండి గ్రహించి యుందురు.

వీరశైవమతము హిందూమతములో నొక ముఖ్యశాఖ. వీరశైవులు హిందూమతములో నొక నూతన తేజమును గల్గించిన వారు. హిందూమతము బలహీనమై నానాదురాచారములకు లోనై క్షీణదశనొందుచుండిన కాలములో వీరశైవము విజృంభించి నూతనశక్తిని నావేశింపఁ జేసినట్టిది. సంఘసంస్కార మును బ్రచండముగాఁ జేసినట్టిది. హిందువులలోని మెతకతనమును హ్రస్వదృష్టిని

విభేదములను బరస్పరద్వేషబుద్ధులను బోనడఁచి సర్వవ్యాపకమై జాతిభేదములను పాటింపక సర్వజనాదరణీయమై యొప్పినట్టిది వీరశైవము. ఈయలంపురీప్రాంతము లన్నియు సుమారు ౧౦౦౦ సం॥ల క్రిందట వీరశైవవ్యాప్తికి నాటపట్టులై యుండినట్టివి. బసవేశ్వరుఁడును బండితారాధ్యులును నీప్రాంతములందు సంచారము చేసినవారు చెన్నబసవేశ్వరుఁ డీప్రాంతములందే నివసించిన వాఁడు. సంగమేశ్వరము అలంపురికి ౫-౬ మైళ్ల దూరమున నున్నది. ఇచ్చటనే చెన్నబసవేశ్వరుఁ డుండినట్లు శైవపురాణములు తెలుపుచున్నవి సాధారణముగాఁ బ్రాచీనమందుఁ బురాణములు సంస్కృతమం దుండెడివి కాని వీరశైవులవలన నాంధ్రవాఙ్మయము వృద్ధినొందినది. బసవపురాణము పండితారాధ్యచరిత్ర, చెన్నబసవపురాణము మున్నగు నుత్కృష్టగ్రంథము లాంధ్రవాఙ్మయమందుఁ బ్రథమస్థానము వహించినవై యున్నవి. అలంపురీమాహాత్మ్యము సంస్కృతమునం దింతవర కెందును బ్రచురింపఁబడలేదు. శ్రీయుతదోమా వేంకటస్వామిగుప్తగారొక వ్రాతప్రతిని సంపాదించికొని దాని నాంధ్రీకరించి దానికి "బ్రహ్మేశ్వర పురాణ"మని నామ మిడినారు. మూలగ్రంథమందు అలంపురీమాహాత్మ్య మనియు, శ్రీశైలపశ్చిమద్వారమాహాత్మ్య మనియుఁ బేర్కొనియున్నారు అలంపురీదేవస్థానములలో బాలబ్రహ్మేశ్వరదేవాలయ ప్రఖ్యాతి వహించినట్టిది. అందుచే మన కవిగారీ నూతననామకరణము చేసియుందురు. ఏది యెట్లున్నను నేను మూలమును, వీరు వ్రాసిన యాంధ్రమును సరిపోల్చి చూచినాఁడను మూలగ్రంథములో నుండు విషయములఁ గ్రమపద్ధతిపై తమ ప్రబంధమందు బాగుగాఁ బరివర్తనము చేసియున్నారు. అచ్చటచ్చట వర్ణనాంశములందుఁ గొంత పెంచి తమభావనావైశద్యమును బ్రకటించి యున్నారు అయిదవ యాశ్వాసములో విలసద్రాజుకథ యున్నది. అది మూలమందుఁ జాల కొలఁదిగా నున్నను దానిని వీరు విపులముగా నౌచిత్యభంగము గానట్లుగాఁ బెంచి శైలిమాధుర్యముచేత నేమి, వర్ణనావిషయముచేత నేమి, మనోహరతను సమకూర్చినారు. ఈ కథలోని రాజును, జింకయు నలంపూరులో స్తంభములపైఁ జిత్రింపఁబడినవి.

శ్రీయుత వేంకటస్వామిగుప్తగారి యీ గ్రంథమందలి శైలి రమ్యముగను, బటుత్వముతోఁ గూడినదిగను, నున్నది. తెనుఁగుపదములకన్న సంస్కృతపదములే యెక్కుడు హెచ్చుగాఁ బ్రయోగింపఁబడినవని తలఁచుచున్నాను. ఇందలి శైలి పురాణరీతిగా నున్నది. అనఁగాఁ బ్రాచీనులు పురాణముల వ్రాయుటకే విధమైన శైలి నుపయోగించిరో యదే విధమైన మన కవిగారును సులభ సాధ్య మగు రీతిని నిసిగింపని వర్ణనలతోఁ గూర్చి కబ్బము నల్లినారు. ఈ గ్రంథము వలన నాంధ్రలోకమునకు ముఖ్యముగా శైవులకును, చారిత్రిక పరిశోధకులకును, భక్తులకును జాల నుపయోగముగా నుండఁ గలదు. శ్రీదోమా వేంకటస్వామిగుప్త గారు సుప్రసిద్ధులు, అనేక సభలందుఁ దమపాండితీప్రకర్షము జాటిన వారు. శతావధానులు మహాజపాండితీవిరాజమానులు. ఈ యాంధ్రీకరణమువలన నాంధ్రులు చాల లాభము నొందఁ గల రనుటలో సందేహము లేదు. ఆంధ్రులు వీరిని సదా యిట్టి గ్రంథములను బ్రకటించి భాషాసేవఁ జేయుటకై ప్రోత్సహింతురు గాక

Reddy Hostel
2nd August, 1931
Hyderabad Dt.

సురవరము. ప్రతాపరెడ్డి.

## పీఠికాకారచయితలయెడఁ గృతజ్ఞత.

(1) బ్ర॥ కా॥ వ్య॥ శ్రీ కీర్త్యాభినవాంధ్రవాల్మీకివ్యా —జనమంచి శేషాద్రిశర్మగారు, సం. పండితులు, మునిసిపల్ హైస్కూలు, కడప.

(2) సురవరము. ప్రతాపరెడ్డిగారు, బి. యే. బి. యల్. హైకోర్టువకీలు, హాయిదరాబాదు, దక్కన్.

మ. కరముం బ్రహ్మమహేశదివ్యకథ వేఁగం జేత నైనంత నే । ను రచింపం గగనట్టి
యీ కృతికి సన్నుత్యాదృతిం గూర్చికల్ । పగవారాగని వ్రాసి యిచ్చి సుధీ
వంద్యుండు శేషాద్రివి । ద్వాంసుఁడున్, మేటి ప్రతాపరెడ్డియును వారిద్దరున్ శ్రీయుతుల్
మిక్కిలిన్.

దో. వేం. గు.

శ్రీరామచంద్రాయనమః.

# కృతజ్ఞత

నైజాం ఇలాకా కొడంగల్లువాస్తవ్యులును, శ్రీమంతులును, విద్యారసికులును, అయిన కీ॥ శే॥ కోట్రికె. పుల్లయ్యసెట్టిగారు కొన్నిసంవత్సరముల క్రింద సికింద్రాబాదులో నాకు నవ్యాజముగా దరిసెనం బొసంగి యత్యంతాదృతితో మాటలాడిరి. వారు స్వయము కవీశ్వరులును, గయోపాఖ్యానము మనోరంజన జావళ్లు మొ॥ గ్రంథముల రచించిన వారును, కనుక నాపైఁ జేర్మిఁ జెంది, నా పొత్తములలో నొకదానిని గృతి గైకొందు మని యుండిరి కతిపయసంవత్సరంబులకు ప్రమోద సం॥ ఫాల్గుణ బ ౧౦ తిధిని వారు దివంగతు లయిరి. అంతవఱకుఁ గృతిగ్రహణవిషయమై మాకుఁ గొన్నిజాబులు జరగి యా ప్రస్తావన యాఁగి యుండెను. వారి స్వర్గమనానంతరము వారికొమరులు శ్రీ భిక్షయ్యసెట్టిగారు పరిపూర్ణమనస్సుతో నన్నుఁ దమ యూరు పిల్పించి, తమ తండ్రిగారి మనంబు ననుసరించి నాపొత్తంబులలో నొకటియు, శ్రీ స్కందపురాణాంతర్గత శ్రీశైల ఖండభాగాంధ్రీకరణంబును, పుణ్యక్షేత్రరత్నంబును దక్షిణకాశీ విఖ్యాతంబును నగు అలంపూరి స్థలపురాణమును, శివభక్తి విలసితంబును, అయిన శ్రీబ్రహ్మేశ్వర పురాణము (ఈపొత్తము) నచ్చువేయించుటకుఁ దగు ద్రవ్యసాహాయ్యము గావించిరి. తండ్రిగారిబాబతు జమపద్దయినదోఁ దయా రయి, ఖర్చుపద్దయినదో నాకుఁ దెలియదు పొమ్మనిపలుకు వారు విశేషముగాఁ గల యీ నాళ్లలో తండ్రిగారి మనంబు ననుసరించి ద్రవ్యాధిరాశిం బొసంగు శ్రీభిక్షయ్యసెట్టిగారు స్తవనీయులు. అందులో ఇయ్యది కవిత్వపత్కారము. అదియు, ఆంధ్రకవిత్వాభిమానమునకు శ్రీమంతులమనంబులకును ఆమడల దూరంబు పెరిగి పోవుచున్న నేఁటి నాళ్లలో జరుగుట యింకను పొగడఁ దగినదియ కదా? శ్రీ కోట్రికవారిని గూర్చి యీసందర్భమున నేను రచించిన పద్యంబులును, ఒకటిరెండు ప్రాస్తావిక పద్యంబులును, ఇందు పొందుపఱుపఁ బడుచున్నవి.

శ్రీరామచంద్రాయనమః.

## శ్రీకొడంగల్లు కోత్రికెవంశమువారితో నాకుఁ గల్గిన స్నేహప్రకారము.

శా. శ్రీమద్వేంకటశైలనాథపదరాజీవభ్రమద్భంభర। ప్రామాణ్యాత్ముఁడు, వైదుష్యయుతకళాప్రారంభసంరంభుఁ, డుద్దామస్థైర్యుఁడు, కోత్రికావ్యయుఁడు, శ్రీఘన్యుండు, పుల్లాఖ్యుఁ డీ। క్ష్మామాన్యోరుజవంశరత్నము కొడంగల్పూర్నివాసుం డొగిన్. మ. ఒకట న్నేను సికింద్రబాద కవధానోద్యోగినై యేఁగి, యం। దకలంకాత్మకు లైన మిత్రు లవధానాదుల్ పొనర్పించి, మెచ్చికఁ జూపన్ రహిం నుంటి, నప్డు మన న్సుశ్రీయుక్తుఁడౌ పుల్లనా। మకుఁ డవ్యాజమొదంబున న్నను గనన్ మర్యాదమై వచ్చినన్. మ. రసికుల్ విష్ణుపదారవిందములుగా రాజిల్లు వైశ్యాళి నీ। యసమానాత్మునివంటి వారలు కరం బస్మద్దృశుల్ సంతసం।బు నసిం జెందు కతంబులం జేలరిలన్; బూర్ణాదృతిన్నాకృతిన్। వెస నొక్కం డుధంబు మదీయ మచ్చు సలుపం బ్రేమోక్తి నిచ్చెం దగన్. ఉ. పుల్లనునాముఁ, డాతఁడు ప్రఫుల్లమనస్కుఁడు, దైవభక్తుఁ, డ। త్యుల్లసితప్రకారకవనోల్బణ వైఖరి గల్గు వాఁడు, తా। నెల్ల హితుల్ నుతింప గయి నూర్జితగాథ మనఃప్రమోదిజా।ళ్లు రచించె, మత్కృతులు భవ్యుఁడు తాదృశుఁడొప్పు టొప్పదే? చ. అవుల షికింద్రబాద విడి, యాదటఁ జెన్నపురంబుఁ జేరినాఁ।డ, విశదరీతి నాతఁడు కడంకను జాబులు కొన్ని వ్రాసె నా। కెలమిని; నందు మత్కృతి వరింపఁ డతండు; మ టొలఁ గొన్ని నా।ళ్లు వెసఁ జనం జనెం త్రిదశలోకము నాతఁడు పుల్లయాఖ్యుఁడున్ శా. ఆతం డమ్మెయి నుర్వి వీడఁ, దదుదారాత్మాత్మజుం డైన సం। ప్రీతాత్ముం డగు భిక్షయార్యుఁడు పితృస్నేహజన్మహాభక్తి విస్ఫీతి న్నన్నును "గోడుగల్" పిలిచి, నే వేసందుఁ బోవంగ, నా।నాతాత్పర్య మదీయసత్కృతుల విన్నాణంబుగాఁ గాంచియున్. మ. అందస్మజ్జనకాంకితంబు, మహనీయశ్రీక్ష్మాభృత్కథా। నందశ్రీచరమాధ్యదికథను నొయ్యం

దెల్పు బ్రహ్మేశ్వరా । ప్రబంధాఖ్యానము నచ్చు వేయుటకు శ్రీసాహాయ్యముం
జేల్పెఁ గ్ర । న్థం దాంబూలమనోజ్ఞపుష్పబహుమానం బెంతయుం జెంబుగన్.
ఉత్సా॥ శ్రీకొడంగలాఖ్యనగరిఁ జెలఁగి యొప్పు కోత్రిక । శ్రీకకులపు రత్నగరిమఁ
జెందు పుల్లయాఖ్యుఁ డ । స్తోకకీర్తి నగ, యల్ల సుకృతవంశ మెప్పుడున్ ।
వీఁక సకలశుభము లెసఁగ వెలయుఁ గాత మిక్కిలిన్. మత్తకోకిల. భిక్షు
యార్యుఁడు పుల్లయార్యుని బిడ్డఁ, డాదిమభిక్షుకుం । డక్షయం బగు పేర్మిఁ
గాంచి, యుదారసంపద లెప్పుడున్ । లక్షలెచ్చఁగ నిచ్చి ప్రోఁచు విలాస
సౌఖ్యము లెచ్చఁగా । నీక్షణంబుల నింపు నింప మహీస్థలిన్ రహి నంచుతన్.
మ. తెలుఁగుం బల్కు వెలంది కాభరణమై దీపించి, నా కైతలో । సలిమే లం
దము గాంచి, యీ పనికిఁ దాఁ బ్రారంభమై, నా కిటుల్ । సలిపెన్ గోత్రిక
భిక్షయాభిధుఁడు సన్మానంబు, వైశ్యాళిలో । పల నైజామున నిట్టిఁ డుండుట
కడుం బాగంచుఁ దోఁపన్ రహిన్. ఉ. ఎందఱు లక్షలాది గల యీశ్వరు
లుండిరి వైశ్యతుల్యలం । బందు ? నహూచితంబుగనె, యాత్మ మఁటన్నది
లేకె, సత్కవిం । డెందముతోడఁ బిల్చియుఁ, గడిందిగ నుండిన శక్తిలోన, నీ ।
చందముగాఁగ సత్కృతిని జేసిన వారసదే కదా? కనన్??

ఏతద్విషయానుమోదకులు—శ్రీగంతల. మల్లపగారును,
శ్రీవకీలు గౌళప్పగారును, కొడంగల్లు.

ఉ. గంతల మల్లపాఖ్యుఁడును, గౌళపనామక వావమూకుఁ, డె । త్యంతమహాగంబు
తోడ సముదారమ బ్రహ్మమహేశ్వరామలో । దంతము నాలకించి, తిరమై
తగు రక్తి ఘటించి, చౌలను । స్వాంతము భిక్షయార్యునకుఁ బర్వఁగఁ జేసిరి;
వారి కిం పగున్.

గ్రంథముయొక్క సంస్కృతమూలము నొసంగినవారు,
బ్ర॥ టి. కృష్ణశర్మగారు, అలంపూరు.

ఉత్సా. ఎలమిఁ బురోహితోత్తముఁడు, కృష్ణసుధీమణి, పాణ్యామన్వయుం । డలఘుఁ, డలంపురాలయముఁ డుదారముదంబున బ్రహ్మశంకర । స్థలకథ కాంధ్ర మేఁ జేలుపు చేందను వీసుల నాలకించి, యా । స్థ్వాలువున కొద్దనున్న యఱ మూలపుఁ బుస్తక మిచ్చె నా కొగిన్.

శా. ఆ మూలమ్మునుగాంచి, యందుకు వచోవ్యాపారరీతిం గరం । బా మూలా క్రముఁ దొల్లి వ్రాసితిఁ, బయిన్ బద్యాకృతిన్ వ్రాయుకో । ర్కె మై డెంద మునం దెసంగినఁ, గడున్ హృద్యానవద్యంబు శ్రీ । రామానూనకృపన్ లిఖింప నెసగెన్ బ్రహ్మేశ్వరాఖ్యానమున్.

శ్రీరామచంద్రాయనమః

## శ్రీ కోట్రిక. పుల్లయార్యావతంస వంశావళ్యభివర్ణనము

క. శ్రీకలితుఁడు పుల్లసమా । ఖ్యాకునకుం జెందినట్టి యన్వయరీతిన్ । శ్రీకల్యాణగుణాఢ్యుఁడు । కాకుత్స్థు కృపన్ రచింపఁ గడఁగెద నిఁదున్. (1) గీ. అంబుజాసనోరువునుండి తవరించి । వర్ణవారమం దుత్తరవర్ణ్యత మని । ధనదగౌరవముం గాంచుచు నిల వైశ్య । కుల మెసఁగు, బుధసంతతి వెలయునందు లఘుటీక:— ఉత్తర—మిక్కిలి మంచి. ఉత్తరదిక్కు; ధనద—కుబేరుఁడు, ధన మిచ్చువాఁడు; బుధసంతతి—పెద్దల సమూహము—బుధుఁడు వైశ్యగ్రహము. (2)

గీ. విధినలె విధిహితవివేకనిధులు తనరి । హరిఁ బలె నమితసత్కృపాకరులు వొనరి । హరుని బోలె నఖిలపాపహరులు మెఱసి । సురవరుని లీల వైభవస్ఫురితు లొలసి. (3) గీ. చంద్రచంద్రికాసాంద్రయశంబు మించి । బలిజలదకర్ణదానప్రభావ మెఁగి । కోట్రికాన్వయ మను మేలి కొలము గలదు (4) గీ. విబుధమోదకరం బయి వెలసి, యర్థి । కోటి కిష్టార్థముల నిచ్చు కూర్మి నెంది । సకలలోకపరివ్యాప్తశాఖ లెసఁగి । కోట్రికకులం బొనరుఁ గల్పకుజమువోలె (లఘుటీక·—విబుధ-పెద్దలు, దేవతలు; సకల-సమస్త, విద్యతోఁ గూడిన;) (5)

మ. వరశ్రీవత్సపవిత్రగోత్రులు, శుభాపస్తంబసూత్రు, లు । ర్వరలో మింతురు కోట్రికాన్వయులు రేచన్ వెంకటేశాంఘ్రిశం । బరజాతద్వయ కర్ణికాంతరగళో

న్మారందధారా నిరం । తరసంతోషితబంధురాయితమనస్తాత్పర్యు, లాన్యామ
నో । హరవందారువు, లార్యమిత్రములు, నార్య శ్రేణికా రత్నముల్. (6) శా.
ఆసద్వంశసుధా సముద్రమున ముక్తానీకరీతిం గడున్ । భాసిల్లం గల యోగ్య
లొప్పి, రిల నా ఘక్కీన్ మహాకీర్తిరే|ఖా సంయుక్తులతోడఁ దత్కులనుశాఖా
బృందమం బొందు వి|శ్వాసశ్రీనిధి భాగ్యపూర్భునిని బెంపందున్, గొపం
గల్పురిన్. (7) ఉ. అల్ల కొడంగలాఖ్యనగరాంబురుహాక్షికి నిందుఁ గోత్రిక ।
ప్రోల్లసితార్యవైశ్యఘనపుణ్యానువంశమునందుఁ బుట్టి పు|ణ్యు ల్లలి నాఁడు నేఁడు
దగ నెుప్పిరి మేనఁ జెలంగునట్టి హా । రోల్లసనంబుతోడ యశఊర్మి
వినిర్జిత మౌక్తికంబులై. (8) గీ. పోలఁ గలశాబ్ధిఁ జంద్రుఁడు వొడమినట్లు ।
జగతిఁ బొందెడు వాఁ డను సద్యశమున । నల్ల గోవిందుఁ డే యన నలరు నాఁడు
పొనరెఁ బెద్ద గోవిందుఁడు ముదము నిడుచు. ల. టీ. అఖిలలోకానందుఁ । జగు
చంద్రుఁడు...నృసింహపురా.; గోవిందుఁడు-భూమిని బొఁదు వాఁడు). (9)
మ. చిన గోవిందుఁడు, తత్సహోదరుఁడు, వాసిన్ రాఘవున్ లక్ష్మణుం ।
డొనరంగాఁ బదునాలు గేఁడులె సుభక్త్యుల్లాస మొప్పంగఁ గొ|ల్చెను, నే నె
ప్పుడు గొల్తు." నం చే నెడు సల్లీలన్ గడున్ మించి, భూ । మిని సుశ్లోకము
వొందఁ బొల్చెఁ గడు నెమ్మిన్ వాగ్విలాసప్రభన్. (లక్ష్మణుఁడు - ఆదిశేషుని
యవతారము - లక్ష్మణుఁడు సోదరభక్తికిఁ బ్రసిద్ధి, ఆదిశే. వాగ్విలాసమునకుఁ
బ్రసిద్ధి.) (10) శా. వీనుల్ విందుగఁ గీర్తి సెందు పెదగోవిందాఖ్యు పుత్రుల్
శుభ । శ్రీ నల్వా రెడు యోగ్యు, లెంతయును వాసిన్ వన్నెఁ గన్నారు ల ।
క్ష్మీనారాయణ లింగయార్యు; లిఁక నెమ్మిన్ లింగయార్యాత్మజుల్ । వే నిం
పుం గనినారు వేంకయయు గోవిందాఖ్యుఁ డుర్వీస్థలిన్. (11) శా. పుల్లాంబా
మణి వేంకయాఖ్యు సతి యై, భూమి న్నృసింహాఖ్యు, ధా । కోల్లాసాభిధ, లింగ
యార్యులఁ గనెన్ బుత్రత్రయిన్, భవ్యధీ । వేల్లద్ధైర్య పరాక్రమక్రమ జగద్వి
ఖ్యాత నీరంధ్రసం । పల్లాస్యంబునఁ బొల్చు వారి; నరసిం హుఁడందు నందంబు
గన్. (12) శా. గౌరాంబాపతి యై కనెన్ సుతుల రంగద్రీతి, సెల్లాఖ్యు, సిం।

పారెన్ రామయవేంకయాభిధుల, నుద్యత్పార్థ ధర్మాత్మజం । భీరత్వామలవిక్ర
మాఢ్యుల; నటన్ వే శేషమాశేషమా । నారీభవ్యలు, సాయమాంబ, క్రమతన్
దద్భార్య లై మించేఁగన్. (కుంతీపుత్రు లగు ధర్మభీమార్జునుల గుణముల
యొక్క-క్రమము) (13) శా. ఆ పుత్రత్రయిలో నిరామయ యశోవ్యాపారపా
రీణుఁ, డం । బాపత్యంచిత భక్తియుక్తుఁడు, జనవ్రాతామితానందదుం । డేఁపా
రంగను రామయాఖ్యుఁ డల సీతేద్ధత్వయుక్తాత్మ, శే । షాపారామల నామ
ధేయ యగు భార్యం గూడి, యింపుం గనెన్. (14) ఉ. "భూమిని బోల్చ
కామినులు భూమిని బోలెనె యోర్పునెంతయుం । ద్దామముగాఁగఁ బూన
వలెఁ దద్దయు" నందురు పెద్ద ; లింక, శ్రీ । రామయభార్య భూమిని నిరంతర
ముం ధరియించు శేషస । న్నామము పెంపుఁ జేసి తదనంతవుఁ దాల్మి తెఱం
గు నఁదెడిన్. (15) శా. ఆ రామాంబిక గర్భవార్ధిఁ దగి, పుల్లాఖ్యుండను, పుల్లా
బ్జనే । త్రారూఢామలమాననుండు, కవితావ్యాహారనీహారధా । రారంగ న్మతి,
గీనమానవపరిత్రాణైకచారిత్రకుం । డా రాకాశశిబింబసామ్యమునఁ బుత్రాకార
మొందెం ధరన్. (16) సీ. కొమరుఁ డై కొమరుగాఁ గొమరుసామిని బోలెఁ
బ్రముఖకళలతోడఁ బటిమఁ గాంచె । నవయౌవనం బందిన వయఃప్రసక్తి మార
ప్రతిస్పర్థి సుప్రభను జెందె । సాయమాంబాభిధ సతి నొంది సాయమ సాయమై
సిరి యతానుపాయ మొందె । కనియెఁ బుత్రకుని భిక్షయను, సంపదఁ దన కిచ్చిన
శివు మతి నెసఁగఁ జేయ । గీ. దానధర్మపరోపకృత్యాదిరీతు । లం దయాచిత
కృతకృత్యుఁ డై చెలంగెఁ । గవనరాసిక్యమును గాంచె నింపు । నెల్లర
మేటి ; పుల్లయ్య కెవరుసాటి ?? (ల. టీ.—కొమరుఁడు బాలుఁడు; ప్రముఖ
కళలు—ముఖ్యవిద్యలు అని పుల్లయ్యపర్యాయము.—ప్రముఖ—హెచ్చగు
ముఖములు, కళలతో - విద్యలును (వీనితోడను), పటిమన్ - బలమును" అని
కుమారస్వామి పర్యాయము; మారప్రతిస్పర్థి—మన్మథుని గేరు—శంకరుఁడు.)
సాయమ - పేరు, స + ఆయము - లాభముతోఁ గూడినది - సాహాయ్యము;
శివుఁడు సంపద నిచ్చుట శాస్త్రసమ్మతము,) (17) మ. ఘనముం గల్గియు గర్వ

మొందఁడు, సదా ధర్మంబు వేదాంతసా । ధనమైఁ గాలము పుచ్చు, భవ్యాగమ తాత్పర్య మేఁపార సా।జ్జనశ్రీకృష్ణవివాదముల్, గంభీరభక్తి సొంపొందఁగా వ్రాసి, పిన్నని నాఁడే ప్రకటించె; సౌమ్యసముఁ డెన్నారల్ గదుల్, నా యికా । ఘనభావంబులు, జావళీల్, రసికహృత్కంజాతసంతోషమిం । పౌన రల్ వ్రాసియు, నచ్చు సల్పిన కవీంద్రోత్తముండు, డే వేళ స । జ్జనవాక్యామృత పూరచారికలహంసం; బల్లపుల్లాఖ్యుఁ డో । ప్పెను హంసీఘనసారచంద్రశివపద్వి ఖ్యాతియుక్తప్రభల్. (18)

## కందగర్భిత చంపకమాలావృత్తము

చ. ధర సిరి గల్గు వాఁడు, కవితాదరణాంచితమానసుండు, త । త్పరగతి మెయిన్ సుధీజనులఁ దద్దయు సంతసపెట్టు భవ్యుఁడున్ । మురహరిపాదపంకరుహమోదరమాధ్యుఁడు, పుల్లయాఖ్యదా।నరతుఁ డనన్, జగంబున ననారత మున్ సుజనస్తుతుం డగున్. (19) గర్భితకందము॥ సిరి గల్గు వాఁడు, కవితా । దరణాంచిత మానసుండు, తత్పరత మెయిన్ । హరిపాదపంకరుహమో । దరమాధ్యుఁడు పుల్లయాఖ్యదానరతుఁ డనన్. సీ. శ్రీకొండంగల్లుపురీ నాయకామరనగరిని దనరి చెన్నారినాఁడు । శేషాయాంబాగర్భచిదినంశకలశాబ్ధి సిరితోడుగా జనిం చెందినాఁడు । సకలదిశావకాశగపరీమళ పారిజాతప్రపంచపద్యశశప్రభుండు । విబుధరత్నపటలీవిస్ఫురదాశావితతపూగణామలమతియుతుండు గీ. ఇటులఁ గల్ప వృక్షం బన నెసఁగు నీతఁ, డయిన, దద్దానిఁ గన్న నెచ్చో నితఁ డన । నెవరి సూచన లేక రహించు సత్కృతి।వితతిని మేటి; పుల్లయ్య కెవరు సాటి?? (20)

క. భిక్షయ యాతని కొమరుం । డక్షయముగ హరుని పేరు నందెన్ నిరతం।బక్షయముగ భిక్షువితతి । కక్షీణముదంబు నిచ్చు ననఁగా నవనిన్. (21)

మ. హరి నా భిక్షయ్య లక్ష్మమాఖ్యవిలసత్పుణ్యాఢ్యుఁ బెండ్లాడి, యీ।ధరణిన్ సర్వసుఖంబు లందుచును, సంతానంబు సంతానభా।సురహృత్పద్మలఁ బుత్రులం గనె సుదంశున్ రంగనాథు, న్నృసిం।హు రమామానితుఁ, జంద్రశేఖరుని

నంహోదూరు, నీ మూగురర్. (22) చ. ఇటు లల పుల్లయార్యుఁడు రహించుఁ గొడంగలు నామసత్పురిన్ । బటుతరవైభవుం డయి, యనారతమానసభక్తి పూజ్యవేం।కటవరుఁ డై, కవిత్వరసికత్వవదాన్యత లొప్పి, యెట్టి సం।కటములు లేక, కీర్తినువికాస మఖండముగాఁ దగున్ భువిన్. (23) గీ విత్తముండెడు వారలు వెలయుచుండ్రు । విద్య యుండెడు వారు దీపించుచుండ్రు । కవిత యుండెడు వారలు క్రాలుచుండ్రు । దానగుణముండు వారలు తనరుచుండ్రు । శ్రీయు, విద్యయుఁ, గవిత, దాతృత్వము, నొగి । మనుఁ గొడంగలు పురి మను మహితనుగుణి । యయిన కోట్రిక పుల్లయోదారు నింట. (24)

---

## పండితాభిప్రాయములు.

---

1. చెన్నపురి ముత్యాలపేఁట హైస్కూలులో ప్రధానాంధ్ర పండితులయిన, శ్రీమదాశుకవి శిఖామణి, పోకల వేంకట నరసింహరావు నాయుఁడు గారి యభిప్రాయము.

శ్రీగురవేనమః.

### పంచరత్నములు.

శా. శ్రీమద్దివ్య పురాణరాజములలోఁ జెన్నొందు బ్రహ్మేశ్వరా । ఖ్యామూల్యం బగు చిద్ది లోకమున విఖ్యాతంబుగాఁ జేసె శ్రీ । రామబ్రహ్మము ప్రార్థనాదిగను బో రానట్టి చుట్టంబుగా । దోమా. వేంకటసామి గుప్తకవి యెంతో ప్రీతి నాంధ్రంబునన్. చ. ఇదియుఁ బురాణ మిందుఁ గల యుద్ధ చరిత్రము లింపుతో వినన్ । సదమలభక్తితోఁ జదువ సద్గతి గల్గు నటంచు నార్యులిం । పొదవఁగఁ దెల్పినారు ముద మొప్పఁగ దీనఁ గలట్టి సంగతుల్ । విదితము పుణ్యభాజ్య మయి విశ్రుతి కెక్కుట ధారుణీస్థలిన్. క. ఈ యుద్ధగ్రంథము నందఱుఁ । బాయక పరియింపఁ దగు శుభంబు లొసఁగి ను । శ్రీయుతులం జేయుచుఁ మో । క్షాయత్తులు గా నొనర్చుఁ జదివిన వినినన్. ఉ. శైలియుఁ బాకమున్ రసము చక్కన వై కరినంబు గాక లో । కాళికి బంధు వై చెలఁగఁగా

రచియించిన గ్రంథరాజముల్ । జాలఁ బరీక్ష సేసి బుధసంఘము పాత్యముగాఁగ సత్కృతి । శాలల నుంపఁగాఁ దగుఁ బ్రశస్తకవీంద్రుని నుత్సహింపుచున్. గీ. ఆంధ్రలోకంబునకు నిట్టి యభినవ మగు । సత్పురాణంబుఁ దెనిఁగించి సంతరించె । నార్యవైశ్యుండు దోమాకులాబ్ధిపూర్ణ । చంద్రుఁడైనట్టి వేంకటస్వామి గుప్త గీ. ఆకవిశిఖామణి యను నట్టి బిరుదు । గల్గు పోకలాన్వయుఁడఁ, వేంకట నృసింహ । నామధేయుండఁ బంచరత్నములతోడ । నా యభిప్రాయమును గూర్చినాడ (నిందు)

(2) బ్ర॥ కావ్యస్మృతితీర్థ......జనమంచి. శేషాద్రిశర్మగారు ఈ పాత్రమును గుఱించి తెల్పిన యభిప్రాయము.

కడప 20-9-1931.

ఆర్యా !......తమ గ్రంథము సర్వతోభద్రము—ఇట్లు, మిత్రము.

జ॥ శేషాద్రి శర్మ.

శ్రీ శ్రీ శ్రీ.

(3) అస్మద్గురువరేణ్యులయిన బ్ర॥ కింకవీంద్రఘటాపంచానన, బాల సరస్వతీ, బాలకళానిధి, విద్వత్కవి, శతావధానులు, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిలు గారు తెల్పిన యభిప్రాయము.—

క్షేమము—కడియము. తూ. గో. జి.

12-9-1931.

ఆశీర్వచనోయకుశలోపరి. నీవంపిన శ్రీశైలపశ్చిమద్వారమాహాత్మ్యము నకు సంబంధించిన పాత్రమును ప్రత్యక్షరమును చేదివినాను. తెలుఁగుపద్యములు నిర్దుష్టములు. వ్యాసశ్లోకములలోఁ గొన్నిఁట సందేహము కలదు. అది ముద్రణ ప్రయుక్తమో యేమో ? కలిసికొన్నప్పుడుఁ గాని చెప్పఁ జాలను.

వేం. శా. శతావధాని.

(4) సంస్కృతాంధ్రభాషలయందును, కవిత్వవైద్యజ్యోతిషములయందును కృతపరిశ్రమ లయిన మిత్రములు బ్ర॥ చేబ్రోలు చంద్రశేఖరశర్మగారి యభిప్రాయము

మ. పదలాలిత్యము, నర్థగౌరవము, భావప్రౌఢి, శయ్యారసా । స్పద మర్యాద, లనర్గళామలసువేగాడంబరస్ఫూర్తి, శా।రదకారుణ్యముఁజేసి పెంపలర శ్రీబ్రహ్మేశ్వరాఖ్యాన, మ । య్యాదిరా! వేంకటస్వామిగుప్తకవి! వ్రాయంగంటి నీ వెంతయున్. ఉ. మంగలి రంగనిం గుఱిచి, మాంసము వండుటఁ గూర్చి, యింక, నీ । రంగు చెలంగు పారము తెఱంగు లెసంగెడి బల్లయందు వే।దాంగవినుత్యవైభవమహానటసత్కథనంబు వొల్చు భా । వంగమమైన నీదు కృతి పార్యము గా దని యేఁడు పల్కెడిన్?? మ. ఒకటే దెబ్బను రెండు పక్షులను నీ యుర్విం బడంజేయు బో । యకు దీవైతివి, వేంకయాఖ్యసుకవీ! సాంబోల్లసత్సత్కథా।నకమున్ వ్రాసితి వీవునుం, బరిత లన్నా! యైహికాముష్మిక । ప్రకటామోదపరంపరల్ గనెదు మార్గం బిట్లు సంధిల్లఁగన్.

ఇట్లు, విధేయుఁడు

చేబ్రోలు. చంద్రశేఖరశర్మ.

(5) బ్రహ్మశ్రీ కావ్యపురాణతీర్థ, విద్వాన్. జనమంచి. వేంకటసుబ్రహ్మణ్యశర్మ, పండితులుగారు. కడపనుండి పంపెన యభిప్రాయము:—

ఆర్యమహాశయా!

తమరు దయతోఁ బంపిన శ్రీబ్రహ్మేశ్వరపురాణమును సాదరంబుగఁ గైకొంటిని. కథ యంతయు సావధానముగఁ జదివితిని పద్యము లన్నియుఁ గడుంగడు హృద్యములై యలరారుచున్నయవి. సంస్కృతమునందలి భావంబులు నంతయేని లోపంబు నొందకయుండునట్లు కావింపఁబడిన మీ తెలుఁగుకైత యెంతయు సంతసంబు గొల్పుచున్నయది. కవిత్వమును గుఱించి శతావధానులగు తమకుఁ దెలుపుట చర్వితచర్వణ మగును. శైలి యనర్గళమై ధురీ వేగంబు

ననుకరించుచు సలలితగతి మనోహరం బై సరళమై యున్న దని చెప్పుట కేను సాహసించు చున్నవాఁడను. కమ్మ్రయచ్చునఁ దీసిన స్వర్ణతంత్రీవిధంబున నెచ్చు తగ్గులు లేక స్నిగ్ధ మయి పాఠకులకు హృద్యమై యొసఁగు తమ శైలి యత్యుత్త మము. అం దం దచ్చ తెనుంగు నుడుల కూర్పును, గీర్వాణవాణీపదఘటితసమా సంబులును మృదుమధురంబు లై కనంబడుచున్నవి. పాఠకులకు నందు మిక్కిలి యాస్తికులగు వారికిఁ బరనంబున కుపయోగింప నను వగునట్లు సంస్కృతభాష యందలి స్తోత్రములను, వాని యర్థంబుఁ జక్కఁగఁ దెలియునట్లు వెంటనే వ్రాయఁబడియుండు తెలుఁగురచనయుఁ గొనియాడఁ దగినవి యైయున్నవి.

తెలుఁగుదేశమునం దందును రాయలసీమయందుఁ గడు వాసి గాంచిన "అలంపురీక్షేత్రమాహాత్మ్యము" నుగమముగఁ దెలుఁగువారికిఁ దెలిపిన తమకృషి యంతయుఁ బొగడఁ దగినది ఈ కార్యము తెలుంగుసీమవారికే కాక రాయల సీమవారికి వన్నె పెట్టునదిగా నున్నయది. ఇట్లే తమ రీ రాయల సీమయం దున్న క్షేత్రపురాణములఁ దెలుఁగుఁ గావించి కీర్తి సముపార్జింతురు గాక యని కోరు చున్నాను.

ఈ గ్రంథము పాఠశాలలయందలి విద్యార్థులకుఁ బఠనీయముగాఁ గావిం చిన రాయలసీమయందలి పుణ్యక్షేత్రమహిమాదికము నెఱుఁగుట యొక్కటియే గాక భాషాభివృద్ధియుఁ దప్పక కలుగఁగల దను నమ్మకము నా కెక్కుడు గాఁ గలదు. భక్తిజ్ఞానవైరాగ్యముల నొసంగఁ జాలు నీ పుస్తకమును భావిభాగ్యాభి లాషు లగు బాలుర విద్యార్థిగణము పఠించిన నుభయలోకశర్మము నందఁగలరు.

భాషాభిమానులు తెలుఁగుబాసను బఠనీయగ్రంథములుగా నిర్ణయించు విద్యాశాఖాధికారులు నీ గ్రంథరాజమును బాఠ్యగ్రంథముగా ననుమతించి యీ కవితల్లజునిఁ బ్రోత్సహింతు రని మఱిమఱి ప్రార్థించుచున్నాను.

తమ రిట్లు నిరంతరము భాషాసేవ గావించుచు నిరతిశయ యశంబు సంపాదించి తెలుంగుదేశమునకు నలంకారముఁ గావింప నాయురారోగ్యైశ్వ

ర్యంబుల శ్రీజోగులాంబా బ్రహ్మేశ్వరులు ప్రసాదింతురు గాక యని వేఁడు చున్నాఁడను —

కడప 20-9-1931

పండితపాదసేవకుఁడు
జనమంచి. వేంకటసుబ్రహ్మణ్యశర్మ.

(6) చెన్నపురి శ్రీపచ్చయప్పకళాశాలాంధ్రోపన్యాసకు లయిన బ్రహ్మశ్రీ విద్వాన్, గంటి. జోగిసోమయాజులు యం ఏ., యల్. టి. గారి యభిప్రాయము:—

శ్రీ శతావధాని దోమా వేంకటస్వామిగుప్తగారిచే నాంధ్రీకరింపఁబడిన బ్రహ్మేశ్వరపురాణమును స్థాలీపులాకన్యాయముగాఁ జదివితిని.

కవిత్వము ధారావాహికముగా నిరర్గళగతిఁ బ్రవహించుచున్నది భాషయు సలక్షణమై గ్రామ్యప్రయోగదూరమై యొప్పుచున్న దనుటకు సంతసమగుచున్నది. ఈ గ్రంథమును దెనిగించుటచే వారికిఁ గల యాస్తికబుద్ధియును నీశ్వరభక్తియుఁ దేటతెల్లము లగుచున్నవి. ఇట్టి సత్కవిత్వమును వ్రాయంగల గుప్తగారు మిక్కిలియుఁ బ్రశంసార్హులు.

గంటి. జోగి. సోమయాజి.

శ్రీరామచంద్రాయనమః.

(7) శ్రీదత్తమండలకళాశాలాఽఽంధ్రపండితు లయిన బ్రహ్మశ్రీ ప్రయాగ. వేంకటరామశాస్త్రులుగారు శ్రీ గుప్తగారి యవధానమును గూర్చి యొసంగిన యభిప్రాయము:—

క. శ్రీమానినీమనోహరుఁ । డోముతఁ గామితము లొసఁగి, యురుగుణఖని, శ్రీ । దోమాన్వయమణి, వేంకట।స్వామినుధీమణిని సారెసారెకుఁ గరుణన్.

చ. సదమలశేముషీవిభవసంస్తవనీయఁ డతండు, సత్కలా । విదులు, నుధుల్, బుధుల్, కవులు, వేవు రెలర్పఁగ, దత్తభూకలా । సదనమునం దుదారనిజచాతురి పెంపెసలారఁగా, సభా । సదు లహహా! బళీ!" యనఁగ సత్పెవధానము సద్విధాన

ముగ్. ఉ శ్లిష్టపదాశువర్ణనము, చిత్రతరార్థవిమర్శముగ్, సమా । శ్లిష్టపదార్థ వృత్తకృతి, శేషితవర్ణసమీహితోక్తి, నిర్దిష్టపురాణగోష్ఠి,బహుదేశవిశేష వినోద గోష్ఠియుం । శ్లిష్టసమస్యపూర్తి యవలీల నొనర్చె నతం డతంద్రుడై. క. కల రవధాను లెల్లెడ నఖండలసత్ప్రతిభావిశారదుల్ । కలరు కవీంద్రులున్, సరస కావ్యకళాచణు లెందఱోయిలం । బోలుపుగ నాశుధార రసపూరితమౌ మృదు శైలి నితనిం । బలెఁ గయితం బొనర్పఁ గల వా రరు దంచుఁ దలంతు నెమ్మది న్. క. సురుచిరపదలసితము, రస । భరితము, గంభీరభావభానురమును, మా । ధురికలిత మితని కవితా । ఝరి కవుల నలర్చుఁ బోరిఁ బ్రసాదయుతంబై.

అనంతపురము.
రుధిరోద్గారి—మహాశివరాత్రి.

ప్రయాగ. వేంకటరామశాస్త్రి.
దత్తమండలకళాశాలాంధ్రపండితుఁడు

(8) మదరాసు క్రిష్టియన్ కాలేజి దేశభాషాధ్యాపకాధ్యక్షులును, చెన్నపురాంధ్ర విశ్వవిద్యాలయ సభాసభ్యులును, పుస్తకపరీక్షాధికారులును, అనేక గ్రంథకర్తలును, పరిశోధకులును, అయిన మ॥ తేకుమళ్ల. రాజగోపాలరావు, బి యె.,యల్. టి.,యం. ఆర్ ఏ. యస్.,పి. ఎచ్. డి. గారి యభిప్రాయము:—

గీ. సరసకవితావితానవిస్తారుఁ, డార్య । సమ్మతుం డగు వేంకటస్వామిగుప్త । యమల దోమాన్వయాంభోధి కుముదబాంధ । వుఁడు రచించు బ్రహ్మేశ్వర పుణ్యకథను । జేదివి, కాంచితి నెంతేని ముదము నిపుడు. (1) గీ. పండితాదర ణీయమై, పారశాల । లందుఁ బార్యమై యీ కృతి యలరుఁ గాక । దేవదేవుని కృపను నీ ధీవిశాలుఁ । డింకను రచించుఁ గాత మెన్నేనిఁ గృతుల. (2) గీ. పోతనార్యుని, నల భట్టుమూర్తి, నల్ల । సాని పెద్దనామాత్యు, ధూర్జటి, సకలకళా సనాథు శ్రీనాథుఁ దలంప వచ్చుఁ । బద్యధోరణి నిటఁ గొన్ని పట్టు లందు. (3) క. తన నైజ మైన కవితా । భినివేశత నితఁడు నవ్యవిభవ మెలర్పం । గను శ్రీగిరి పడమటి పై । పునఁ గల ద్వారంపుఁ గథను బొనరిచె నిందున్.

తే. రాజగోపాలరావు.

(9) బ్రహ్మశ్రీ కసూ్ర్నలు శ్రీకొండ, శంకరశాస్త్రిలు గారు దయచేసిన యభిప్రాయములోని పద్యములు:—

ఉ. ఈ క్షితి మోక్షదంబు లనియెన్నిక కెక్కిన క్షేత్రరాజిలో । దక్షిణ కాశి తాఁ బరఁగుఁ, దన్మహిమంబుఁ బురాణపఙ్క్తికన్ । దక్షత మీఱఁ జేసి తలిఁ దండ్రుల కంకిత మిచ్చి, యా విరూ । పాక్షకటాక్షవీక్షణకుఁ బాత్రుఁడ వైతివి గాదె ? సత్కవీ!! గీ. వ్యాసుఁ డాదిమభాషను భాసురముగఁ । దెల్పియున్న పురాణంబుఁ దెనుఁగునందు । మార్చి, భూతలమునఁ గడు మాన్యతఁ గనఁ । జేసితివి; దోమ, వేంకటస్వామిగుప్త!! సీ. ఒక్కచో నొప్పగు నుపమాద్యలంకార వితతిచే వీనుల విం దొనర్చు । నొక చోట నీ కైత యుజ్జ్వలసంస్కృతపదసమాసంబులన్ భాసుర మగు । సరుదుగా నొక్కచో నాంధ్రపదంబుల సర్వజనాహ్లాద సరణి మించు । వాసిగా నాంధ్రగీర్వాణంబు లొక్కచో మణికనకంబుల మాడ్కిఁ గ్రాలు । గీ. పదిలముగ నొక్కచో ననుప్రాస మొప్పుఁ । గానఁ, బూర్వకవీంద్రుల కవితఁ బోలి । లలితగతి మించె దోమ కులాబ్ధిచంద్ర! వేంకటస్వామి సుకవీంద్ర! వినయసాంద్ర!!

శ్రీ

(10) బి. యం. స్కూలు, పత్తికొండ 22-10-31.

అయ్యా ! మీరు పంపిన బ్రహ్మేశ్వరపురాణము నామూలాగ్రముగాఁ జదివితిని. శైలి సరళముగా నున్నది. ఆస్తికుల కిది ముఖ్యపఠనీయము. ఇంకను నిందలి రేణుకాదేవీ శీలవతీ రసాసిద్ధుల చరిత్రములు పాఠశాలాబాలురకుఁ బఠన యోగ్యములుగాఁ గూడ నున్నవి. విద్యాశాఖవారు దీని ననుమతించి, పాఠ్య గ్రంథముగా నుండఁ గల రని తలంచెదను.

టి. రామశర్మ,
తెలుఁగు పండితుఁడు.

---

శ్రీ

# విషయసూచిక.

## తృతీయాశ్వాసము:—



## చతుర్థాశ్వాసము:—



## పంచమాశ్వాసము:—



---

# శోధనపత్రము.

(ఈ పొత్తము ముద్రింపఁబడుచున్న సమయమున నాకు నితరములయిన యవసరకార్యము లుండుటంజేసి కొన్ని ముద్రణదోషము లిందు దొరలినవి. అయ్యవి వీ లయినంతవఱకు క్రిందఁ గనుఁబఱుపఁబడుచున్నవి. పాఠకమహాశయులు వాని ప్రకారముగా మున్ముందఁ బొత్తములో సవరణలు చేసికొని పొత్తముఁ జదివినచో ననుకూలతరముగా నుండు నని మనవి మఱియు నేను జూడక మిగిలిన యచ్చుపొరపాటులును, వానికిఁ దోడు నాబుద్ధిపొరపాటులును ఉన్నచో వానిని సైరించి మన్నింప వలయునని యభిజ్ఞులను వేఁడు విధేయుఁడు, దో. వేం. గు.)

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 15 | "ఓవిఘ్నేశ్వర !" యన్న, "నో" యనియు, | 'ఓమాన్యాత్మక ! విఘ్నరాజ !" యన, |
| ,, | 18 | బ్రోవని | బ్రోవకే |
| 6 | 24 | కుర్వతా | కుర్వన్ |
| 7 | 9 | జోగులాయాస్థలే | జోగులాయాస్థలే |
| 8 | 2 | శ్రుతజో | శ్రుతజా |
| ,, | 3 | జోగుళా | జోగుళా |
| ,, | ,, | స్మార్దావతీ | స్నానాదావతీ |
| 9 | 20 | స్త్యద్భాస్కర | స్తద్భాస్కర |
| 10 | 16 | సంస్తువంతీం | సంస్తుతాంతాం |
| 13 | 17 | ప్రాయయన్ | ప్రాయమున్ |
| 18 | 15 | జహ్మత్వంబు | బ్రహ్మత్వంబు |
| ,, | 20 | దాఁకతంబు | దవ్వంతంబు |
| 22 | 7 | మార్కండైకామే శ్వరులు | మార్కండేయై కామేశ్వరులు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 22 | 15 | శ్రద్ధమ | శ్రద్ధను |
| 24 | 5 | కనుకృతంబు | సుకృతంబు |
| 26 | 18 | పుత్త్రు వెలలారి | పుత్త్రు లెసలారి |
| 27 | 14 | యుగనూనా | యుగనూనా |
| ,, | 20 | తళ్తళ త్తళ | తళతళ త్తళ |
| 28 | 11 | గుంభంబు | గుంభంబుం |
| 29 | 20 | కారుణ్వానాగర | కారుణ్యాసాగర |
| 31 | 14 | నిని మతి | నినిమతి |
| 32 | 9 | కాంతామణి | కాంతామణీ |
| ,, | 16 | దాఁకెటేఁగి | గానెటేఁగి |
| 33 | 18 | ద్వితీయుఁడా | ద్వృతీయుఁడా |
| 37 | 3 | మునిలాఁడిరి | మును లాఁడిరి |
| 39 | 10 | వింప | లింప |
| 40 | 10 | ద్వారము | ద్వారము |
| ,, | 13 | బోరిక | బొరిక |
| 41 | 15 | యుంమటఁక | యుండుటఁక |
| 43 | 8 | న్నిటలాకొనల | న్నిటలాలోకన |
| ,, | 9 | గాఁపాడఁదీవింపుఁడీ | గాఁపాడదీవింపుఁడీ |
| 48 | 6 | కుక్రేశ్వర | శుక్రేశ్వర |
| 48 | 23 | విడిన | నిడిన |
| 53 | 14 | భక్తిమై నప్సర | భక్తియుక్తాప్సర |
| ,, | 15 | స్త్రీ | స్త్రీని |
| 54 | 7 | నురు | సురు |
| 63 | 5 | నాది | నల్లయాది |
| 63 | 7 | నల్ల | సర్వ |

## శ్రీ వేంకటేశ్వర స్తుతి.

మ. ఇలువేల్పై తగి, వేల్పుఁజెట్టుఁబలె నెంతే నిష్టలాభంబు సం
ధిలఁ జేయం దనరారి, సంపదను నిర్నిద్రంబుగాఁ గూర్చ నా
వలనం జోతల నందు దైవము, కలిప్రాంచత్సన్నిధీసంఘమం
గళదున్ వేంకట శైలనాయకుని వీఁకం భక్తిమై మ్రొక్కెదన్. 3

## శ్రీ మహాలక్ష్మీ స్తుతి.

మ. విరసుం డౌసరసుండు, నీచుఁడు గుణస్ఫీతాత్ముఁడౌ, దుర్యశో
భరితుండౌ ఘనకీర్తియుక్తుఁడు, మహా పాపాత్ముఁ డత్యంతపు
ణ్యారుచిం జెందు ఁయదంచితామల కృపాప్రాప్తిం, గరం బట్టి యిం
దిర, నా కా యరవిందమందిర యిడు న్నిర్నిద్ర సంపన్నతన్. 4

## శంకరస్తుతి.

మ. తలపూవై యరచందురుం డలర, సంధ్యారాగ భాస్వజ్జటా
వళియందున్ మిసువాఁక వీఁక నెసఁగన్, వహ్నిస్ఫురన్నేత్రమం
దిలకంబై నొసటం జెలంగ, నురగాధీశోరుభూషావళీ
కలితాత్యద్భుత రూపుఁడైన యభవుం గౌరీశ్వరుం గొల్చెదన్. 5

## శ్రీ జోగులాంబా స్తుతి.

చ. ఒడయఁడు దండకాటవుల నొప్పుగఁ బున్నెముఁ బెంప బ్రహ్మశం
భుఁ డన నలంపుకీక్షితిని బొందఁగఁ, దానును జోగులాంబయై
తడయక య య్యెడం గనదుదారతరాఘునిదాసువారణం
బడర దయారసోల్లసదపాంగతఁ బొల్చు భవాని నెంచెదన్. 6

## సరస్వతీస్తుతి.

మ. శరదంభోదవిభా విభాసి దరహాసంబుల్ విడంబించు మో
మరవిందారిని గేరఁగా సజముఖోద్యన్నాట్యరంగస్థలాం

తరమం దాడు సుడుంగులమ్మ రహి మించన్ స్వీయపాదాబ్జనూ
పురశింజానఝుళంఝుళారవముతోఁ బోలించు నా కైతమున్.

## వివిధదేవతా ప్రార్థనము.

శా. ఆయుర్దాయ, మరోగభావము, సమస్తైశ్వర్యధుర్యత్వ, మి
చ్ఛాయుక్తిం, గరముం రహిం గొలిపి రాజభ్రాజదాస్థానరా
జీయోగ్యమ్ముగ నాకృతుల్ తనరఁగాఁ జేయుంత్రు గాఢానుకం
పాయత్తమ్ముగ ధాతృ భాస్కర వనేజారాతికోటీరులున్. 8

## శ్రీమదాంజనేయస్తుతి.

మ. పరమామ్నాయకలాకలాపగుణభాస్వన్మాన్యతం బొల్చి, శం
కరజూటాటవికాతటాంతరలు రద్ధంగా స్రవంతీ నిరం
తరభంగోరు ఘుమంఘుమారవ లసత్కావ్యక్రియా దక్షతన్
బరఁగం జెందెడు పొందె నెంతు సుయశోవంతుఁ, హనూమంతునిన్. 9

## మహాకవిస్తుతి.

శా. లోకంబం దతిలోకమోద మిడ, సుశ్లోకంబు నీపింప, న
స్తోక శ్లోకమహాకవిత్వవిలసచ్ఛుంభద్యశం బందు వా
ల్మీకి వ్యాస ముఖామరామలవచోలీలావతీలాలితుల్
ప్రాకట్యం బగు మానమస్యకు సమర్థత్వంబు గాఁ గ్రెంతయున్. 10

ఉ. వారక రామసచ్చరిత భారత భాగవతాది సత్కృతి
శ్రీరమణీయరీతి నధరీకృతసారసుధోరుధోరణీ
సారము నాంధ్రభూమికి నొసంగఁ బొనర్చు త్రిలింగసూరిరా
డ్వారము నెంచు వార మను వార మొగిన్ మను వారమై తగన్. 11

## గురుస్తుతులు.

### శ్రీ తిరుపతి వేంకటేశ్వర మహాకవులు.

మ. సరసానేక మహాప్రబంధపటలీ సారస్వతప్రక్రియా
భరితోదారకవిత్వతత్త్వవిజితప్రాంచత్సురాధీడ్వ నాం

తరభర్మాంబుజ కర్ణికాప్రవిగళన్మాకంద ధారాయశో
భరులం దిగ్పతివేంకటేశకవులన్ భావింతు నశ్రాంతమున్. 12

## శ్రీమదింద్రకంటి సుబ్రహ్మణ్యశాస్త్రిలు గారు.

సీ. నిగమామజ్ఞుఁ డై నెగడె నాతం డన - రహి నాతని సదాచరణము సాక్షి
వేదాంతమందును విజ్ఞుఁ డాతం డన - నతని నిస్పృహతయే యలరు సాక్షి
సంస్కృతాంధ్రములకు సాగరం బతఁ డన - నతఁడు సల్పిన గ్రంథతతులు సాక్షి
ఒజ్జలికంబున నొప్పె నతం డన - నతని యంతేవాసివితతి సాక్షి.

గీ. కరము బ్రహ్మణ్యుఁ డతఁ డనగా, నతని య
జాతశత్రువిఖ్యాతి మించెఁ దగు సాక్షి
అట్టి యింద్రకంటికులార్ణ వామృతాంశుఁ
గొలుచు వాఁడ, సుబ్రహ్మణ్యగురుని నెలమి. 13

## శ్రీమదనుముల విశ్వనాధ శాస్త్రిలుగారు.

శా. గంగం దాల్పని విశ్వనాథుఁ డయి, తద్గంగాధరోద్యజ్జటా
రంగద్గాంగఝురానుకారి కవితాప్రాంచన్మహో వైఖరీ
భంగీసంగతుఁ, డాంగలాంధ్రసురవాగ్వల్లభ్యదీవ్యత్కవి
త్వాంగీకుర్వదశేషతజ్జ్ఞుఁ డగు విశ్వాధీశ్వరుం గొల్చెదన్ 14

## లోక విషయము.

ఉ. విద్దియఁగల్గనేమి ? మఱి విత్తము గల్గిననేమి ? యింక దీ
ర్ఘద్దశ నొప్పు సత్కవిత హార్వి చెందిననేమి ? వెల్గొనం
బొద్దను లేని యా కుజను నొద్దకుఁ బోరు, ఘణాఘణోపరా
జద్దిగనీకముం దొరయఁ బోలుదు రే రల దిందశోకముల్ ? ? 15

## ఏతద్గ్రంథరచనోద్దేశ కారణాదికము.

మ. ఇటు శిష్టాచరణంబులం జరిపి, యెంతే మత్పురం బొచు, మి
క్కుటమా నా రహి కాస్పదంబుగ నెసంగుఁ గంద నొల్చెంత ను

త్కూటమున శ్రీఁ దగు మల్లికేశ్వర శుభ్ర ద్వారప్రాచీ ద్వారమా
పటుపుణ్యాంబు నలంపురిం బొగడు భావం బూనియు న్నెమ్మదిన్. 16

చ. భవరోగంబుల కౌషధంబు, శుభముల్ ప్రాపించు మార్గంబు, వై
భవముల్ గల్గఁగఁ జేయు సాధనము, పాపవ్రాతదూరంబు, శాం
భవసంబంధము నీప్రబంధమును జెల్పం బూను వాడం, బురా
భవ దుర్వారత రాఘు వారణముగా బ్రహ్మేశ్వరాఖ్యానమున్. 17

## కృతిసమర్పణము.

ఉ. వ్రాసితి నెన్నియో కృతులు ; వ్రాయఁగనుంటినిఁ కెన్నియో, దయా
భాసుర రామచంద్ర సదపార కృపాపర తంత్ర సత్కవి
త్వా సమధోరణీ విభవ మందముఁ జెందము నొందువట్లు ; కా
నీ, సరిగా ధరం గనఁగ నెక్కును వేల్పులు తల్లిదండ్రులై
వాసిని గాంత్రు ; గావునఁ, బ్రబంధము దీనిని నంకితంబుగాఁ
జేసియు వారి, కిచ్చెదను జిత్తము బత్తిని హత్తి నివ్వడున్. 18

శా. శ్రీగోవిందయకోటమాంబికల కీ శ్రీశైలపూర్వేతరా
శాగిర్యంచితతత్త్వవర్ణనకథా సద్గ్రంథ, మత్యంతదూ
రోగాకారమణాద్యజన్మదురఘార్తుల్ వమ్ముగా, లోకర
క్షాగుర్వగ్రసరుండు శంకరుని దౌ సంప్రీతిగా నిచ్చెదన్. 19

## షష్ఠ్యంతములు.

క. ఆంగిరసగోత్రయుతులకు - నంగీకృత వేంకటేశ్వ రానమనులకున్
రంగత్కారుణ్యాశుభా - పాంగాభంగుల, కపత్య వరద మతులకున్. 20

క. మంగళతర విగ్రహుల, క - నంగరిపుపవిత్రులకు, నుదారచరితభూ
రంగస్థలరంగత్కీ - ర్త్యంగీకృత చరితులకుఁ, బి తరు లమలులకున్. 21

క. కడు మంచి తలఁపు, లటులే కడు మంచివి మాట లమరి - కడుమంచివి యై
యడరెడి పనులను గల గో-వ్యడుపతిధర సమజనకుల-కురుభక్తి మెయిన్. 22

వ. సత్కీర్త్యభివృద్ధి వంశాభివృద్ధి పుణ్యాభివృద్ధి ముక్తిలాభాభివృద్ధులు గా నా వక్కాణింపం బూనిన శ్రీస్కందపురాణాంతర్గతంబును, శ్రీశైలపశ్చిమద్వార మాహాత్మ్య వర్ణనంబును, శ్రీమదలంపురీమాహాత్మ్య నామాంతరంబును నగు శ్రీమద్బ్రహ్మేశ్వర పురాణంబునకుం గ్రమం బెట్టనిన, 23

క. శ్రీమద్బ్రహ్మేశ్వర కరు - ణామంద మరందబిందు హర్ష యుతమిళిం దామేయాశయులారా! నామవ్వాంపు జననీజనక మణులారా!! 24

వ. అవధరింపుఁ డత్యంతకరుణా తరంగితాంతరంగంబున, మీపిల్లఁడు నుడువు నుడుంగులను; సమస్తకలికల్మషాపనోదన పటుతరప్రఖ్యా విజృంభమాణ శ్రీమ దుమామహేశ్వర కథానకవితానంబులం జెన్నొందు శ్రీమానితంబు శ్రీస్కాందపురాణ కథాబృందంబు, నందు నందంబునం బొందు శిఖరమాత్రా లోక నాదగ్ధకిల్బిషజాలంబగు శ్రీశైలంబు గొప్పతనంబుఁ దెల్పు డం దిం పొందుం, దాని పడమటి దెస కవాటంపు వాటంపుఁ బాపాటవీకుఠారాయిత చరిత్రంబు డంబొరయుం; దానికిఁ దెలుంగు సేయం బూనిక నా కెసంగి, తత్పూర్వము తదుద్దేశజనకం బయిన తన్మహాపుణ్యక్షేత్ర సందర్శనం బాచ రించిన సమయంబున నే నందలి యయ్యార్యోడలం దరిసించి కొన్ని పద్దెంబులఁ జెప్పితి, వాని నిందుఁ దొల్దొల్తం జొప్పింతుఁ, బిదపఁ గతం జెప్పెదు. 25

---

శ్రీ రామచంద్రాయ నమః.

శ్రీ జోగులాంబా బ్రహ్మేశ్వరాభ్యాం నమః

## శ్రీమదలంపురీ మాహాత్మ్యమ్.

### పారాయణార్హములు.

శ్లో. బ్రహ్మబ్రహ్మర్షిభి ర్దివ్యైః స్తుత్వా దివ్య యుగేపురా
తపః కుర్వతా సుఘోరంచ - బ్రహ్మత్వం ప్రాప్తవా నసౌ.

శ్లో. బ్రహ్మేశ్వర మహాలింగం - జ్యోతిర్జ్వాలా మయం శుభం
పశ్యంతి తాపసా స్సిద్ధా - నపశ్యం తీతరేజనాః. 2

శ్లో. యః పూర్వం పరమేష్ఠినా శ్రుతివిదా సాంగంతపఃకుర్వతా
స్తోత్రై రాకలితైః ప్రసన్నవదన, స్సాంబ, స్స్వయం శంకరః
సాక్షా దావిరభూ దశేషజగతా మాద్యః, పుమాన్, శ్రీగిరి
ద్వారే, పశ్చిమదిఙ్ముఖే, సదయదృ గ్బ్రహ్మేశ్వరః పాతుః. 3

శ్లో శ్రీకృష్ణాశ్రుతసంభవోభయనదీమధ్యే, మహాపట్టణే
శ్రీశైలస్యజలాధినాధహారితి, శ్రీజోగులాయాస్థలే
వేదానాదవతీపరిష్కృత పదే, బ్రహ్మేశదేవాలయే
యే ధన్యా నివసంతి పుణ్యపురుషా, స్తేభ్యో నమ స్సర్వదా. 4

పయిని శ్లోకంబులకు ఛాయగాఁ దెల్గు.

గీ. బ్రహ్మ దివ్యమా బ్రహ్మేక్షరములతోడఁ
బూర్వయుగమునందున స్తోత్రముం బొనర్చి
ఘోరతరతపం బొనరించి, కూర్మిఁ దత్పు
రారి కృపను బ్రహ్మత్వంబు నంది మించె. 1

గీ. కరము శుభము, జ్యోతిర్జ్వాలికా మయంబు,
నయిన బ్రహ్మేశలింగంబు నరయుటకును
ననువు పడుఁ దపస్సిద్ధుల, కన్యు లయిన
జనుల కారీతిఁగాంచఁగ శక్యపడదు. 2

ఉ. ఆగమవేది, బ్రహ్మ, తొలి సాంగతపం బొనరించి, సన్నుతుల్
బాగుగఁ జేయఁగా, రహిఁ జెలంగఁగ దర్శన మిడ్డ శూలి, లో
కాగణితాకరాధ్యుఁడు, స్వయంబుగ సాంబుఁడు, శ్రీగిరిప్రతీ
చీగృహమార్గవర్తి మముఁ జెల్వుగ బ్రహ్మమహేశుఁ డేలుతన్. 3

శా. శ్రీకృష్ణాశ్రుతజా ప్రమధ్యధరణిన్, శ్రీశైలపుం బడ్మటం
ప్రాకట్యంబగు జోగుళా స్థలమున, న్నామ్రదావతీ వేదలన్
శ్రీకృ చ్ఛోభ నెసంగు చోఁ, దగు పురిన్ జెల్వారు బ్రహ్మేశ్వర
శ్రీకళ్యాణ గృహాంబునం దగు ఘనశ్రేణిన్ సదా మ్రొక్కెదన్. 4

ఇంకను గొన్నిశ్లోకములు పారాయణ యోగ్యములు:—

## నవబ్రహ్మ స్థలములు.

శ్లో. బాలబ్రహ్మ కుమారోఽర్క - వీరో విశ్వ శ్చ తారకః
గరుడ స్వర్గః పద్మశ్చ - నవబ్రహ్మ ప్రకీర్తితాః. 1

శ్లో. బ్రహ్మేశోఽయం స విశ్వేశః - సా కాశీతి హ్యాలంపురీ
సా గంగా తుంగభద్రేయం - సత్యమేత న్న సంశయః. 2

శ్లో. కేదారే జలపాన, మార్య! మరణం వారాణసీ పట్టణే
రాహుగ్రస్త దివాకరే కురుమహాక్షేత్రే చ దానం మహత్
శ్రీశైలే శిఖరావలోకన మిదం సంసారిణాం దుర్లభం
లోకేఽస్మి న్నవలింగ దివ్య భవనే వాసో మహాదుర్లభః. 3

## శ్రీజోగుళాంబాస్తుతి.

శ్లో. లక్ష్మీ స్వరూపాఽఖిల పుణ్యదాత్రీ - పుత్రప్రదాత్రీ, శుభదృష్టియుక్తా
కరాళవక్త్రా, కరుణాలవాలా - నమామి తాం జోగుళనామధేయాం. 4

## పయిని శ్లోకములకు తెల్గింపు.

గీ. బాలబ్రహ్మ, కుమారుండు, పరఁగ నర్కుఁ
డిఁకను వీరుఁడు, విశ్వతారకులు, గరుఁడుఁ
డింక స్వర్గుండుఁ, బద్మండు నేఁమి, నిటు ల
లంపురిని నవబ్రహ్మలు సొంపు గాంత్రు. 1

గీ. పొనర నల కాశి యీ యాలంపురియు, నందు
వెసఁగు విశ్వేశ్వరుండె బ్రహ్మేశుఁ డితఁడు,
తొడరి యెల్ల జాహ్నవియె యీ తుంగభద్ర
సత్య మిది, యిందు లే దెట్టి సందియంబు. 2

ఉ. గౌరిరో! కాశియందు మృతి గాంచుటయున్, గురుభూమి దానముల్
సారస బాంధవగ్రహణసత్సమయంబునఁ జేయు, టింకఁగే
దారమునందు నీరమును ద్రావుట, శ్రీగిరిశృంగదర్శనో
దారమహంబు, లింగనవకాలయ వాసము, దుర్లభం బిలన్.

## శ్రీజోగుళాంబాస్తుతి.

గీ. శ్రీస్వరూపిణిఁ, బుణ్యదాత్రీమతల్లిఁ
బుత్రసందాయినిఁ, గరాళీముఖిఁ, గృపాల
వాల, శుభదృష్టి యుక్త, నంబను నమస్క
రింతు జోగుళాంబిక నె దనెసంగుభక్తి. 4

## భాస్కరక్షేత్ర లక్షణము.

(శ్రీగోకర్ణ మాహాత్మ్యములో 38 వ. అధ్యా.)

శ్లో. పశ్చిమాంబుధి తీరస్థమ్ - గోకర్ణం క్షేత్ర ముత్తమమ్
రుద్రేశాధిష్ఠితం పుణ్యమ్ - భాస్కరక్షేత్ర ముచ్యతే. 1

శ్లో. పర్వతాగ్రే నదీతీరే - బ్రహ్మ విష్ణు శివైశ్శ్రితే
దుర్గాది బాహులేయాద్యై - స్తద్భాస్కర మి తీర్యతే. 2

శ్లో. కాశీ పుష్పగిరిః కాంచీ - నివృత్త్యాఖ్యా హ్యలంపురీ
శ్రీశైల శ్శ్రీవిరూపాక్ష - స్సేతుః కేదార ఏవచ
గోకర్ణం ద శైతాని భాస్కరా ణ్యాహు రుత్తమాః. 3

## శ్రీజోగుళాంబాష్టకమ్.

శ్లో. మహాయోగపీఠ స్థలే తుంగభద్రా-తటే సూక్ష్మకాశ్యాం సదా సంవసంతీం
మహాయోగి బ్రహ్మేశవామాంకసంస్థామ్ - శరచ్చంద్రబింబాం భజే జోగు
లాంబామ్. 1

శ్లో. జ్వలద్రత్న వైడూర్య ముక్తాప్రవాళ - ప్రవిన్యస్త గాంగేయ కోటీరశోభాం
సుకాశ్మీరలేఖాప్రభాభాం స్వఫాలే - శరచ్చంద్ర. 2

శ్లో. స్వసౌందర్యమంద స్మితా మిందు వక్త్రాం-లసత్కజ్జలాలిప్త పద్మాభనేత్రాం
పరాం పార్వతీం విద్యుదాభాస గాత్రాం - శరచ్చంద్ర. 3

శ్లో. ఘనశ్యామ లాపాదసంలోల వేణీం - మనశ్శంకరామోదపీయూషవాణీం
శుకాశ్లిష్ట సుశ్లాఘ్య పద్మాభపాణీం - శరచ్చంద్ర. 4

శ్లో. సుధాపూర్ణ గాంగేయకుంభ స్తనాఢ్యాం - లస త్పీతకౌశేయ వస్త్రాం స్వ
కట్యాం । గశేరత్న ముక్తావళీ పుష్పహారాం - శరచ్చంద్ర 5

శ్లో. శివాం శాంకరీం సర్వకల్యాణశీలాం - భవానీం భవాంభోనిధేర్దివ్యనౌకాం
కుమారీం కులోత్తారిణీ మాది విద్యాం - శరచ్చంద్ర. 6

శ్లో. చలత్కింకిణీనూపురా పాదపద్మాం - సురేంద్రైర్నగేంద్రైర్మహాయోగి
సదాసంస్తువంతీం పరంవేద విద్భిః - శరచ్చంద్ర. [బృందైః

శ్లో. మాహేశసౌందరీం హవ్యవాహ స్వరూపాం-ప్రసన్నాం ప్రపన్నార్తి హంత్రీం
ప్రసిద్ధాం । - మహాసిద్ధి బుద్ధ్యాది వంద్యాం పరేశీం - శరచ్చంద్ర. 8

శ్లో. ఇదం జోగుళాంబాష్టకం యః పఠేద్వా
ప్రభాతే నిశార్ధేఽథవా చిత్తశుద్ధిః
పృథివ్యాం పరం సర్వభోగాంశ్చ భుక్త్వా
శ్రియం ముక్తి మాప్నోతి దివ్యాం ప్రసిద్ధః. 9

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శంకరాచార్య విరచితమ్ శ్రీ
జోగుళాంబాష్టకమ్ సంపూర్ణమ్. 10

## పయిని శ్రీజోగుళాంబాష్టకమునకు తెలుఁగు.

గీ. తుంగభద్రాతటమున నెసంగు సూక్ష్మ - కాశి బ్రహ్మేశ వామాంక [కలితయై మ
హత్త్వయుత యోగపీఠస్థ యైన జోగు - ళాంబ, దేవి శరచ్చంద్ర బింబఁ [గొల్తు.

గీ. గణ్యరత్న వైడూర్య ముక్తా ప్రవాళ- ఖచిత గాంగేయ కోటీర కాంతికలిత
ఫాల, కాశ్మీర లేఖాప్రభాఢ్య, జోగు - ళాంబ, దేవి శరచ్చంద్ర. 2

గీ. సుందరత్వ మందస్మిత శోభిచంద్ర - వదనఁ, గజ్జలాంచితనేత్రఁ, బరను, విద్యు
దతులశోభాయుతాంగిఁ, బార్వతిని, జోగు - ళాంబ, దేవి. 3

గీ. నిజపదాలోల నీరద నీలవేణి - సభవ హృదయ ప్రమోదకృదమృతవాణి
వరశుకీయుక్తఁ, బద్మాభపాణి, జోగు - ళాంబ, దేవి 4

గీ. అమృతపూర్ణ సువర్ణ కుంభాభకుచను - బీతకౌశేయవస్త్రను విలసితకటి
లలిత మణిమౌక్తికావళీగళను, జోగు-ళాంబ, దేవి. 5

గీ. సర్వకల్యాణశీలయు, శాంకరి, శివ, భవమహాబ్ధి సన్నౌక. భవాని, యాది,
విద్యయును గుమారి కులకరి విమల జోగు - ళాంబ, దేవి. 6

గీ. చలితకింకిణీ నూపుర చరణపద్మ - వేదవేత్తృ సురేంద్ర నగాధినాథ
మానినాయక ప్రస్తూయమాన, జోగు - ళాంబ, దేవి. 7

గీ. హరికిసోదరి, హవ్యవాహనసురూప - అతిప్రసిద్ధ, ప్రపన్నార్తిహంత్రి, సుప్ర
సన్న, సిద్ధి బుద్ధినత,' యీశ్వరియు, జోగు - ళాంబ, దేవి. 8

గీ. ఇద్ది జోగుళాంబాష్టక, మెవఁడు పగలొ ?
నడికిరేయో? మనశ్శుద్ధి తోడరఁ జేదువు
వాని కిల సర్వభోగముల్ పరఁగియును, బ్ర
సిద్ధుఁడై శ్రీలఁ దగి, ముక్తిఁ జెందుఁ దుదిని. 9

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శంకరాచార్య విరచిత జోగు ళాంబాష్టకమును, దానికి శ్రీకవిభూషణ శతావధాని దోమా వేంకటస్వామి గుప్త సలిపిన తెలిఁగింపును—సంపూర్ణములు.

## కథా ప్రారంభము.

శా. పుణ్యక్షేత్రను నైమిశాఖ్యవనికాప్రోద్య న్మునీంద్రాశ్రమా
గ్రణ్యస్థానమునందు సూతముని రాడ్గణ్యుం డిలన్ దండకా
రణ్యక్షేత్రవరేణ్యమై, శిఖరమాత్రాలోకము క్తిప్రదా
గణ్య శ్రీయుతమైన శ్రీగిరిశుభాఖ్యానంబు వాక్రుచ్చుచున్. 1

క. తెలిపెన్ శ్రీగిరివారణ - విలసద్దిగ్ద్వారమహిమ విషయమును, దేవా
వళివినుతనయముఁ, బరిహృత - ఖలపాపానయము, సాధుగణ్యాభయమున్. 2

## శ్రీకృష్ణానది

శా. ఆం దందంబునఁ బొందు వార్లహారికా పాంచన్మనోజ్ఞత్వ మిం
పొందం జేలిన నాహినీమణి, యతీవోదార పాపాటవీ
సందోహాంతక, మంతకాంతికహరస్ఫారప్రకారంబు, ము
క్తీందూద్యన్ముఖిఁ జేర్చు దూతి యయి శ్రీకృష్ణాసమాఖ్యన్ దగన్. 3

సీ. జలజాక్షియై, చక్రలలిత స్తనియునై, మహాసైకతశ్రోణియై, సారిదిని
జక్రాంగగమనయై, జలమయవసనయై, మందానిలశ్వాసమానితయయి,
దిండీరమాలికాదివ్యహారయయి, యావర్తనాభియుఁ, గచ్ఛపముఖనీర
జంతుకాంచీ విలసత్కటియై, నీరఖగరవాలాపయై, కరము సార

గీ. సోత్పలాదికసౌరభయుతతనువయి - బేడిస తళుకుబెళుకులన్ వెలసి, నైక
శోభనంబులఁ బొల్చియు, పరఁగఁగన్నె-మిన్న పగిదిఁ గృష్ణానది చెన్ను మీఱు.

వ. మఱియు నత్యద్భుతవికాసయుక్త గాత్రంబులును, ద్విజ సమాకర్ణనంబులును నానా కుజాత్యాకుల భావంబును, బుష్పాళ్ల పసపుంబూఁతయును దంతి

దంతావళఘట్టిత తటయుగసొబగును జెలంగి యొక పుణ్యాంగన యడుప్ర
నను దత్కృష్ణాస్రవంతి దైవారెడిని. 5

ఉ. కందళదర్జునావనిజ కైరవజాత కదంబకేతకీ
బృంద రసాలసాల తతి విస్తృత పుష్పఫలప్రమోదితేం
దిందిరఝుంక్రియాలపన దివ్యమహావిభవాభిరామమై
పొంగెడి నమ్మహానది సుపుణ్య మగణ్యతఁ గొల్పు సంపదన్. 6

సీ. పారి ద్విజాకర్ణన పుష్పరజోలేప - నమునఁ బుణ్యాంగన నలువు గాంచు,
నైకాగశృంగ నిర్యద్వాఃప్రవాహశో-భను జంద్రరేఖికాప్రభను దనరు,
గందరాబృందవేగక్రియా మందమం-దగతి రతిశ్రాంత సొగసు నొందు
వానుకికన్యకావాస యా యేర్మలి,కల నడందగు నాగకన్యరీతి.

గీ. దేవదేవుండు శ్రీకృష్ణు దివ్యమతిని - బొడమి భారత దక్షిణభువిని సకల
తీర్థరాజ విరాజమానార్థ మెసఁగు - సాగరపుఁ గొమ్మ యైన కృష్ణాస్రవంతి. 7

శా. ఆ కృష్ణానది కృష్ణవేణి యను నన్యంబైన పేరొందు; నం
దా కృష్ణాఖ్య హరిస్వరూపమును, వేణ్యాఖ్యాక తత్పార్వతీ
శాకారం, బల రెంటి సంగమ మహాస్థానం బనూనాఘరే
ఖాకీలాలకముక్, విముక్తిపదవీ ఘంటాపథ ప్రాయయన్. 8

శా. యోగీశానులు, నూర్ధ్వరేతులుఁ, దపఃప్రోల్లాసు,లే ముక్తిస
ద్భోగంబుం గను వాఁ, లాపదపనిం బొందం దగుం జూడ? కృ
ష్ణాగణ్యాపగ పుణ్యతీరముల వాసం బ్రాక్రిముల్, కీటకాల్
జేఁగల్, కుక్కలు ; మాట లేల? సకలోర్వీజంతు సంతానముల్? 9

క. ఆకృష్ణవేణికాలహ - రీకలితజలేచరముల రీతి ననఁ బనే
మీ? కృష్ణానిలవితతుల్ - సోఁకిన జంతులకె ముక్తి చొప్పడఁ జేయన్. 10

## శ్రీ తుంగభద్రానది.

క. ఆకృష్ణవేణియామ్య - ప్రాకటదిశయందుఁ దనరి బాగొందెడు న
స్తోకగతిఁ దుంగభద్రా-శ్రీకల్యాణద నదీవరేణ్యం బొనరన్. 11

క. అందుం దానం బాడిన - డిందుం ఘోరాఘ తతి, కడిందిం ద్వరఁ బొ
ల్పొందుఁ మోక్షనివాసా-నందం బందము శ్రితుల మనంబుల నొందన్. 12

గీ. అఖిలభూతంబుల, కల పుణ్యాపగ సక
ల ప్రమోదముల్ గూర్పఁ, గై లాసపదవి
కరతలామలకంబుగాఁ గ్రాలఁ జేయఁ,
దనరు, నిం దెందు సందియం బొనరఁ బోదు. 13

గీ. అందుఁ దుంగయుఁ భద్రయు నలమికొనియు
దుంగభద్ర నా నేకమై తోడరు, నటను
దుంగహరిరూపు, భద్ర యిందుధరు రూపు;
నగును; రెంటి సంగమము మోక్షాకరంబు. 14

శా. "గంగాస్నానముఁ దుంగఁబాన" మని వాక్యం బొప్పు విజ్ఞాళిలో
నం; గళ్యాణద తుంగభద్ర యల కృష్ణావాహినిం బోలుచుఁ
రంగారుం; గర మా నదీద్వయము నారం గొల్చువా ర్యజ్ఞముల్
సాంగంబై తగ సర్వముల్ సలుపు మే లందం గనుం దక్షతన్. 15

గీ. మోక్షసామ్రాజ్య పదవినే పొందఁ జేయు
సేవఁజేయు వారి కల సుశ్రీతరంగి
ణు లన, వాజపేయాశ్వమేధల సమాన
ఫలము లవి కూర్చు నని పల్క వలయునొక్కొ ?? 16

శా. ఆ రెండేరుల సంగమస్థలిని దై వాజుంగ నా సంగమే
శాఖ్యాభిధశంకరుం గొలుచు పుణ్యాత్ముల్ సమస్తోదయా

గారంభంబులఁ జేయు పున్నెములఁ బొల్పారంగనై, సర్వభో
గారూఢిం గని, రుద్రగౌరవము నంత్యంబందుఁ గాంత్రెంతయున్. 17

గీ. ఇంక, నల తుంగభద్రాఖ్య కృష్ణవేణి
సంగమించుచో సంగమేశ్వరుని గొల్వఁ
బుత్రపౌత్రాభివృద్ధి పెంపొందుఁ దనకుఁ,
దన హితుల్ బంధుగుల్ ధన్యతను గడింత్రు. 18

క. ఈ విధిఁ దెల్పెం గిరిజా-దేవికి శంభుం; డటులనె తెల్పెన్ సూతుం
డా విమలధీ సమేతుం - డా వనమున నైమిశమున నలమౌనులకున్. 19

## శివపుర వైభవము.

క. అవల, శివపుర మ్మనఁగా-భువిఁదగు శ్రీశైలపు రహి భూధరసుతకున్
శివుఁ డవిరళకృపఁ దెలిపెన్-భువిని జనులు పుణ్యమార్గముం దెలియంగన్. 20

శా. ఆశైవోరుపురాఽపరాఽఽశ వరుణుం డత్యంతవిక్రాంతిమైఁ
బాశం బూనియుఁ బ్రోఁచుచుండు, మఱి సర్వస్వర్ణమై యొప్పి యా
శ్రీశైలాపరదిక్కు-గోపురము వాసిం బొల్చు దివ్యత్ప్రభా
లేశాత్యద్భుతమగ్నశౌరిముఖబర్హిర్వక్త్ర సంఘాతమై. 21

ఉ. భూతము లెల్లఁ గొల్వ, నల పుణ్యగణాకర మైన గోపురం
బాతతసూర్యమండలము నంటుచు, సూర్యవిభావిభావళీ
ద్యోతితమై, యధూమశిఖియో యనఁగాఁ దపనీయపూర్ణమై
భాతి చెలంగు శ్రీగిరికి వారుణ దిక్కున మౌనివంద్యమై. 22

ఉ. ఆ వరగోపురామల విభావళి దేవతలున్ మునీంద్ర సి
ద్ధావళులే కనుంగొనఁగ నర్హులు, ప్రాకృతమానవాళి కా
శ్రీవిధికానరా, దొగి విరించి సురేంద్ర సురోరగావళుల్
భావ మెసంగు భక్తిఁ గొలువం జేసెదంతురు నిత్యమయ్యెడన్. 23

ఉ. వినుతలల్, సహస్రఫణ, లేఁబడిశీర్షములం దెలంగు నా
నానిలభుఙ్నికాయము కనద్భయదం బగుఁ గాలకూట ఘో
రానలసామ్యదుర్విష విరాజితమై, సముదీర్ణ దృష్టి మా
త్రాన విసంబు గ్రొల్పుచుఁ దెఱంగు లెఱంగి యనేకరీతులన్. 24

ఉ. పన్నగపాళి శ్రీకుధరపశ్చిమని కృప్తితిహారమందునన్
పన్నగశేషుఁడున్, విసనుపావకులున్, ధృతరాష్ట్రకోపకుల్
మున్నగఁ జేరియున్, ఐరుణు పొంతనె, యుంద్రలచోటిచుట్టు మూఁ
డెన్నఁగ యోజనాల్ దనుక, నెందఱొ దేవతలుందు రిమ్మగన్. 25

గీ. ఇట్టి మహిమాన్విత మ్మగు నట్టి తీర్థ - రాజమందు నే పుణ్యకార్యంబయేని
చేయఁబడు నేని నది సహస్రీభవత్ఫలప్రదంబగు, నిజము; పర్వతకుమారి! 26

శా. ఓ కల్యాణి! నగేంద్ర నందినిరో! యం దొప్పారు తీర్థావళుల్
ప్రాకట్యంబుగ నాజవంజవ మహాపాపాటవీ కీలికీ
లాకారంబులు, మోక్షదాయకము, లుద్యల్లోక యుగ్మోరు ల
క్ష్మీకల్యాణకరంబు, లల్ల మహిమల్ చెల్వార నాలింపుమా!! 27

సీ. మెఱఁగఁ బాపనాశిని, మోక్షేశ్వరమ్ము, వేదావతీతుంగ భద్రాసమాగ
మము, స్వర్గ్భవనకవాటము, బ్రహ్మతీర్థమ్ము, గణికాంగనాసిద్ధిగణ్యాతలము,
తనరంగ రుద్రపాదము, బ్రహ్మనారాయణమును, జనార్దనేశమును, నార
దేశ్వరమ్ము, మలక్షయేశ్వరమ్మును, దక్షిణేశ్వర, మ్మిఁకను రామేశ్వరమ్ము,

ఆ-వె. పయిఁ దెలిపినయెడల పాటవం బెంతయు - నొప్పు నందు రాఘవోరుధారు
ణీంద్ర నిర్మితమయి నెగడి రామేశ్వర - క్షేత్ర మొప్పు ముక్తి చెలఁగ నిడఁగ.

సీ. లక్ష్మణేశ్వరనుతీర్థము, వారణేశ్వరము, నీఁక నంత గ్గంగ పొందుఁ బాటు,
లోకత్రయాఘముల్ పోఁగొట్టును, ప్రయాగమాధవంబును, శుభమహితమయిన
సప్తకోటీశంబును. సరగను రాజరాజేశంబు, నింద్రసిద్ధేశ్వరములు
కంఠేశ్వరమ్ము, వాజ్నాగేశ్వరంబులు, భోగేశ నాదావతీగుణనిక

గీ. రాపగాస్థలములును, సో-మాఖ్య మిక్క - కలకలేశ్వరమును, నవ-కంజగర్భ
తలము, పంచరామేశ్వర-స్థలము, సోమ - సిద్ధశివము, దేవద్రోణి-క్షేత్రతలము.

వ. మఱియు, నగ్నీశ్వరంబు, కుక్కేశ్వరంబు, త్రిజటేశ్వరంబు, జలలింగేశ్వరంబు, కపాలేశ్వరంబు, ప్రథమబ్రహ్మేశ్వరంబు, మల్లికార్జునంబు, చండికేశమహాతీర్థంబు, సాక్షేశ్వరంబు, ఆదిదుర్గా మహాతీర్థంబు, మయూరేశ్వరంబు, మాధవ సిద్ధేశ్వరంబు, త్రిపురాంతకంబు, దైవతంబు, లోనయిన మోక్షలక్ష్మీ సంధాయకంబు లయిన యక్షీణ పుణ్యతీర్థంబు లక్షయంబుగాఁ గలవు. మఱియు, నోశుభాంగీ! శర్వాణిరో! తత్తత్ఫల మహాత్త్వంబుల నిదె నీకు వక్కాణింతు నాలకింపు" మని సెలవోసంగె; నట్లు నైమిశకాంతారంబునందు సూతపౌరాణికుండును శౌనకాదిమునీంద్రులకు వాక్రుచ్చుచు. 30

## అలంపురి.

గీ. పావర నల కాశి యా యలం-పురియు, నందు
వెసఁగు విశ్వేశ్వరుండె బ్ర-హ్మేశుఁ డితఁడు,
తోడరి యల్ల జాహ్నవియె యీ-తుంగభద్ర,
సత్య మిది, యిందులే దెట్టి - సందియంబు. 31

ఉ. ఆగమవేది బ్రహ్మ తొలి సాంగతపం బొనరించి సన్నుతుల్
బాగుగఁ జేయ, మోదము చెలంగఁగ దర్శన మిడ్డ శూలి, లో
కాగణితాకరాధ్యుఁడు, స్వయంబుగ సాంబుఁడు, శ్రీగిరిప్రతీ
చీగృహామార్గవర్తి మముఁ జెల్వుగ బ్రహ్మమహేశుఁ డోముతన్. 32

క. ఘనభక్తి ని మ్మహత్త్వము - వినువా, ర్పఠియించువారు, వెసను సకలపా
పనిబర్హణమును గని, ము - క్తినిగాంతురు, తుదిని దీనికిన్ లేవె మ్మెల్. 33

(ఇక్కడికి సంస్కృతగ్రంథమునందలి మొదటి యధ్యాయము ముగిసినది.)

వ. తదనంతరంబు. 34

## శ్రీబ్రహ్మేశ్వర క్షేత్రము.

శా. కింపుర్వాణపురందరాదికమహా గీర్వాణుఁ, డా శంకరుం
డంకం బొందని పేర్మిఁ బల్కె హిమశైలాపత్యముం గాంచి:—యో
పంకేజాక్షిరో! దేవమానిగణసంభావ్యంబు, సప్తర్షి శో
భాంకస్థానము వొల్చు భూస్థలి నొగిన్ బ్రహ్మేశ్వర క్షేత్రమున్. 35

వ. అయ్యాది మల్లోకంబున నస్తోకంబుగా వాసిం గన్నదియు, నెల్ల పాపంబులను బాఁపునదియు, ననుఁడుఁ, బార్వతీదేవి పరమేశ్వరుని గాంచి రచితాంజలి బంధంబుతో, 36

గీ. ఓ మహేశ్వర! విశ్వేశ! యుర్వి నల్ల - తీర్థమునకు బ్రహ్మేశ్వర-తీర్థ మనెడి
పేరు గల్గిన వితమును వినఁగ నాకు-వేఁడుకగు దెల్పుఁగాఁ; మిమ్ము-వేఁడుదాన.

వ. అనవుఁడు సర్వలోకవశంకరుం డయిన శంకరుండు శాంకరితో నిట్లు పల్కె.

గీ. బ్రహ్మ దివ్యమా బ్రహ్మేక్ష-రములచేతఁ
బూర్వయుగమునందున స్తోత్ర-ముం బొనర్చి
ఘోరతరతపం బొనరించి-కూర్మిఁ దత్పు
రారికృపను బ్రహ్మత్వంబు-నంది మించె. 39

గీ. కనుక నిత్తీర్థ మా కంజ-గర్భు పేరఁ
బరఁగె బ్రహ్మేశ్వరమనఁగ; - భక్తితోడ
నిటఁ జెలంగు బ్రహ్మేశు ర-హిన్ సతంబు
పూజ సేయ, సర్వార్థముల్ - పొందు; నిజము. 40

శా. ఆ దివ్యస్థలిచుట్టు యోజనము దాఁ కంతంబు నే జంతువేన్
బ్రోదిం గాంచిన, దాని కోటి తరముల్ పొల్పొంద వంశంబు, బ్ర
హ్మోద్యదారస్థల మొంది, యవ్వలఁ, గడున్ బ్రోల్లాస మేపార నా
నాదేవేడ్యత సప్తసప్తకుల ధన్యాత్ముల్ తనుం జెట్టఁగన్ 41

శా. చేలం గోటిరవిప్రభాయుతము లై, సర్వత్రసంచారకో
ద్వేలశ్రీఁ దగి దేవతాంబుజముఖీ దేదీప్యమానంబు లై,
భూలోకాతిగ పుష్పశోభఁ గని, సొంపుల్ వేణువీణావినో
దాళిం జెందు విమానయానములతో నందున్ శివాఽఽలోకముల్. 42

## హోమ కుండము.

శా. ప్రోదిన్ దత్సుఖ మంది, జంతు వది భూలోకంబునం, బుట్టి నా
నాదిఙ్మండలమండితక్షితి నొగిన్ బాలించు, బ్రహ్మేశ్వర
శ్రీదక్షేత్రమహాత్త్వ మిద్ది; యచటం జెన్నారి బ్రహ్మేశు నెం
తో దాఁపించియుఁ దూర్పునం దొకటి పొందున్ హోమకుండం బొగిన్. 43

## శ్రీ బ్రహ్మేశ్వరావిర్భావము.

శా. ఆ కుండంబున, హోమకాలమున, ము న్నావిర్భవం బందె లిం
గాకారంబున బ్రహ్మశంకరుఁడు; దివ్యంబైన తల్లింగ మ
స్తోకజ్యోతిరనూనభా క్కిరణతేజోవంతమై కన్పడున్;
వీఁకన్ మానుల కట్లు, ప్రాకృతుల కెంతేఁ గాన రా దిద్దియున్. 44

వ. మఱియు, నాబ్రహ్మేశ్వరు నాశ్రయించి యనేకులు సిద్ధి నొందుటంజేసి
యీ క్షేత్రంబు సిద్ధేశ్వరంబనం బరఁగెడిని. 45

గీ. త్రిపురసుందరీ! పార్వతీ-దేవి! యిఁకను
దేనిఁగూర్చి యడిగెదో? యర్థిన్ వచింతు
ననుడు, శంభుని గాంచియు-నగజ పల్కె
మందమందమృదూక్తుల-నంద మెసఁగ. 46

క. దేవా! యచ్చోట బహుతీ, ర్థావళి గల దంచు నాకు నానతి యిడినా,
రా విమలతీర్థ మాహా, త్మ్యావళి విన వలతు డెంద మందం బొందన్. 47

ఉ. అందుల కానతిచ్చె హరుఁ, "డంగన! నాదవతీసమాఖ్య సొం
పొందెడి, వేదయుం దనరు, నల్లధునీద్వయంబు మ
ధ్యం దగు దేశమెల్లను శివావని నాఁగఁ జెలంగు; నందుఁ బెం
పం దెడి జంతుపక్షికృము లందెడు నా భవు సన్నిధిం దుదిన్. 48

## అష్టాదశ తీర్థరాజములు.

మ. అటఁ దీర్థంబులయందునుం దగుఁ గరం బష్టాదశక్షేత్రముల్
పటునైర్మల్యముతోడ మోక్షపదవీ ద్వారాకృతిం బొల్చు; నయు
త్కటపుణ్యం బల సేవనక్రమము వక్కాణింతు, నాలింపు వి
స్ఫుటసుశ్రద్ధమెయిన్ మనోఽంబుజము సంపూర్ణ ప్రమోదంబుగన్. 49

ఉ. ఆ పదునెన్మిదైన సుకృతాంచితతీర్థము లెల్లనే నరుం
డోఁపిక భార్యతోడ రహి నొక్కదినంబునఁ గొల్చి, యాల దు
ష్పాపహరు న్నృసింహుఁ, బిదపన్ రహి బ్రహ్మశివున్, మ ఱాల భూ
మీపటుదేవినిం గొలువ మేకొను నేనియు భక్తిమీఱఁగన్. 50

ఉ. వానికి సంపదల్ దనరు, వానికిఁ గల్గెడు నెల్లకోర్కులున్,
వానికి నెల్లచో విజయ వైభవమొప్పును, వాని కెప్పుడున్
మానితశైవలోక బహుమానము గల్గును, శంభుమన్నవల్
వానికిఁ జెందు, నింక నలవానికిఁ వాఁడె సమానుఁ డారయన్. 51

## అంతర్గంగ

మ. తొలిఁ గంజాసనుఁ డంత రిక్షమున నెంతో ఘోర మా మేల్ తప
మ్మొలయం జేయఁగ, నాతనిం దరిసి దేవోత్తంసులిట్లాడి; "రో
నలువా! భూతలమందు మంగళ మిడం బొల్పొందు తీర్థంబు సం
ధిలఁగాఁ జేయవె?" యంచు వేవితములన్ వేఁడంగ వాగీశుఁడున్. 52

గీ. అల్ల దేవతల్ కోరిన-యట్టు లాతఁ, డచేటఁ దీర్థంబు నిర్మించె;-నటనుదనరు,
చుండునట్టి యంతర్గంగ-సారిడఁదాన,మాడువారు చెందుదురు స-ర్వార్థములను.

గీ. పొందుగ నల యంతర్గంగ - యందుఁ గ్రుంకు
నరుఁడు గో బ్రాహ్మణ వధాది - దురితములును
మాతృపితృవధపాపముల్ - మాసి, మరలఁ
బుట్టు వొందని కైలాస - మును గడించు. 54

కటకమాసపుఁ దుంగభద్రానది.

గీ. పరఁగఁ గటకపు నెల దుంగ-భద్రకరము,
తనరు భాగీరథినిగూడి; పొనర నద్ది
యొసఁగెడిఁ బునరావృత్తిర-హితవిముక్తి,
కర మగుచు నష్ట సకలార్థ - కరము నగుచు. 55

శ్రీమణికర్ణికా తీర్థ రాజము.

మ. అగపుత్రీ! మణికర్ణికాఖ్య గొన బౌనా తీర్థరాజంబునం
దగ భాగీరథి నేరినప్పు డెలమిం దానంబు లాడంగ నా
నుగమ శ్రీకు లెవారు గాని సతమున్ బొల్పొందు మేల్ యౌవనా
నఁ గరం బొప్పి, జరామృతుల్ విడి, యొగిన్ వజ్రాంగముల్ గాం త్రిలన్. 56

చ. అల మణికర్ణికం జలక మాడు జనుల్ మఱి నెన్నియేని రీ
తుల రహిఁ గాంత్రు భాస్కరునితోఁ దులఁదూఁగెడిమేని తేజుతో,
విలసిలు మంచి ముత్తెముల పేరులతో; నట గోవుమున్నుగా
నొలసెడి దానముల్ జరపు యోగ్యులు గాంతురు దేవతాప్రభన్. 57

ఉ. అక్కడ యాత్రికుండు బహుళామలమానసుఁడై చెలంగి, బల్
ముక్కువ శంకరుం గొలిచి, బ్రాఁతిని గాంస్యపుదాన మిచ్చియున్
బెక్కువ నెల్లధర్మముల వేడ్కను జేసెయు, నిల్లుసేరి, యా
యిక్కను విప్రభుక్తు లొనరింపఁగఁ జేసిన ముక్తి నొందెడిన్. 58

వ. మగఁడును గొడుకులు గల పడఁతి యటను బాయసదానంబు గావించి దేవత్వం బొందును. 59

గీ. దాని మహిమంబు సంతాన-దంబు; కాంత!
సంతులేని యింతి శుచిగా-స్నాన మాడి
గౌరిఁ గొల్చి, ముత్తైదువం-గడఁగి యర్చ
సల్పి వాయన మిచ్చినన్-సంతు గల్గు. 60

క. అని సంక్షేపతఁ జెల్పిన, విని పార్వతి హరునిగాంచి, - వినయంబున వం
దనమొనరించియు "దేవా! వినిపింపుము మఱొక తీర్థ-విమలత" ననుడున్ 61

వ. అందులకు శంకరుం డిట్లను. 62

చ. ప్రియతమరో! వినం గదవె? పృథ్విని బుత్రు లెసంగునట్టి దో
షయుతజనాళికిన్ రహిని జేల్పెడి కోసము తీర్థమందు ము
న్క యొగిని జేఁత సెప్పఁబడుఁ గాదొకో? నే నిపు డా విధాన మెం
తయుఁ గడుఁ దేఁట తెల్లముగఁ దార్కొనఁ దెల్పెద నాలకింపుమా!! 63

ఉ. సం తసలారనట్టి యల సారసనేత్రలు భక్తి మీఱఁగన్
గాంతులఁ గూడి, మంగళవికాసముతోఁ దగు వస్త్రభూషలన్
మంతుగఁ దాల్చియున్, నది నమందపు శ్రద్ధమ దాన మాడి య
త్యంతసుభక్తి సాంధ్యకృతి యా వెనుకన్ హరుఁ గొల్వఁగా వలెన్. 64

అష్టాదశతీర్థాదులు.

సీ. అవుల నీ సత్కథ యాలించి యష్టాద-శము లైన భవ్యతీర్థముల కథల
నాలింపఁ గా వలె, నవలదానములు ధ-ర్మములు లోనా సుకర్మములు సల్పి
పురవైరినరసింహపూజల నొనరించి - కుంభినీదేవిని గొల్చి, పిదప
అభవచిదాకార మగు వైద్యనాథలిం-గముఁ జూచి, తాఁకి, చెన్నారు బత్తిఁ

గీ. గొల్వ వలెఁ డ్ర్యంబకత్రిశూ-లలలితుని ను
మాధినాథు సాక్షేశ్వరు - మహితభక్తి,
నవులఁ బూజింప వలెఁ, దదనంతరంబు
సలుపఁ దగు రీతి వినఁగదే? - సన్నుతాంగి. 66

## శ్రీహాటకేశ్వరుఁడు.

చ. అలరెడి మంచి ముత్తెముల హారములం దగు ముక్తిశంకరుం
గొలిచి, త్రిశుద్ధిమై రజతశుభ్రవరు స్సగజామనోహరుక్
విలసితశూలపాణి శుభవేషు జటామకుటాభిశోభితుక్
గొలువఁగఁ జెల్లుఁ బాపహృతికోవిదుఁడై తగు హాటకేశ్వరుక్. 67

## శ్రీమార్కండై కామేశ్వరులు.

మ. అటకుం దూరుపుదిక్కునందునఁ గరం బందంబుఁ జెందంబు పి
క్కట మై పొల్చెడి ముక్తిదాయకుని మార్కండేశ్వరుం గొల్చి, య
య్యట నాజ్ఞం గొని, భక్తలోకనతుఁ డేకామేశుఁ బూజించి, యో
నిటలాక్షా! వృషభధ్వజా! యనుచు నెంతే భక్తిమై మ్రొక్కుయుక్. 68

గీ. ఇల్లు నేరి భక్తుల భుక్తు - లెసఁగఁ జేసి,
తాము భుజియించు నెడ, నల వ్యోమకేశు
దయను, బుత్రలబ్ధి చెలంగుఁ - దప్పకుండ
మఱియు నైశ్వర్యమును ముక్తి - పరఁగు నిజము. 69

గీ. ఇది పరమదుర్లభం బయి-యెనయు క్షేత్ర, మహిమవర్ణన, మిద్దాని-మహితభక్తి
వినినఁ,జేదివిన, దేవతా-వినుత మయిన, శంభులోకసంప్రాప్తి గాం-చెంగఁగల్గు.

శా. ఓ కాంతామణి! శ్రీమహాగిరి కపూర్వోదారదేశంబునం
దాకల్పప్రభ నొప్పు క్షేత్రము లిఁకక్ హార్వొందెడిక్, వాని య
స్తోకశ్రీకతఁ గొంత తెల్పెద, మహాశుంభత్ప్రకారాఘముల్
చీఁకాకై పరుగెత్తు వేగ నల నుక్షేత్రప్రభావంబునక్. 71

## దేవ ద్రోణీ తీర్థము.

మ. నిఖిలాజాండకటాహవర్తిసురమానిత్రాత గంధర్వబృం
ద ఖగానీక ఫణీంద్రవారనతమై, తానంబు లాడంగనై
న ఖలగ్రామణికేని ముక్తివనితం దార్చుక్ సమస్తోరుపా
పఖరత్వాపహమంత్రరాజ మయి, దేవద్రోణికాతీర్థముక్. 72

చ. ఒక పరి నెప్పుడేని నల యుత్తమతీర్థము నాడు మానవుం
డకలుషశంభులోకపద మందెడి, నాశ్వికవాజపేయనా
మకమఖకోటిసామ్యఫలమాన్యత నొందెడి, సర్వతీర్థరా
జకకనుకృతంబు నల్ల ఘనసన్మహిమంపు లవంబుఁ బోలునే?? 73

శా. దేవద్రోణికి సాటి రైయె తనరు సత్తీర్థంబు తా నెందు లే ;
దే వాఁ డందునఁ దాన మాడి యభవున్ హృద్యప్రకారంబుగా
సేవించుం, దగ వానికిన్ శివపదశ్రీస్థాన మేఁపొందు, వాఁ
డే వేళం జననంబుఁ గల్పములకే నేదేని గాంవేం డిలన్. 74

ఉ. దేవతలేని దాని సుగతి స్తుతియింపఁగ శక్తులొక్కొఁ? నా
నావిమలప్రకారకకనన్మహిమం బగు నీసుతీర్థస
ద్భావ మెసంగ వాకొనెడివారు, పరించెడి వా, ల్లిఖించు వా
రే విషమత్వ మొప్పని యహీనవిముక్తిపదంబు గాం త్రొగిన్. 75

క. దేవద్రోణీతీర్థము, దేవశ్రేణీనత మయి - దీపించుటచే
నా విఖ్యాతిని జెందెను, భూవలయంబందు నతుల-పుణ్యప్రదమై. 76

శా. శ్రీకృష్ణాశ్రుతజాప్రమధ్యధరణిన్, శ్రీశైలపుం బస్మటన్,
ప్రాకట్యం బగు జోగుళాస్థలమునన్, నాదావతీ వేదలున్
శ్రీకృచ్ఛోభ నెసంగు చోఁ, దగు పురిం జెన్నారు బ్రహ్మేశ్వర
శ్రీకల్యాణగృహంబునం దగు ఘుసశ్రేణిన్ సదా ప్రొక్కెదన్. 77

క. ఇది స్కందపురాణంబునఁ, బొదలెడి శ్రీగిర్యపూర్వ-పుంద్వారపు మే
లొదవు కతన్ రెండవదై, పొదలున్ బాల్ తీర్థనుతిగఁ-బొరి సురభావన్.

క. అని గిరిజకు శంకరుఁ డను, ననువున సూతుఁ డన, శౌన-కాదిమహర్షుల్
ఘుసు లాతనితో నీ కుం, భిని మహిమన్ వినెడి కోర్కె-వేఁ దెల్పి రటన్.

## ఆశ్వాశాంతపద్యములు

ఉ. ఓ జననాధికారణము ! లుర్విని నాకును గోరఁదగ్గ వే
వే జతనంబు గావు ; పరమేశ్వరు ప్రీతిగఁగొన్ని గ్రంథముల్

భ్రూజితరాఘవేశ్వరకృపన్ బొడఁగాంచిన కైత సొంపుచే
నోజను వ్రాయువాఁడ; దయ నొయ్యఁ గనుం, డిదె మీకు మ్రొక్కెదన్.

చ. మీ పదయుగ్మ మాన, నిజ మే విచయించెదఁ; గష్టకోటి తం
డోపరి తండమై, శ్రమమహోదధి మున్కలఁ గొల్పుచుండె; న
న్నోఁపిన పేర్మిఁ గాంచె రెవ రుర్విని; నింక మనంగ నాకు నే
దే పని కాన రా; దిది యొకింత ప్రయత్నము ముక్తికోసమై. 81

శా. శ్రీరాముండు మదిష్టదైవతము, లక్ష్మీ వేంకటేశుండు క
ల్యారంభాంతకుఁ డిట్టి వేల్పు, గిరిజాబ్రహ్మేశ్వరుం డీ కథా
ధారుం డెంతయుఁ గుంగు నా దయిన హృత్కంజాతముం జేర్మి వి
స్తారానందము నొందఁ జేసి, నను గాంచెం జేయుతన్ మోక్షమున్. 82

గద్యము.

ఇది శ్రీతుంగభద్రానదీతీర విరాజమాన కందనవోల్నగరమందిరుండును, శ్రీమ
ద్వేంకటేశ్వర కరుణాకటాక్ష వీక్షణానందిత హృదయారవిం దార్య వైశ్య
రత్న దోమా న్వయ పయః పారావార రాకానుధాకర-గోవిందార్య
తత్సహధర్మచారిణీ కోటాంబికామణీ నందనాగ్రజుండును, శ్రీ
రామచంద్ర పాదారవింద మరందపానేందిందిరాయమాన
మానసుండును, సరసకవితా రచనాభిప్రాయుండును,
సకలసుధీజన విధేయుండును, నానా దేశ బుధానీక
ప్రదత్త శ్రీమదాంధ్ర విద్యావాచస్పతి, సాహిత్య
సరస్వతీ, విద్యావినోద, కవిభూషణాది
బిరుదాధృతుండును, నగు వేంకట
స్వామిగుప్తచే రచింపఁబడిన
శ్రీమద్బ్రహ్మేశ్వరపురా
ణంబునందుఁ బ్రథమా
శ్వాసంబు సంపూర్ణము.

శ్రీరామచంద్రాయనమః

శ్రీజోగులాంబా బ్రహ్మేశ్వరాభ్యాన్నమః

# శ్రీ బ్రహ్మేశ్వర పురాణము.

---

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీజోగుళాంబికాకృత, రాజోపచరణవిధాన - రంజితమతివి
భ్రాజీశభక్తులారా !, యో జననీజనకులార ! యుయమతులారా ! 1

వ. అవధరింపుఁ డనంతర కథాక్రమంబు, 2

## భూదేవిచరిత్రము (అనఁగా రేణుకాదేవి కథ).

మ. అపుడా సూతుఁడు, ధీసమేతుఁ, డతివిఖ్యాతుండు, పూతుండు ని
ష్కృపు మేల్పేర్మిని శౌనకాదులకు వక్కాణించెఁ, గైలాసమం
దపవర్గాధిపుఁ డైన శంకరుఁడు లోకాంబన్ శివం గాంచి, "యో
చపలాక్షీ ! వినుమా ! యటంచుఁ దెలిపెన్ క్ష్మాదేవి మాహాత్మ్యమున్. 3

చ. అమలమునీశ్వరుండు జమదగ్ని సతీమణి రేణుకాఖ్య, ని
త్యముఁ బతిపాదసేవన విధానమునం దనరారు యోగ్యరా,
లమితశుచివ్రతంబున నిజాధిపు సేవల నాచరించు శ్ర
ద్ధమెయిమహా మహాత్త్వమునఁ, దన్ను జగం బఖిలంబు నెన్నఁగన్. 4

ఉ. ఆమె కనేకపుత్త్రి వెసలారి, రటన్ శరచాపకోవిద
గ్రామణి, ధీరుఁ డౌ పరశురాముఁడు కట్టకడం జనించె ; న
క్కామిని వారితో ముద మఖండము గాఁ దనరారుచున్, సతం
బాముని వర్యుఁ డైన పతి కాచరణం బొనరించు సేవలన్. 5

ఉ. ఆమె సతంబుఁ బ్రొద్దుటనె యాపగకుం జని, స్వీయమహా మహా
త్మ్యామలరీతిఁ జేసి, సికతామయకుంభ మొకండుఁ జేల్చి, నీ
రా మెయి నందుఁ గైకొని, గృహంబునకుం జనుదెంచు, నల్ల ప్రో
ద్దామమహాత్త్వ మెల్లెడలఁ దజ్జ్ఞులు సన్నుతులం బొనర్పఁగన్. 6

శా. ఆ కాంతామణి యొక్క నాఁ, డుదయ, మత్యంతంబు శ్రద్ధాగతిన్
వీఁకన్ వాహిని కేఁగి, క్రుంకులిడియున్ నీరంబుఁ దేరంగ వే
వే కుంభం బిసుకం ఘటింపుచుఁ, దటోర్వీసుందరశ్రీదిదృ
క్షాకౌతూహల మూని, యట్టునిటు గాంచెంగాఁ గడున్ వింతగన్. 7

## నృపదర్శనము

మ. మృగయాలాలసమానసంబున సతీమిత్రాప్త సర్వాంగసై
న్యగణంబుల్ తనుఁ జేరి కొల్వ, నల కాంతారప్రదేశంబునం
దగుపట్టెన్ రవివంశమండనుఁడు, ప్రోద్యద్రత్నభూషావళీ
యుగనూనానామల సుందరాంగుఁ డగు సుద్యుమ్నుండు తత్కాఁతమున్.

ఉ. ఆ యమలాంగి యా నృపుని, నాతనివైభవ, మల్ల వాని య
త్యాయతసైన్య, మాతని నవాంబురుహాంబకలం గనంగ, నెం
తో యెదయందు నద్భుతము నొందియుఁ, దన్నృపరూపవైభవ
శ్రీయుతరీతిఁ జూచియుఁ బొరిం గనె నంగజబాణవేదనన్. 9

వ. అపు డా పడతి యెడందం దలంచి. 10

సీ. తళ్తళత్తళకాంతు - లొలయు నాయుధములం
జెలిపించు చతురంగసైన్యములును,
లవమానపవమాన జవమానయుగనూన
యానమానిత తురంగాకరములు,
నేల కేతెంచిన నీలాంబుదాళి నాఁ
బొలెడి మత్తశుండాలములును

శంపాలతాపాళి యింపు దింపు నిలింప
సతులట్టి శుద్ధాంత సతుల గమియుఁ

గీ. గల్గు వైభవంబును గల్గి, - కాలకంఠ
కంఠభయదహుంకారంబు - గాంచేనట్టి
కంతు రూపొందు నీ ధరా-కాంతుఁ గాంతుఁ
గాఁగఁ గల కాంతయే భాగ్య - గణ్యురాలు. 11

## రేణుకా మనశ్చాంచల్యఫలము.

మ. అని చెల్లాచెద రైన డెందమున న య్యంభోజపత్త్రాక్షి తా
దినముం దెచ్చెడి భంగిఁ గుంభ మినుకం దీర్పం బ్రయత్నింప, నె
మ్మనపుం దార్ఢ్యము లేమి, నయ్యినుకఁ గుంభంబు బొనర్పంగ రా
మిని నాలస్య మెసంగె, నామె మతి తాల్మిన్ వీఁడి యల్లాడఁగన్. 12

సీ. అక్కటా! దినదినం బనువుగా నినుకతో
గుంభంబుఁ జేయఁగాఁ గుమరుచుండె ;
నీ దినం బేటికో యింతగా యత్నించి
కూడఁ గుంభము సేయఁ గుదుర దయ్యె ;
నిత్యమై మిత్తికనియమకృత్యంబు లీ
నాదు నాలస్యాన నలుపు చెడవె ?
చండశాసనుఁడు నాథుండు నా యీ కడఁ
కావరంబున కెంత గనలునొక్కొ ?

గీ. జీవితేశ్వరద్రోహంబుఁ - జేసినానొ?
తలఁపు లేవి పాపంబుగాఁ - దలఁచినానొ ?
కుండ యినుకతోఁ జేలుపంగఁ - గుదరదయ్యె''
నంచు నామె పశ్చాత్తాప - మాత్మ నంది. 13

గీ. స్నాన మొనరించి, శుచి యయి, - సైకతమునఁ
గుంభమును జేయ నయ్యది - కుదురు టయ్యె
అంత నది ముంచికొని యామె - యరిగె నిక్క,
కట మునియు సాగ్రహోదగ్రుఁ - డగుచు నుండె. 14

గీ. ఉండి, యామె యే తేరఁగా - నోవరు లోన
మాని యామె యాలస్యంపు - మాట కయిన
కారణము యోగదృష్టిమైఁ - గాంచి, యామె
వచ్చినంత, నత్యంతకో-పంబుతోడ. 15

గీ. చండమార్తాండు పగిదిని - మండి పడియు
"ఏమి ? భాగ్యశాలిని! యాల-సించినావు ?
కారణముఁ జెప్పు" మనఁ, గడ - గడ వడఁకుచుఁ
గాంత కాంతుఁ గాంచియు భయ-భ్రాంతిఁ బలికె.· 16

గీ. "ప్రాణపతి ! మీ కడనుఁ బొంకు - పనికి రాదు;
స్త్రీ సహజచంచలతఁ జేసి - చిత్త మేటి
కడను గాంచిన భూపాలుఁ - గనుగొనంగఁ
జెదరెఁ, గుండ సేయఁగ నాల-సింపు గల్గె. 17

గీ. మూర్ఖురాల, నో మునినాథ ! - ప్రోవ వలయు
తప్పుఁ జేసితి ; క్షమియించు - ధన్యచరిత !
సరస కారుణ్యసాగర ! శాంతమూర్తి !
యీవు కోపింప నా కింక - నేది దిక్కు ? ?" 18

గీ. అంచు దీనాతిదీనత - నా నెలంత
తపసి పాదారవిందంబు-లఁ బయిఁ దలను
నుంచి వేఁడ, న వ్వేడికో - లుజ్జ్వలదన
లోపమార్చి కోపముఁ బెంచె - నొగి స్ఫురిత మయి. 19

## జమదగ్ని తపశ్శక్తి నిరూపణము.

గీ. కడఁగి జమదగ్ని కాగ్రహా - గ్రహ మటులను
సోఁకి యాతఁ డస్తోకభ - యాకరముగ
నార్చి "మూర్ఖురాలా! నాదు - నంతికమునఁ
గలుగు సంపద నీ కింత - తెలియ దొక్కొ??" 20

గీ. అని యొక యపప్రమాణ మా - నంత పయిఁడి
గొనియు నామెచే నిడియు, "నో - సుందరదన!
యీవు కాంచిన నృపు కడ - కేఁగి యీ య
వపరిమాణసువర్ణంబు - భరము గాఁగ. 21

గీ. పుత్తడిం దెమ్ము! పో!" మ్మని - పుచ్చె; నంత
నల్లమునికాంత యల్లరా-జాంతికంబుఁ
జేరి నంత సమర్హసు-శ్రీకరముగ
రాజవర్యుఁ డామెకును గౌ-రవము సల్పి. 22

ఉ. "తల్లిరో! నీవు వచ్చిన కతమ్మను దెల్పెద వేని, నేను నీ
యుల్లపుఁ గోర్కెఁ దీర్తు" నని యుర్వివరుండు వచించినంత, న
ప్పల్లవపాణి చేఁ గల సువర్ణము తన్నరనేత కిచ్చి, యో
సల్లలితస్వభావ! యల స్వర్ణము పాటి సువర్ణ మీయవే?? 23

మ. ఇది నా నాథుని యాజ్ఞ, యంతె యగు నా యిష్టంబు; నీ వద్ది యి
చ్చెదవేనిన్ భవదీయ మై తసరు నుర్శ్రీ నెల్ల నా కిచ్చిన
ట్లెద సంతోషము నంది వెళ్లెదను; భూమీశాన!" యం చామె ప
ల్కఁ, దదుక్తుల్ విని, యుత్తరంబిడె ధరాకాంతుండు తత్కాంతకున్. 24

శా. "అమ్మా! బాగుగ నాన తిచ్చితి, 'వెదే నాలింపఁగాఁ జేయు మి
ష్ట, మ్మే నిత్తు' ననంగ, నీవు కరిణీసార్థంబొ? యశ్వప్రతా

నమ్మో? స్యందనబృందమో? పురములో? నవ్యాంబుజాక్షీని కా
యమ్మో? కాక, యవప్రమాణతపనీయం బడ్డఁగాఁ బాడియే?? 25

ఉ. నాదు యశంబు నిత్యమయి నల్వు చెలంగఁగ, మీకు నెంతయున్
బ్రోదిగఁ బుత్రపౌత్రతరముల్ సుక మొప్పఁగ, నొప్పునట్టి ను
శ్రీఁ దగు కోర్కె నీరలు వచింపఁ దగున్; మఱి నే నిడం దగున్
బాదుగ; నెట్టి పాటి గనఁ బర్వని కోర్కెని గోరఁ నేఁటికిన్?? 26

ఉ. నా దగు మాన్యతాగతికి నల్వగు కోర్కెని గోరుకొమ్మ! కో
మ్మా దయమానమానస ముదారము గాఁ దగఁ దీర్చు వాఁడ; న
శ్వాది గజాది భర్మవసనాది గృహాది మణీగణాది గా
నే దగు కోర్కెయేని వచియింపు, మొసంగెద నిచ్చ మెచ్చఁగన్." 27

చ. అనియు వచించినంత, నల యబ్జదళాక్షి ధరాధినేతతో
ననె; ''మనుజేంద్ర! నే నడిగినట్టి సువర్ణభరంబు గాక, దే
నిని మఱిఁ గోరఁ జాల, నది నీకును సమ్మతియే నొసంగు, తే
దను మఱు గానిచో'' ననిన, నందుకు భూపతి సమ్మతించియున్. 28

## యవసువర్ణతులాభారము.

చ. ఒక తులఁ దేఱఁ జేసి, యట నొక్కఁడు ప్రక్కను దద్యవప్రమా
ణక మగు భర్మ ముంచియు, మ ఱొక్కఁడు ప్రక్కను గొంత పైఁడి నుం
చి కనుఁగొనంగ, మానితపనీయమె క్రిందకు వ్రాలె; నంత రా
జిఁక నొక యంత బంగరముఁ జెచ్చెరఁ జేరఁగఁ జేసి యుంపఁగన్. 29

చ. అదియును దగ్గె, నల్ల మనుజాధిపుఁ డంతట జాతరూప మిం
కఁ దులను నుంప, నద్దియు నొకంతగఁ దగ్గె, నిఁ కింత బంగ రం
దదుకఁగ, నద్దియుం గొఱఁత నందె; మఱా నృపుఁ డాత్మసన్నిధిం
బొదలెడి సొమ్ము లేమి? మణిపుంజము లేమి? తులం దెమల్చియున్. 30

ఉ. తూఁచిన,నల్ల మానియవ తూనిక వైఁడియె వ్రాలుచుండె; దో
బూచిని దీని గాంచి, యల భూపతి నివ్వెఱఁ గంది, యాసతిన్
జూచియు, "నమ్మ! నా కడను జొప్పడు సొమ్ముల నెల్ల నుంచియున్
నీ చినగింజే తూనికను నెక్కొనదయ్యెను; జూచితే కదా?? 31

మ. అనఘుం డా జమదగ్ని నీ పతి, సుదీవ్యద్యోగమాహాత్మ్య స
ద్ఘనుఁ; డాతం డిడు నీసువర్ణకణికన్ దత్ప్రాభవం బెంతయున్
దనరారుం; గనుకన్, ననుం బలె నిలం దైవారు వా రెన్ని యి
చ్చిన, నిద్దానికి సాటి రాఁ గలవె వాసిన్? మానికాంతామణీ!! 32

చ. అతులతపఃప్రభావుఁ డగు నా జమదగ్ని మహర్షి యేడ? దు
ర్మతి నగు నొక్క భూరమణమాత్రుఁడ నే నిది యేడ? యో ప్రభా
వతి! జనయిత్రి! నా యెడఁ గృపారతంత్రహృదంతరాఢ్య వై
నతులను నావి గైకొని, చేనం గద యమ్మరో! నీదు నిక్కమున్". 33

చ. అని వచియింప, రేణుక హృదబ్జమునం గడుఁ దేట తెల్లమై
తనర మహామహుం డయిన తాపసనాథుఁడు భర్త యొక్క స
ద్ఘనతనుఁ గొంతదాఁ కెఱిఁగి, తా నొనరించిన యొగ్గు నెంచి, "యా
ముని యెటు కోపగించునొకొ పో!" యని చాలఁగ భీతి నందుచున్. 34

ఉ. ఆ యెడనుండియుం దిరిగి యాశ్రమభూమికి నేఁగు చెల్ల ప
ద్మాయతనేత్ర స్వప్నమునయందు మృగేంద్రునిఁ గన్న లేఁడియ
ట్లే యెదయందు భీఁ గొని, యటే తనువల్లిక యల్లలాడఁగా
నే యటు లా మునీంద్రుకడ కే తటికేనియువచ్చె వచ్చియున్. 35

ఉ. ఆతని సన్నిధానమున నాతతభీతివినీతమూర్తి యై
భీతకురంగనేత్ర యయి, పెం పగు కంపముఁ జేసి యెంతయుం
జేతము క్రుంగి నిల్వఁగ, విశేషరుషాతికషాయితాత్ముఁ డై
యా తరుణీమణిం గనియు, నా జమదగ్ని వచించె నిమ్మెయిన్. 36

## రేణుకా శిక్ష.

ఉ. "ఓ యమలాంగిరో! చేసితివో జనపాలుని చెంత? కడ్గినా
వా యతనిన్ యవాయతనువర్ణ? మతం డిడెనా? యతేనిఁ దె
మ్మా! యెది? చూత"మం చేనుడు, నా సతి గద్గదికావరుద్ధవా
గాయత రై "పసిండి యవ యంత నృపుం డిడ లే; దధీశ్వరా!!" 37

చ. అని పలుకన్ మహాముని రుషానలకీలలఁ గ్రాఁగుచేన్న నె
మ్మనమునఁ గామినిం గని, యమాంతము మ్రింగెడు వాఁడ పోలె, "నో
వనితరో! యిన్ని నాళ్లుగను భార్యవు నాకయి యుండి కూడ, నా
ఘనత నెఱుంగ లేక యిటు కాని పనిం బొనరించినావు గా?? 38

ఉ. సారసనాళసన్నిధిని జొలఁగ వేల కొలంది యేండ్లు పెం
పారిన కప్ప యల్ల జలజాతసుగంధ మెఱుంగఁ జోల; దా
తీఱున నా కడం దనరి, తేఁకువ నా దగు తీఱు నింత యే
నారయ లేని దాన వయినా విదె, నీ బ్రతు కేల? కాల్పనే??" 39

మ. అనియుం, బెద్ద కుమారుఁ బిల్చియుఁ, "గుమారా! యొక్క దుష్కార్యముం
బొనరించెన్ భవదీయ మాత, కనుకన్ బొ మ్మిమ్మ సతిం గొం, చేటం
జేని ఖండింపుము దీని మస్తక" మనన్, దత్పుత్రకుం "డక్కటా!"
యని మూర్ఛిల్లియుఁ, దెప్పిఱిల్లి యవులన్ "హా! చేయ లే నే"ననెన్. 40

ఉ. ఆ నుడి యాలకించి జమదగ్ని ద్వితీయకుమారుఁ బిల్చి, య
వ్వానికి నల్ల యాజ్ఞ నిడె; వాఁడును "గా"దనినన్ ద్వితీయుఁ డా
వానిని రాఁగ జేసి, యల వానికి న మ్మదలన్ వచించినన్
బూనఁగ లేదు వాఁ; డటులఁ బుత్రుల నాతఁడు పిల్చి యాదటన్. 41

చ. తెలుపఁగ సాఁగె నాజ్ఞ ; నల తీఱును నొక్కొకఁ డాలకించి, నేఁ
జేలుపఁగ లే నఁటంచుఁ జేనసాఁగిన, దానికి నల్ల మౌని క

ట్టిలుకను జెంది, తుట్టతుది యాత్మజు రాముని బిల్చి, 'తల్లి దౌ
తలయును భ్రాతృశీర్ష ముల ధాత్రికిఁ ద్రెళ్లఁగఁ జేయుమా'! యనన్. 42

చ. రహి నలమాట కా పరశురాముఁడు భీకరమా పరశ్వధం
బు హావణిలం గరంబునను బూని, కరుక్కునఁ దల్లికంఠముఁ
మహిఁ బడఁ జేసి, సోదరుల మస్తము లట్టులె సల్పె ; దాన, మా
ని హృదిని సంతసించియుఁ, గవిష్ఠకుమారుని జీరి, యిట్లనున్. 43

## పరశురామ వరప్రదానము.

ఉ. రామ! కుమారరత్నమ! కరం బగు బత్తిని నాదు నాజ్ఞ నీ
వీ మెయిఁ జేల్పినందులకు నెంతయు సంతస మయ్యెఁ; గోరుమా!
యే మయినన్ వరం; బనఁగ, నిద్ధతరం బగు బత్తితోడఁ ద
ద్ధీమహితుండు తండ్రికి నతిం బొనరించియుఁ బల్కె ని మ్మెయిన్. 44

క. "జనకా! ఘనకారుణ్యం, బున నాకున్ వరముగ, నిదె - పొలియించిన నా
జననీభ్రాతల ప్రాణముల, లనొసంగుము, వలదు మఱొక-లా గెది నాకున్. 45

వ. అనవుడు. 46

ఉ. అందుల కోంకృతిన్ మునిమహామహుఁ డాచరణంబుఁ జేల్చి, య
స్పందకృపాతిరేకమున బాలుని గాంచి, కమండలూదకం
బుం దగఁ దచ్ఛరీరములఁ బొల్పుగఁ జెల్లు మనంగ, నంత, న
న్నందనుఁ డాతఁ డట్టులఁ బొనర్పఁగఁ దేఁటిరి పుత్రు లందఱున్. 47

## ఎల్లమ్మదేవత.

గీ. కాని, రేణుకాదేవికిఁ - గల్గ లేదు
ప్రాణ! "మల్ల కతము గాన - రా" దఁటంచుఁ
బరశురాముండు తండ్రితోఁ - బల్కె నతఁడు
తనయుఁ గని రేణుకనుగూర్చి - యనియె నిటుల. 48

ఉ. "తావక మా మహాపరశుధారల సోదరమాతృ శీర్షముల్
రీవిఁ గరుక్కునం దెగి పడిం బడెఁ ద్రుళ్లియు నేల దూరమై ;
యా విధి మాతృమస్త మొక యంత్యజవాటిని బడ్డ దాటుచే
నీవు కమండలూదకము నెక్కొలుపం బ్రదు కొంద దావెయున్. 49

వ. అయినను. 50

చ. హరియనుకంపచేత నల యంగనమస్తక మంత్యజాళి వా
టి రహిని జొల మాన్యతఁ గడించెడి, నద్ది దేవతాఽఽ
కరముల కింపునింపు, మఱిఁ గల్గఁగఁ జేయు ముదంబు నాకు, మే
ల్పరఁగఁ బడెన్మి దా కులములం గొను నర్చన "ఎల్ల" మాఖ్యతోన్. 51

చ. కొలిచిన వారి వై పరఁగు కోర్కెల నెల్ల నొసంగఁ బొల్చి, వా
రలకును బుత్త్రిపౌత్త్రిక కళత్రధనాదివిభూతిబృంద మిం
పలరుపఁ జేయుచుండు భవదంబ శిరం బని నా వరంబు పెం
పొలసెడి; సందియంబు వల దోయి! కుమారక! యింతుకున్ మదిన్!!" 52

## భూ దే వి.

చ. రహి నటు దండ్రి వల్కఁగఁ బరశ్వధరాముఁడు నాలకించి, భ
క్తి హృది నెసంగఁ దండ్రికినతిం బొనరించి, "మహాత్మ! తల్లి దా
చు హరువు గన్న శీర్ష మెటు శోభను భూస్థలి మించునో? కరం
బు హవణిలన్ వచించితిరి; పొల్పుగ మొండెము రీతి యెట్టులో?? 53

చ. తెలుపఁ గదే" యనం, గరుణ దీప్తివహింప మునీశ్వరుం డొగిం
బలికెను "వత్స! మొండె మిది *భాస్కరసుస్థలజాలమందునం
గొలిచియు భూమిదేవి" యనఁ, బోల నుతాప్తికిఁ బూజ లొందె, మ
క్ష్మలనవనీతలేహననుమానవపాళి కొసంగుఁ బుత్త్రిలన్. 54

*భాస్కరక్షేత్రలక్షణము కథాప్రారంభాత్పూర్వము చెప్పఁబడినది.

చ. ఇటు జమదగ్ని పుత్రులకు నిచ్చెఁ జెలంగు వరా లొసంగె న
ప్పటు, నది యాది న త్తనువు భాస్కరభూముల భూమిదేవి నాఁ
బటుగతిఁబొల్చుచేండు, నల భార్గవరాము యశంబు సర్వది
క్తటముల నద్దిదొట్టి యనుదారెడి దేవమునీంద్రవంద్యమై. 55

శా. భూదేవీ మహనీయత త్త్వ మిది, శంభుస్వామి శైలేంద్రపు
త్రీదేవీమణితోఁ దొలిం బలికె, నిద్దీనిన్ వినం బొల్చు వా
ర్రాపిదుర్భూతనిభూతి, మోక్షపద, పుత్త్రి, శ్రీ, యశః, పుణ్య, భూ
మ్యాదిస్ఫారమహాసుభావముల వే నందంబుగాఁ గాం త్రొగిన్. 56

మ. అని భూదుర్లభ మా రహస్య మిది కంజారాతికోటీరుఁ డ
త్యనుకంపామతి శైలపుత్రికిని ము న్నాలింపఁ గావించి ప
ట్లును నూతుం, డతిధీసమేతుఁడు, సుధీలోకాతిపూతుఁడు తె
ల్పె నొగిన్ శౌనకముఖ్యమానితతి కర్థిన్ నైమిశాఖ్యాటవిన్. 57

ఉ. గౌరిరొ ! కాశియందు మృతి గాంచుటయున్, గురుభూమి దానముల్
సారసబాంధవగ్రహణసత్సమయంబునఁ జేయు, టంక గే
దారమునందు నీరము ద్రావుట, శ్రీగిరిశృంగదర్శనో
దారమహంబు, లింగనవకాలయవాసము దుర్లభం బగున్. 58

వ. అని, 59

క. స్కందపురాణంబున గిరి, నందిని కభవుం డను శివ-నగపశ్చిమది
క్సుందరపదత త్త్వకథల్; పొందున్ బాల్ము డవదిది-"భూమినుకథ"గన్

వ. అంత, 61

మ. అపు డాసూతుఁడు శౌనకాదులకు, "నయ్యా! యాలకింపుఁడు ! ని
ద్దపుఁ బెంపందెడి పాపనాశననుతీర్థశ్రీమహ త్త్వంబు పా
పపు రూపంతయు మాఁపుఁ, బాతకములన్ భంగంబు నొందించు, మో
క్షపుఁ బొందుం గలిగించు, నొక్కట నటన్ స్నానంబు గావించినన్. 62

## పాపనాశనతీర్థమాహాత్మ్యకథనము.

చ. అనుడును సూతుఁ గాంచి ముని లాఁడిరి; "సూత! గుణప్రపూత! యే
యనుపమపుణ్యముం దెలిపి, యాదట మానవపాళి పుత్రల
బ్ధిని గనఁ జెల్లుఁ? దెల్పు," మన, ధీయుతుఁ డాతఁడు సూతుఁ డెంతయున్
మనమునయందు నందము నమందముగాఁ గని వారి కి ట్లనున్. 63

మ. మునులారా! ఘనులార! మీ రడుగు సత్పుత్ర్యాప్రకారంబు చె
లను భాగైనది, యొక్క వర్షము జనుల్ భాగీరథీసేవఁ జే
ల్చిన బల్ పుణ్యము పాపనాశమును దర్శింపంగ నై నంతమా
త్రన లాభించును, గానఁ, దద్ఘనమహత్త్వం బౌనె వర్ణింపఁగన్?? 64

ఉత్పలమాలిక.

నాలుగు వర్షముల్ తపము నర్మద యొడ్డునఁ జేసినట్టి యు
ద్వేలఫలంబు, తుంగనది తీరమునందలి తీర్థమందుఁ బెం
పౌ లలి నొక్కటం జలకమాఁడు నెడం దగు; నూర్జలో సుషః
కాలము తుంగభద్ర మెలుఁగారెడు పాపవినాశమందునన్
మేలుగఁ దాన మాఁడు నెడ, నిర్మలతం గడియించియు, స్వరుం
డోలిని గోటి యూ తరము లొయ్యఁ గులంబు సముద్ధరించి, వై
వాఉలఘులోకమందును సురాధిపముఖ్యనుతప్రకారుఁ డై. 65

శాదూలము—పంచపాది.

ముల్లోకంబులు నేని పాదజలజంబు ల్గొల్చు సద్భక్తి సం
పల్లాలిత్యముతోడఁ, దద్భవుని సంభావించు నాతండు శ్రీ
సల్లీలాకము, శంభులోకమును గాంచేం జేలి, వై వాతిమా
యోల్లాసంబుల కంద రాక, శివుతో నొప్పొందియున్, ముక్తియో
షిల్లీలానువినోదపాత్రుఁ డయి, వాసిం దెల్వి నిం గాంచెడిన్. 66

సీ. కలియుగంబునయందుఁ గాంచేఁగా నరులకు-మంచి సంతతి జనియించు టరుదు,
సంతులేని మనుజుఁ డెంతయు నిహపర-సౌఖ్యదూరుం డయి శ్రమలఁ జెందు,

వాఁడు వ్యర్థుఁడాడు, వాని వంశంబు నశియించు, పితృదేవమునిఋణయు
తుఁడు వాఁడు,
కొమరు మోమును గనుఁగొన్న, వానికిఁ బయియూఁడు ఋణములు పోలియు
నిజము,

గీ. పుణ్యులకు మంచి సంతతి పొసఁగు ధరను,
పాపకర్ములో, పరద్రవ్యవారకు లగు
వారు భార్యాసుతవ్రాతదూరు లగుచు
నిరతదుఃఖంబు గాంతురు ధరణియందు. 67

## శీలవతీ చరిత్రము.

మ. ఇపుఁ డింపొక్క యుదాహృతిం బలుకఁగా నేర్పారఁ, గంజారివం
శపు రాజేంద్రుఁడు తొల్లి నేలె ధరణిన్ "భద్రాశ్వుఁ"డన్ వాఁడు; త
చ్చపలాక్షీమణి, యోగ్య, శీలవతి, కాంతప్రీతిసంయుక్త, బా
గ్యపుఁ గాణాచి, పతివ్రతామణి, జితానంగాంగనారూపయున్. 68

చ. అయినను దొంటిపుట్టువునయందలి కర్మఫలంబు గాఁగ, నొం
డయిన నపత్యముం గనక, యామె యదే మదిఁ జింత గాఁగ, నెం
తయుఁ గడు వంది కుందుచుఁ, 'దనన్ గర మట్టి వసంట సేర నె
ద్దియొ కత' యంచు లోఁ దలఁచి, తేఁటగ సద్ది యొకింగఁ గోరియున్. 69

మ. చేనియున్ శీలవతీసతీమణి, నమస్కారంబు గావించె, నె
మ్మనమం దొప్పిన భక్తి చొప్పడఁ, దపోమాద్యన్మహీజానికిన్,
ఘనసుజ్ఞానికి, వారితాఖిలభవాఘగ్లానికిన్, శంభుస
న్మననానూనతపావధానికిని, దన్మైత్రేయసన్మానికిన్. 70

ఉ. ఆయమ వచ్చి, జోత నిడినంత, మునీంద్రుని యంత యామె న
త్యాయతమైన వేర్మి దనరారఁగఁ గాంచియు, 'నేమి కారణం

బో! యట వచ్చినందు?' కని యొయ్యన నుత్తము మొనర్చి, మానస
ణ్ణాయకుతోడ ని ట్లనియె, సాధ్వీమణి క్షని నామె యపుడున్.

మ. "మునిచూడామణి! మీ కృపారసమునన్ భూపుండు నా భర్త నే
నును సంతోషముగాఁ జెలంగెదము; సన్నుత్యప్రకారోరుధీ
తిని దైవాఁదు, మెల్ల దేశముల పృథ్వీనాథు లస్మచ్చమూ
ధనసంపద్విభవాతిరేకముల నత్యంతంబు నగ్గింపఁగన్. 72

వ. కాని, 73

ఉ. సంపద లెన్ని యేనియును జాల సెసంగనుగాక; భవ్యమై
వింపవరేణ్యమై భవము లీల చెలంగును గాక; సైన్యపా
రంపరి యుండుఁ గాకఁ; గడు రమ్యవిభూషలు వొల్చుఁ గాక; జీ
వింపున కింపు నింపు నె భువిన్ సతికిన్ సుతపాళి లేనిచోన్. 74

ఉ. దానము లెన్నొ సల్పితిమి; ధర్మము లెన్నియొ సల్పినాము; సు
జ్ఞానులకున్ సపర్యలను జేల్పితి మెంతయు శ్రద్ధతోడఁ, గా
నీ; సలు సంత బిడ్డఁడు జనింపఁగ లే; దకటా! యిదే కడున్
మానసకంజమందుఁ బలు మాఱులఁ గుందు హిమాద్రిఁ బోలెడున్. 75

ఉ. పాప మదేని తొల్లిటి భవంబున భూవరుఁ డాచరించెనో?
యీ పగిదిన్ సదా సుకృత మే పొనరించియుఁ గూడ, సంతునన్
లోపముఁ జెందెఁ బ్రాక్తనజనుర్వృజినంబు కతంబు దాని శే
దో? పలుకం గదే? మునికులోదధిచంద్రమ! నీకు మ్రొక్కెదన్. 76

## మైత్రేయమహాముని శీలవతికిఁ బాపనాశన తత్త్వంబుఁ జెప్పుట.

మ. అన, మైత్రేయుఁడు యోగదృష్టి విషయం బాలోచనం జేల్పి, యి
ట్లనె సమ్మానిని; "కమ్మరో! తొలి భవంబం దీ వనూయన్ సప
త్నిని దుర్మాటికఁ జంపి, దాని తనయున్ నిర్మాతృకుం జేసి; తా
ఘనపాపంబున నిష్ఠ వంధ్య వయితో కాంతామణీ! నీ విటున్. 77

ఉ. పాప మి రెండిపోవుటకుఁ, బాపవినాశనతీర్థమందు నీ
వోపిక భర్తతో జలక మున్నతభక్తిని జేల్పుదేనియుం,
బాపము లెల్లఁ బాసియును, బాపలు నీకును గల్గు వారు, ని
ష్పాపచరిత్రు లై, కరము వంశసముద్ధరణైకపాత్రులై." 78

చ. అని వచియింప, శీలవతి యా మునినాథునితో వచించె, "నో
మునివర! పాపనాశ"మని పొల్పగుతీర్థవరేణ్య మెందునం
దనరును? దెల్పు!" మన్న, నల తాపసపుంగవుఁ డామె కిట్లనున్
"వనజదళాక్షిరో! వినుము! పాపవినాశనతీర్థ తత్త్వమున్. 79

ఉ. శ్రీగిరి పశ్చిమాశను బోరిం దగు ద్వారము వారుణాలయం
బై గరిమన్ వహించు మహితావని యద్రి యలంపురాఖ్యతో
భోగిసురాసురేంద్రమునిముఖ్యనుతం బయిపొల్పు, నమ్మ! యా
శ్రీగిరిఁ బోలు తీర్థముఁ బోరిం గన సాధ్యమె యుజ్జగంబులన్ ?? 80

శా. శ్రీకల్యాణద, మాశ్రితావనము, గౌరీనాయకావాస, ము
ర్వీకైలాసము శ్రీధరాధరముతోఁ బెంపందు నం బోల, ము
ల్లోకంబందును దీర్థరాజ మెది పొల్చున్? దానికిం దీటదే;
యాక్రమస్థలమందుఁ దీర్థములు పొల్పారున్ ఘనప్రఖ్య మై 81

శా. ఆ తీర్థంబులు భూతకోటికి శరణ్యంబుల్, సమస్తాఘదు
ర్భీతిప్రాభవహారకంబు, లటులన్ వెల్గొందు తీర్థాళిలో
ఖ్యాతిం జెందియు, శ్రేష్ఠమై, తదపవర్గాంభోజపత్త్రేక్షణా
ప్రీతిం గూర్చును పాపనాశము జగజ్జేగీయమానంబుగన్. 82

ఉ. దంపతు లేకవస్త్రమును దాల్చి, మెయిం దిలకల్కమున్ శరీ
రంపు నలుంగు వెట్టికొని, బ్రహ్మశివాఽఽశ్రితపాళియాజ్ఞ దా
పెంపునఁ దానమాడి, విధి పేర్మిని దైవతతృప్తి సల్పి, నై
లింపసుతున్, హరున్ జలక లీలలఁ బూజలఁ జేల్పఁగా వలెన్. 83

గీ. ఆవేట లోకోపకారార్థ-మై సుమంగ,ళుల కెలమిని మంగళవస్తు-వుల నొసంగి,
పార్వతీదేవి దరిఁ జేరి, భక్తి మీఱ-వందన మ్మిడి, సల్పెఁ-బ్రార్థనంబు. 84

శా. "తల్లీ! యాశ్రితకల్పవల్లిరో! భవత్పాదాబ్జముల్ భక్తిసం
పల్లీలాగతి డెంద మొంద భజియింపం బూనితిన్, నా శ్రమల్
డుల్లంజేసియు, నాకుఁ బాపముల చేటుం బాఁపి, మే ల్పేర్మి రం
జిల్ల న్నాకును మంచి సంతతిఁ గటాక్షింపం గదే? శాంకరీ!!" 85

ఉ. అంచును బ్రార్థనం జేలిపి, యవ్వల, గోవును, భూమి, పైఁడి, నే,
యంచుల వస్త్రముల్, గుడము, నాదిగ దానము లొప్పఁ జేల్పు, లా
భించును సంతు; సంతోదవు పిమ్మట, నేయి, తిలల్, ప్రవాళముల్
కొంవేక యీ వలెన్ బయిఁడి, గుమ్మడికాయయు, భాండముం దగన్. 86

ఉ. బంగర మిన్ని చోటులను బల్కఁగఁబడ్డది, గొల్ల చోటులన్
బంగరు దాన మిచ్చునెడ బంగరుకొండయె చాలి రాదు; కా
నం గడు రాగిడబ్బు లిడినం గడుఁ గూర్చును బైఁడి దాన మీ
యం గని మెప్పు పున్నెమును, నందున బంగరు వొల్చియుంమటన్. 87

ఆ. వె. కంబలంబు నింకఁ - గార్పాసవస్త్రంబు,
మఱియు నొగిని ముద్గ - మాషచణక
ములను, బాపశాళి - మున దాన మిడు వేళ
ద్రోణపరిమితి నిడఁ - దొడరు ఫలము. 88

శా. వైనం చెల్పిన రీతి, శక్తికొలఁదిన్ బాపాంతకం బన్న తీ
ర్థానం దానము లాఁడు దంపతులు మె ల్సంతానముం గాంచెద,
ర్గాన, న్నీవును, నీ మనోహరుఁడు, నీ గాణం బొనర్పంగ, సం
తానంబుం గను వారు సర్వజగదంచత్పాత్రులన్ బుత్రులన్. 89

సీ. అనియుం మైత్రేయముని పల్కు-నాలకించి,
శీలవతి భక్తి భద్రాఖ్య-తో లలి నన,

నతఁడు భార్యతోఁ జేరి పా-పాంతకాఖ్య
తీర్థమునఁ దాన మాఁడె భ - క్తి తగ మదిని. 90

గీ. దేవుఁ బూజించి, పార్వతీ-దేవిఁ గొల్చి,
దానధర్మంబు లిడియు, సు-ద్దామసుకృత
ఘనులఁ, బుత్రులఁ గనె వంశ-కరుల, శూర
వరులఁ, గీర్తిభరుల, ధూత-పాపదరుల. 91

క. అని హరుఁ డద్రిసుమారిక, కను నను వన సూతుఁ డచేట-ననియు మునులతో
ననియె "నల పాపనాశన, ఘనతీర్థముఁ గొల్వ వలయుఁ-గా! మన!" మనుచున్.

క. ఈ పాపవినాశనతీ, ర్థాపార శ్రీకథ నొగి - నాలించిన వా,
ర్వేపరియించిన వా, రిఁక, నోఁపిక లిఖియించు వారు-నొందుదు రిచ్చల్. 93

ఉ. పాపవినాశనాఖ్యఘనపావన తీర్థకథానకంబు నే
రోఁపిక మైఁ బఠింత్రో? యిఁక నొప్పఁగ విందురో? సంస్మరింత్రో? వా
ర్పాపము లెల్లఁ బాసియుఁ, నభఁగురిభూతలసౌఖ్యజాలముల్
ప్రాపుగ నంది యాలఁ గొను వారలు ముక్తిచిరంటికామణిన్. 94

## అశ్వాసాంతపద్యములు.

సీ. చెలఁగి మీ కడుపున జ్యేష్ఠుండ నై పుట్టి,
జ్యేష్ఠాఽఽద్యతిని జాల నెనసినాఁడ;
అఁదందు గురుల పాదారవిందంబులఁ
గొలిచి, యించుక తెల్వి నొలసినాఁడ;
అవధానసత్కవిత్వానూనతం బూని
దేశదేశంబులఁ దిరిగినాఁడ;
రాజరాజులకన్న రహి మించు గౌరవ
భోగవైభవములఁ బొందినాఁడ;

గీ. కామినీసంగతిని గాయ - గాచె మేను;
తనయుఁడును బుట్టె; నిఁకఁ గోరఁ - దగిన దేది
పొనరఁ గొటుఁబవసతియుఁ - ముక్తిదప్పఁ?
దనర నివి యిం! డహో తల్లి-దండ్రులార!! 95

మ. పటిమన్ ముక్తిసతీమణీ శుభపదప్రాప్తిన్ వినీతాళికిన్
ఘటనం జేర్పెడి మేలి దైవము, సమగ్రశ్రీకరం, బుజ్జ్వల
న్నిటలాక్షానలదగ్ధమార, మగపుత్త్రీభాగ్యసందోహ, మె
క్కాటి, న న్నాయజశంభులింగ మొలమిం గాఁపాడఁ దీవింపుఁడీ!! 96

మాలిని. కలితనుగుణులారా! కంధిగంభీరులారా!
లలితకరుణులారా! శ్లాఘనీయాత్ములారా!
దళితమలినకంజా-తాక్షసద్భక్తులారా!
విలసితయశులారా! విస్ఫురన్మూర్తులారా!! 97

గద్యము.

ఇది శ్రీ . వేంకటస్వామి గుప్తచే విరచింపఁబడిన
శ్రీమద్బ్రహ్మేశ్వర పురాణంబునందు ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

---

శ్రీరామచంద్రాయనమః.

శ్రీజోగులాంబా బ్రహ్మేశ్వరాభ్యాన్నమః

# శ్రీ బ్రహ్మేశ్వర పురాణము.

---

## తృతీయాశ్వాసము.

క. శ్రీమజ్జోగులనామాం, బామానససనాథ బ్రహ్మ-భవభవహారప
త్తామరసాఽఽశ్రితులారా ! యో మాతరపితరులార ! - యురుగుణులారా !

వ. పేర్మితో వినుం ; డనంతరంబు సమస్తలోకవశంకరుండు, సర్వశుభంకరుండు శంకరుం డాశ్రితాభయకరి, పాలితకింకరి యగు శాంకరి కానతి యొసంగిన భంగిని భవాఽటవీకుఠారం బగు నైమిశకాంతారంబునందు నిఖిల పురాణ వ్యాఖ్యానవైఖరీసమేతుం డయిన సూతుండు శౌనకాదిమునిపుంగవసంఘం బున కి త్తెఱంగున నెఱింగించె. 2

### తీర్థసేవనపద్ధతులు.

### శనివారము - పాపనాశనతీర్థము

సీ. అకలంకులార ! కంజాక్షుండు కటకల-గ్నమున నుండఁగఁ గొల్వఁగ నగు వార
తీర్థంబులను గూర్చి తెల్పెద; వినుఁ డయ్య! మునులార! మీరలు పూన్కి మీఱ
శనివాసరమునాఁడు సరగఁ బాపవినాశ - తీర్థంపు సేవతో నర్థి మొదలు
గావింప వలెఁగ నల కంజాక్షసుతదిన-మున నరుం డుదయమందుననె లేఁచి

గీ. కాలకృత్యనిర్వహణము-గడచు పిదప, బంధుమిత్త్రులతోఁ గూడి, పాపనాశ
తీర్థమున కేఁగి, సంకల్ప-దివ్యగతిని, స్నానమొనరింప, నఘముల్ బి-రాన సమయు.

గీ. స్నాన మగుడు, సంధ్యావంద-నంబుఁ జేల్పి, విధి మెయిని బితృయజ్ఞంబు-వెలయఁజేసి
యఖిలసంపద లిడఁ గల-యల్ల పాప, హరణతీర్థమహాత్మ్యంబు-నాలకించి 3

గీ. పిదప, వేదవేత్త, కుటుంబి, విజ్ఞతముఁడు,
నయిన బ్రాహ్మణోత్తమునకు, నాఘు లోను
గాఁగ దానముల్ శక్తిని - గల తెఱఁగున
నిడియుఁ, నింటికి నేతెంచి, యాశభక్త
వితతికిం భుక్తు లొసఁగియుఁ, బిదప దంప
తులు భుజించి, యా రోజు నం-దు నెమన నగు. 4

## ఆదివారము—కలకలేశ్వరతీర్థము.

గీ. భానువాసరంబందును, భక్తి మెఱయఁ
గలకలేశ్వరతీర్థంబు - కడకు వెడలి
తనర నట స్నానముం జేల్పి, తన్మహాత్త్వ
కథ వినియుఁ, బితృతర్పణ - కం బొనర్చి. 5

గీ. శక్తికొలఁదిని దానముల్ - సల్పి, కలక
లేశ్వరాఖ్యశంకరుని బూ-జించి, యింటి
కరుగుదెంచి, దంపతిపూజ - జేంపు నెడలఁ
బుత్రపౌత్రసర్వార్థముల్ - పొనరు; నిజము. 6

క. అల కలకలేశమునకు సురలు, జేక్కులుఁ, గిన్నరులుఁబ-రఁగఁ దమ కాంతా
తిలకంబులతో రాఁ, దత్కలకలపుతి దానికి నల - గణ్యత గలిగెన్. 7

గీ. అవేట జలకంబు లాడి, యా-హరుని గొల్వ
నఖిలపాపాల్ పటాపంచ-లగు, శుభము లె
సఁగును, గోర్కుల్ ఫలించును, సంతతియును
దప్పకొప్పును సజ్జన-తతులు పొగడ. 8

గీ. పరిహృతకురారవుం డగు-భైరవుండు
తగ వినిర్మించె నీ మహా-స్థలముఁ దొల్లి;
నిచట రుద్రాభిషేకంబు, నింక ను దుర్గ
పూజఁ జేల్ప, సర్వార్థముల్-ముక్తి గల్గు. 9

శా. "కాలాకారుఁడు, భస్మదేహుఁడు, జటాగ్రామోల్లసన్మస్తుఁడు
ద్వేలాభీలతరాఘహర్త, యఖిలోర్వీదేశికుండున్, గపా
లాలంకారలసత్కరుండు, సుదయోదారుండు, దిగ్వస్త్రుఁ డౌ
ధీలాలిత్యమనస్కభైరవుని భక్తిం గొల్తు నశ్రాంతమున్." 10

శా. ఈ లీల న్నుతిఁ జేల్పి, భైరవుని సేవింపంగ నా వారి కా
భీలాఘౌఘపరంపరల్ వొలఁగి, యుర్విం బ్రాజ్యరాజ్యాదికో
ద్వేలశ్రీసుఖముల్ దలిర్చి, యవులన్ జేర్మిన్ విముక్త్యంగనా
శీలం బెల్లను గొల్లలాఁడ నెసఁగున్, శిష్టాళు లగ్గింపఁగన్. 11

ఉ. భైరవు నంతికంబునఁ బ్రవాళము, ముత్తెము, రత్న, మింక, బం
గారము, వస్త్రముల్ మొదలుగా నగు వానిని భక్తకోటికిన్
శ్రీరహిమీఱునట్టి శుభశీలురకుం దగ నీయ నౌను; మా
న్యోరుతరప్రదానమును నొయ్యనఁ జేయఁగఁ బోలు నియ్యెడన్. 12

క. ఇవి కలకలేశమహిమము, ముదవతిరో! విన్న వారు, మఱిఁ జేసిన వా
రొప్పిదలఁగ వ్రాసిన వ వసు, సదమలశుభముక్తులందఁ-బొలుదురెలమిన్. 13

## సోమవారము - సోమసిద్ధేశ్వరతీర్థము.

గీ. సోమవారమునాఁడు వి-శుద్ధమతిని, దుంగభద్రానది ం గడున్-రంగుమీఱు
సోమసిద్ధేశతీర్థాన-సౌరిదెఁ దాన, మాడి, బ్రహ్మయజ్ఞముఁబితృ-యజ్ఞమొగిని.

గీ. జేరిపి వేదవేత్త, కుటుంబి, సద్గుణుండు, నయిన భక్తునకుం బ్రస్థ-మన్ని బియ్యా
మంబరంబుతో నొసఁగి, ఫాలాక్షుఁగొల్చి, పిదప నాపాసనము సల్ప, వెలయు
నంతు. 15

## మంగళవారము - అగ్నీశ్వరతీర్థము.

గీ. కుజదినంబున నెంతయుఁ-గూర్మి మీఱఁ
జేసియు, నగ్నీశతీర్థాన-స్నానసంధ్య
లాచరించి, కందుల ద్రోణ-మన్ని దాన
మిడియు, నటఁ బొల్పు శివుని బూ-జించి, భక్త
భుక్తులను గొల్పి, యాల, గీ-మునను వచ్చి. 16

గీ. దంపతులభోజనంబులం - దనరఁ గొల్పి
వారియాజ్ఞనై భుజియింప-వలయు ; నటులఁ
గ్రమముగాఁ జల్పు నార ల-ఖండమయిన,
స్వర్గలోకసౌఖ్యము గాంత్రు-సత్య మిదియు. 17

## బుధవారము - భుజంగేశ్వరతీర్థము.

గీ. నరుఁడు బుధవాసరము దివా-కరుఁడు వొడము
టకు మునుపుగా భుజంగేశ్వ-ర మను తీర్థ
మున కరిగి, స్నానమును దాన-ములను బత్తిఁ
బొనరిచియుఁ, దీర్థమహిమంబు - వినియు, నలభు
జంగమేశ్వరుఁ బూజించి, శర్వభక్త
భుక్తులనుగొల్ప, నిష్టార్థ - ములు ఘటిల్లు. 18

## గురువారము - బ్రహ్మనారాయణతీర్థము.

గీ. దేవగురుదిన, మేకాగ్ర-భావ మొలయ, బ్రహ్మనారాయణాఖ్యతీ-ర్థమ్మునందు
దానమాడి, తీర్థముకతఁ-జరగ వినియు, వచ్చి, బుధుల భుజింపఁజ-ల్ప, సిరు
[లెసఁగు.

మ. వెలయుం దేవనికాయమాన్య మయి పృథ్విన్ బ్రహ్మనారాయణ
స్థల ; మం దందముఁ జెంద మొంద వనికాసంఘాతరమ్యావనిన్

దొలి వాగీశ్వరుఁ డీశలింగమును సన్నుత్యంబుగా నిల్పె, న
ద్ది లలిం బాపలతాలవిత్ర మయి, ముక్తిం గొల్పు భక్తాళికిన్. 20

ఆ. వె. తాన మిందుఁ జేసి, దానంబుఁను భక్త, తతికిఁ జేసెడి జన-తతికి సుకృత
మతితరంబుగాఁగ-నతుకు, శైవపదవి-కలుగు, నిలనుసంపదలును జెలఁగు. 21

## శుక్రవారము - శుక్రేశ్వరతీర్థము.

గీ. శుక్రదినము శుక్లేశ్వర-శుంభదముల
తీర్థమునఁ దాన మాఁడియుఁ, దీర్చి జపము
శివశివాశ్రితపూజలఁ - జేసి, దాన
ము లిడి, తీర్థకథను విని, బు - ధులకు భుక్త
లొలయఁ జేయ, శుక్లేశ్వరుఁ - డొసఁగు ముక్తి. 22

## శనివారము - పాపనాశనతీర్థము.

గీ. మందవారంబునందునన్ - మరలఁ బాప
నాశమున భాగ్యతోడను - స్నానమాడి,
ఫలముఁగోరి,యుం దుండు న-భవునిగొల్చి
యోగ్యుఁడును, బ్రహ్మవేత్తయా - నొకని దాన
తృప్తుఁజేసి, తీర్థకథ నా-లించి, బుధుల
కన్నవస్త్రదానముల మ-ర్యాదఁ జేల్పి,
యొక్క సద్భక్తునకు ఘృత - ముండుపాత్ర
గుప్తముగ ఫలదక్షిణల్ - గూర్చి యిడిన,
బుత్రపౌత్రభాగ్యము గల్గుఁ, బొనర నిఁకను
భక్తులకు బీఁదలకు వెండి-బంగరముల,
నంబరంబు, నావులఁ, గంబ-ళంబు విడిన,
నీ సుతీర్థపు శక్తిమై నొసఁగు ముక్తి. 23

గీ. ఇదియె వారతీర్థవిధాన; మింతిమిన్న!
అర్కుఁడు కటక మెనసిన-యపుడు సేయఁ,
బుత్రపౌత్రాది సర్వార్థ-ములు ఘటించు,
వ్యాధు లాధులు నెన్నేని-నంతరించు;
శంభుసాయుజ్యమును గల్గు-సత్యమిదియు;
మఱియు, ని వ్వారతీర్థస-న్మహిమ శ్రద్ధ
మీఱ విను వారు, వినిపించు-వారు, వ్రాయు
వారు గాంతురు శివలోక-పదవి నెలమి. 24

కం. స్కాందపురాణమునందునఁ, బొందెడి శ్రీ శైలఖండ-మున, నపరద్వా
ర్మందేతరకథ, వారా, నందదతీర్థ మహిమకథ-న ల్వగు నిదియున్. 25

మ. అపుడున్ శంభుఁ డదంభగుంభన సముద్యద్వాగ్విజృంభిక్రియల్
విపులాభీలతరాజవంజవమహాఽఽవేగప్రతీకారిగాఁ
జపలాక్షీమణి, కద్రిజాతకును, శ్రీశైలాపరాశాచరి
త్రపటుశ్రావణమందుఁ దెల్పె, నల తీర్థశ్రీకతం బిమ్మటన్. 26

శా. ప్రాలేయాచలకన్యకా! వినఁగదే? బ్రహ్మేశలింగంబు శ్రీ
శైలశ్రేష్ఠపుఁ బశ్చిమాశ దగు ప్రాంచద్ద్వారమందున్ సము
ద్వేలశ్రీకరమై, త్రిలోచనమునై, తేజోమయంబై, కదున్
గ్రాలున్ మౌక్తికరత్నకోటి కనకప్రాకార మధ్యంబునన్. 27

అష్టాదశతీర్థములు:—

గీ. అల్ల పడమటిద్వారంబు-నాశ్రయించి
తీర్థరాజంబు లెన్నేని-నర్థిఁ జెలఁగు
నవ్వి యఱువదినాలు,గిఁ-కందుయోగ్య
మయినదష్టాదశనుతీర్థ-చయము మిగుల 28

గీ. ఆలకింపుము, పార్వతీ! యల్లవాని
మహిమఁ దెల్పెద "ననుడు, న - మహరుఁ గాంచి
"సరియె" యని, భక్తిమైఁ బల్కె, శంకరుండు
శాంకరిం గాంచి పలికె" శ్రీశైలమునకు. 29

(1) అంతర్గంగ.

గీ. అపరదిగ్ద్వారము నలంపు-రాఖ్య నొందె
నా యలంపురికిం దక్షి-ణాశఁ గ్రోసు
దవ్వునం ద్రిలోకఖ్యాత-తత్త్వ మెనసి,
యొప్పుచుండు నంతర్గంగ-యురుమహిమను. 30

గీ. అద్ది పాతాళముననుండి-యవనిఁ గాంచె
వచ్చినట్టి దా శ్రీభోగ-వతియ, కాని,
వేఱు కాదు సుమి! యది కా-న్పించి నంత
నే పటాపంచలై విచ్చు-వృజిన వితతి. 31

గీ. పొనర నది గన్న వారికి - ముక్తిగల్గు;
నందుఁ దాన మాడిన వారి - యఘము లడఁగు;
నందు మునుకల నిడి, యట-నలరు బంగ
రంపు రంగు చెలంగు పు-రహరుఁ గొల్చి. 32

గీ. అవులఁ బితృతర్పణోర్వీసు-రార్చనములఁ
బొనరుచు జనము లైహికా-ముష్మికసుఖ
ములను గాంతురు; తత్తీర్థ-కలితకథను
వినియు, నటఁ బొల్చు హరునకుఁ - బేర్మిఁ బూజ
సల్పి, శివభక్తవితతిపూ-జను బొనరుచు
నెడను సంతాన హాని రా, దిఁకను ముక్తి
కరతలామలకం బయి - క్రాలు, నిజము,
తీ ఱెసఁగు ని దంతర్గంగ-తీర్థమహిమ. 33

## (2) పాపనాశనతీర్థము.

ఉ. దానికిఁ దూర్పునందు నరుదారెడిఁ బాపవినాశనంబు నా
జాను సెలంగు తీర్థము, విశంకటసంకటదాయకాతిఘో
రానలసామ్యపాపహర, మాశ్రితమానసికాంతకాంతికా
న్యానభయాపహం బగుచు, నొప్పుగ నాయువు శ్రేయ మీయుఁగన్. 34

చ. పరమమునీంద్రసేవితము, పాపవినాశనతీర్థరాజ ; మ
ప్పురమునఁ గొడ్డురాండ్రు, మఱిఁ బొప్పగ ద్వాదశవర్షవంధ్యలున్
మఱియును, నష్టపుత్రికలు, మారిపంతులై కల్గు కాంతలున్
బొరిగను గొల్వ, వారలకుఁ బుత్రకు లొప్పఁగఁ జేయు నోలిగన్. 35

మ. తిలకల్కంబును మేనఁ బూసికొనియున్, దివ్యస్వినూత్నాంబరం
బులనుం దాల్చి, శివాఽఽశ్రితాజ్ఞ గొని, యింపు న్నెమ్మదిం గొల్చి, గం
గ లలిం దానము లాడినట్టి మనుకల్ గావించి, శ్రీకంఠుఁ గొ
ల్చి, లసన్మానసభక్తియుక్తి చెలఁగన్ శ్రీనారసింహస్థలిన్. 36

శా. చేరం బోయి, విధిప్రకార, మల లక్ష్మీనాథునిం గొల్చియున్,
సారానందదుఁ, డాశ్రితావనుఁడు, తుంగాఖ్యాపగోదగ్దిశా
గారుం, డెంతయు నాకు నిష్టుఁ డగు నక్కాంతాక్షుఁ డంచన్మనో
హారీష్టంబును దీర్చుఁ గాత"మను నొప్పౌ మంత్రమున్ బల్కియున్. 37

## (3) దుర్గామాతృకాసన్నిధులు.

వ. అని యిట్లు జోత సల్పి, జలజాక్షుని వేఁడియు, నాల, దుర్గనుం
గనియు, విధిప్రకార మెసఁగంగను గొల్చియు, నాల, మాతృకా
చర్చనమును జేసి, పైనఁ బది చోడ్పుల దానములం బొసర్చి, వా
యనముల నిచ్చి, భక్తులకు హాయిగ భుక్తులఁ బెట్టఁగా వలెన్. 38

మ. అగరాట్పుత్రిక ! యిట్లొనర్చునెడ, సత్యం బౌ గతిన్ సంతతిన్
వగఁ గాంక్షింతియె కాక, కీర్తియు, సమస్తైశ్వర్యసౌర్యత్వముల్

నుగముల్ గల్గెడు; నెల్ల పాపములు డుల్లుం బంచబంగాళ మై;
యగు శ్రీపాపవినాశనాఖ్యఘనతీర్థాంచన్మహాంబిద్ధియున్. 39

## (4) ప్రథమబ్రహ్మతీర్థము.

శా. ఓ కాంతామణి! యల్ల పాపహరతీర్థోపాంతమం దొప్పు ప
త్ప్రాకట్యం బగు తేజుతోడఁ బ్రథమబ్రహ్మస్థలం; బందు బ్ర
హ్మాకారం బగు లింగ ముండు; నది మున్నంభోజగర్భుండు లో
కైకశ్రీకముగాఁ బ్రతిష్ఠ నిడె దేవానీక మర్థింపఁగన్. 40

ఉ. అక్కడ స్నానదానముల నాచరణం బొనరించి, వేదస
వ్యాక్కమనీయమానసము హర్వగు భక్తునకేని కేనియున్
మక్కువ దానముల్ సలుపు మానవు లెల్లనఘుంబు లేఁగియుం
బెక్కువ నెల్ల కోర్కులను వేడ్కను గాంచి విముక్తిఁ గాంత్రోగన్. 41

## (5) ఛాయామల్లికార్జునతీర్థము.

మ. అనఘుండై, తదుదీచియందునను ఛాయాపూర్వ మా మల్లికా
ర్జునసత్తీర్థ మెసంగు, నందుఁ దనరున్ బ్రోద్యద్విచిత్రస్ఫుర
ద్ఘనవర్ణం బగు లింగ మొం; డెవ్వఁడు తద్భవ్యైశలింగంబు నో
య్యనఁ బూజించునో, వాఁడు శ్రీగిరిని దైవాఱంగ నా లింగ మె
య్యన సేవించుఫలంబు నొందు; నట ఛాయామల్లికాపూర్వ కా
ర్జునతీర్థంబునఁ దాన మాడి యును, నచ్చోఁ బొల్చు శ్రీమల్లికా
ర్జును బూజించిన, నెల్లపాపములు డుల్లుం బంచబంగాళమై 42

శా. "సాలగ్రామము, నేయి, ముత్యములు" నా నొప్పొందు దానంబు లా
మే లౌ చోటనుజేయు వారు కడు నెమ్మిన్ బుత్రసౌభాగ్యము
ద్వేలశ్రీగతిఁ గాంతు; రింకఁ దుది ముక్తిం గాంత్రు; నిక్కంబుగా;
నాలా పాతిగ మీనుతీర్థమణి మాహాత్మ్యంబు చింతింపఁగన్. 43

## (6) వేదాసంగమేశ్వరతీర్థము.

మ. తదుదీచీదిశయందు నందముగ వేదాతుంగభద్రామహా
నదు లొండొంటిని జేరుచోఁ దనరు లింగం బొండు, శ్రీసంగమా
ఖ్యాదురుద్యద్వృజినాంతకంబు, వరదం, బత్యంతతేజోయుతం ;
బుదితం బా మతి నందు మున్కలిడియుర్విన్, ప్రోద్యన్మహాభక్తిమైఁ
బిదపన్ సంగమశంకరుం గొలిచి, పృథ్వీదేవతాదానముల్
పాదలం జేసినచోఁ గృతాఘములు వింపుం జెంది, నైలింప భ
వ్యదశాలాభము లంది, ముక్తిసతితో నైక్యంబు గాంచెం దగున్. 44

ఉ. ఈ విధిఁ గాంత లా శివుని నింకను నందు నెసంగు శాంకరిన్
భావ మెలర్పఁ బూజలను బర్వఁగఁ దన్ప, సుమంగలీత్వముం
జీవము లుండు దాఁకఁ గని, చెల్వుగఁ బుత్త్రి లెసంగి, సంపదల్
వావిరి గాఁ దలిర్చెద, రవారితమోక్షపదాప్తియోగ్యతన్. 45

## (7) గణికాసిద్ధేశ్వరతీర్థము.

శా. వేదాసంగమతీర్థసన్మహిమ దేవీ ! వింటి ; వింకం, దదీ
యోదీచిం బది విండ్లదవ్వునను నెంతో భక్తిమై నప్సర
స్త్రీదివ్యత్కృతిమై నెలర్చు గణికాసిద్ధేశ్వరక్షేత్ర మీ
లోకస్తోమశుభాకరం బగుచుఁ బొల్చున్ సన్మహత్త్వంబుతోన్. 46

మ. తగ గంధర్వపతీవతంసము లటన్ దానంబు లాడంగ నొ
ప్పుఁ గడిచుం గర ; మందు నుండెడి శివున్ బూజించి, యిం కందు దా
లగు లోకాంబికయా కుమారికని వస్త్రాలంక్రియాదిక్యపూ
జఁ గడిందిం బొనరించి, యోగ్యుల కొగిన్ సత్కారముల్ సల్పినన్,
దగు న వ్వారల కెల్ల సౌఖ్యము, లిఁకన్, శైవావనీవాసమున్. 47

మ. గణికాసిద్ధినుతీర్థసన్మహిమ నాకర్ణింతు ; నాలింపు ; మం
దణమాత్రంబు దొసం గెసంగని జలంబం వోయ్య నానాప్సరో

మణు లెంతేనియుఁ దానమాడి, ఫలసమ్యగ్వాసనాపుష్పముల్
మణిభర్మాదుల నం దొసఁగు నుడురాణ్మౌద్యజ్జటామండలున్
ఫణిమాలాఢ్యుతు, సాంబశంకరు ననుస్వార్గపుణంగొల్చి, ప
న్మణిమంజీరఝుళంఝుళారవము మై నాట్యంబులం జేల్పి, ని
ర్గణుఁ డాదేవునకున్ ముదం బిడఁగఁ, దద్గోరాట్తురంగాద్యుతిన్
మణి యీ తీర్థములందు నిద్ది ; సురవామాక్షుల్ తదీశానుకా
రుణికత్వంబున మేల్వరంబు గొని, యార్తుల్ వో మనంగాఁ దగెన్. 48

గీ. అగజరో ! యేరు తగ శాంతు-లై, జితేంద్రి
యు లయి, యీ తీర్థమందున - వోలి నేఁడు
రాత్రు లుపవాసముం జాగ-రములు సలిపి
భక్తిఁ బంచామృతాదులన్ - భవునకుం ది
వముల రాత్రులం బూజలఁ - బరఁగఁ జేతు,
రల్ల వారికి సిద్ధి చే-న్నారుఁ ; గాన
నలరెడి గణికాసిద్ధేశ - మనఁగ దీర్థ
రాజ మియ్యది , విను ; ముడు-రాజవదన ! ! 49

క. స్నానము, దానము, శివసన్మానము, జపముం, దపోవి-ధానము, నట న
త్యానందదమ్ములున్, మోక్షానల్పఫలప్రదములు ; నంభోజముఖి ! ! 50

ఉ. స్కందపురాణమందు, శివశైలపు ఖండమునందుఁ "బద్మటం
బొందెడి శ్రోవ గొప్ప"యని పొల్చెడిభాగమునందుఁదీర్థస
ద్బృందమహత్త్వవర్ణనఁ బోరిం దగు నాలువ కక్ష్య యిద్ది, దై
నందినమానవార్తివృజినప్రకరప్రమదాపహం బగున్. 51

## (8) మోక్షేశ్వరతీర్థము.

మ. గణికాసిద్ధతలోత్తరంపుఁ బదియా కాండంబు లౌ దవ్వునం
గణనీయప్రభ మై, సుతీర్థనికరాగ్రణ్యంబు నై, దేవతా

ప్రణుతంబై, యపవర్గదాయకమతీర్థం బొప్పు మోక్షేశ్వర
ప్రణుతిం బొంది, సమస్తపాపవనదావజ్వాలికాకారతన్. 52

మ. అటఁ దానం బొనరించి, శుద్ధి గని, చంద్రాలంకృతుం గొల్చి, యు
త్కటతత్తీర్థమహత్త్వమున్ వినినచో, గాఢాఘజాలంబులున్
మటుమాయంబగు ; ముక్తికామినియు "రమ్మా" యంచు బల్ పేర్మిఁ బి
ల్చుటపం బూనుఁ, ద్రిలోకియందిది కడున్ సొంపారు నిక్కంబుగన్. 53

(9) భుజంగతీర్థము.

మ. తదుదీచీదిశ నాదిశేషనియతస్థానం, బహిక్షేత్ర, మిం
పెదకుం గూర్చ నెసంగు, నందును భుజంగేశానలింగంబు, స
ర్వదివౌకస్తుతిమూల మై, సదపవర్గశ్రీకరం బై, శుభ
ప్రజ మై, వజ్రమయంబు నై, వరద మై, వ్యాళోరుమాలావిరా
జదనూనప్రభ మై చెలంగు రహి మించెం దుంగభద్రాతటిన్. 54

గీ. ఈ భుజంగేశ్వరు నొగి సే-వించి, యీను
తీర్థమునఁ దగు దానత-తిని నొసంగి
భక్తులను గొల్వ, నిష్టలాభమును, బుత్ర
పౌత్రలాభమున్, ముక్తిలా-భమును బరఁగు. 55

గీ. అట్టి దాత లాప్పృత్త్యపే-తాపవర్గ,
పదము గాంతురు, శేషాహి - భవ్యకృతిని,
బరఁగు శ్రీభుజంగేశ్వర-పదము మహిమ,
దీని వినిచితి ; నింక, నే-దేని వినదో ?
తెలుపు "మని పార్వతిని మహా - దేవుఁ డడిగె." 56

ఉ. అందులకున్ నగేంద్రతనయామణి శంకరుతో ననున్ —"ప్రభూ !
పొందుగ నింకనొక్కెడయి పొల్చెడి తీర్థపు సన్మహత్త్వముం
గ్రందుగఁ దెల్పుమా ! "యనుడుఁ గాలగళుండు వచించె నవ్వు, డో
సుందరి ! చాల సొంపయిన చోటును దెల్పెద, నాలకింపుమా !! " 57

## (10) బ్రహ్మనారాయణక్షేత్రము.
## (11) మణికర్ణికాతీర్థము.
## (12) ప్రయాగతీర్థము.

గీ. బ్రహ్మనారాయణక్షేత్ర-వరముఁ గూర్చి
మఱియు మణికర్ణికను గూర్చి, మగువమిన్న!
మున్ను తెల్పితి, నెంతయు మిన్న లంచు
ఇఁకఁ బ్రయాగతీర్థము నాల-కింపు, మగజ!! 58

చ. అట నరిశంఖపంకజగదా౽౽ఢ్యకరుండును, వైజయంతికౌ
త్కటమణియుక్కిరీట కనకాంబరయుక్తగళ స్థలీశికః
కటియుతుఁ, డానమద్వరదగణ్య శుభాభయదుండు వొల్చు స
త్పటుతఁ బ్రయాగమాధవుఁ డుదారతరాఘనిదాఘ మాఁగఁగన్. 59

ఉ. అల్ల ప్రయాగలో జలక మాఁడి, రమాధవుఁ గొల్చి, పాపపుం
దల్లడ మీఁగ, నాలఁ, బితృతర్పణముం బొనరించి, ప్రస్థమా
త్రోల్లసితప్రమాణ మయి యొప్పెడుసెన్గలు, గోవు, నొక్కశ
క్త్యుల్లసితాత్ముఁ గొల్చి యిడ, నొందును వారికి మోక్షసంపదల్. 60

శా. ముల్లోకంబులలోఁ బ్రయాగము యశఃప్రోల్లాసముం జెందు, భా
స్వల్లీలాప్తిఁ జెలంగుఁ దుంగ యిట, నా సద్వాహినిన్ మున్గియున్
బెల్లౌవైభవ మొప్పు శ్రీహరిని సేవింపంగ నా వారికిం
దుల్లుం బాపపరంపరల్ సుజనకోటుల్ 'మేలు మే' లం చేసన్. 61

## (13) దేవద్రోణీతీర్థము.

శా. దేవద్రోణిని గూర్చి వింటి మును, హే దేవీ! తదీయోత్తరా
శావిశ్రాంతిని వహ్నినాథ మనఁగా సల్లింగ మొప్పొందుఁ ; ద
ద్భావంగమ్యత నాలకించితివి ; స్కాందప్రోక్త శ్రీశైల స
ద్భావేంద్రేతరదిక్కథం బొలుపు నొందన్ సప్తమం బిద్దియా. 62

## (14) శుక్లేశ్వరక్షేత్రము

గీ. ఇంటి శుక్లేశ్వరక్షేత్ర-వితతమహిమ ; మెట్టితీర్థంబు లద్దాని - కేటి సాటి ?
యజ్ఞఫలముల మించెడు-నట్టి ఫలము, నిచ్చుఁ గాశికాపురితోడ-నెనయఁ బద్ది.

## (15) నాగభోగేశ్వరతీర్థము.

గీ. దాని కుత్తరంబునఁ - దనరుచుండు, నాగభోగేశ్వర మని సు-శ్రీ గణించు
తీర్థరాజ మాశ్రితుల కి-ష్టార్థములను, గరతలామలకము సల్పఁ - గలది గరము.

శా. అందందంబునఁ బొందు నీల మయి, రమ్యంబై, ప్రశాంతంబునై,
చందచ్చందనశీతలం బయి, జలేజాతారిచూడామణీ
సంసిక్తంబు, ఫణీంద్రభూషణ సమంచల్లింగ, ముల్లోలపా
పాంగత్వాపహసూర్యబింబతుల నోంకారత్వవిస్తారమై. 65

మ. ఆట స్నానం బొనరించి, నాగవలయున్ హర్షొప్ప నర్చించియున్,
నిటలాక్షాశ్రితపాళి మేలుపొదలన్ సేవించినన్, సంతతో
త్కటసంపన్నతియున్, ప్రజావితతియున్ దైనాటి, యంతంబునం
బటు నాపేర్మిని ముక్తికాంతయును వరింపం బొల్చు నిక్కంబుగన్. 66

వ. మఱియుం బ్రస్థము గోధుమలను సెనగలను వస్త్రంబుతోడ సజ్జనునకు నర్పించి యొసంగుట శివానుగ్రహఫలంబును బొంపొందించును, సంతానంబును, పురుషార్థంబులను సమకూర్చు, నీ మేలి చోటి కత సదివినను వినినను రోగములం దొలంగించును, భుక్తిముక్తులం గూర్చు, నిత్యాది నాగభోగేశ్వర తీర్థ మాహాత్మ్యంబుఁ గత వినిపించినాఁడ. 67

## (16) సోమసిద్ధేశ్వరతీర్థము.

గీ. సోమసిద్ధేశతీర్థ వి-స్ఫురితమహిమఁ
దెల్పినాఁడ ; నింతీ ! యయ్యా-ది రహిఁ మించు
నాగభోగేశమున కుదీ-చికతిగను
సకల పాపహరణము, కామ్య-చయకరమ్ము. 68

## (17) ప్రవాళలింగము.

చ. నలువుగ దానికుత్తరమునందు న నాదవతీ తటంబునన్
బొలుచుఁ బ్రవాళలింగము, సమున్నతభక్తి యజించు వారికిం
జెలఁగెడు కామితంబులను జేర్చియు, ముక్తిసతీమణీకరం
బెలమిని గూర్చు సంగమమహేశ్వరనామక మై తలిర్చుచున్. 69

## (18) నాదావతీ తుంగభద్రా సంగమక్షేత్రము.

శా. ఆ నాదావతి తుంగభద్రయును సాంగత్యంబునుం గాంచు నో
స్నానంబుం బొనరించి, సంగమశివున్ సంపూజనం జేల్పినన్
నానాపాపవిమోచనంబును, సమంచత్కామితావాప్తియున్
మానోఁదం దగు, ముక్తికామినియు సన్మానించు నవ్వారలన్. 70

చ. పరమరహస్య మిద్ది యగుఁ; బార్వతిరో! వినిపించినాఁడ; నీ
పరమశివస్థలంబునను భక్తులకుం ధరణీప్రదానముం,
గరవున బీఁదవారలకు నల్వగ నన్నపు దానముం, బొరిం
జేరపిన, నెల్లపాపములు జేరున జారును మాడి వీఁడియున్. 71

మ. ఇది యాలించినఁ బున్నె మబ్బు; నిటపై, నీ రీతి నింతీ! వినం
గదె? నాదావతి తుంగభద్ర యటు సాంగత్యం బగున్ చోటి కీ
శదిశన్ బొల్చు శుభస్థితిం గలక లేశఖ్యాతతీర్థం, బటన్
బొదలున్ లింగము శుభ్ర, మభ్రగ, సౌగిం బ్రోద్యన్మహోజ్జ్వాలికా
స్పద తేజోయుత, మిష్టకామ్యఫలదంబున్, ధూతపాపౌఘమున్. 72

శా. స్కందంబందున, శ్రీగిరీంద్రమహిమం జొనొంద నా వారణా
శం దైవాలు కవాటపుం బెరిమ నెంచేం బొల్చు రీతిన్, రహిం
బొం దౌ సప్తమభాగ మిద్ది; మఱి నిందుం జేసి యష్టాదశా
స్పందోదారనుతీర్థరాజముల సవ్యత్వంబు తెల్పంబడెన్. 73

## ఆశ్వాసాంతపద్యములు.

మ. ఇది బ్రహ్మేశపురాణ నామకముగా, నే వేంకటాఖ్యుండఁ జే
ల్పుఁదగున్ సత్కృతియందు, మూఁడవది యాశ్వాసంబు; నాతల్లిఁదం

ద్రి దివంబఁదున దీని కారణమున న్నిత్యంబు దైవాఱఁగా,
పదయుం డౌ హరుఁ డొప్పు, వ్రాసితి రసజ్ఞశ్రీకృపాలబ్ధికై. 74

మ. పరమేశానమహైకమానసులు! దీవ్యల్లౌకికాముష్మిక
స్మరణానూనను ధర్మకర్మరులు! సుశ్లోకంబు మీ రొంద, నా
చరితంబెంతయు ధన్యతంబొరయఁగా, స్వాతంబునం దెంచి, యి
త్తెఱఁగేఁపార రచించినాఁడఁ గృతి మాతృశ్రీ పితృశ్రీయుతుల్. 75

శా. “ఆయుష్యంబు కరంబు నల్పము కలిన్, బ్రాంచద్గతిం జన్మముం
గేయం బై పొలుపొందఁ జేయుటకు భక్తిం బార్వతీశార్చనం
జేయంగాఁ దగు” నంచు మీ గుఱుతు నర్థిన్ సద్రసాలంక్రియా
శ్రీయుక్తిన్ రచియించినాఁడ నిది; మాతృశ్రీ పితృశ్రీయుతుల్. 76

గద్యము.

ఇది శ్రీ తుంగభద్రానదీతీర విరాజమాన కందనవోల్నగరమందిరుండును, శ్రీమ
ద్వేంకటేశ్వర కరుణాకటాక్షవీక్షణానందిత హృదయారవిందార్య
వైశ్యరత్న దోమాన్వయపయఃపారావార రాకాసుధాకర గోవిందార్య
తత్సహధర్మచారిణీ కోటాంబికామణీ నందనాగ్రజుండును, శ్రీరామ
చంద్రపాదారవింద మరంద పానేందిందిరాయమాన మానసుం
డును, సరస కవితారచనాభిప్రాయుండును, సకలసుధీజన విధే
యుండును, నానాదేశబుధానీకప్రదత్త శ్రీమదాంధ్ర
విద్యావాచస్పతి, సాహిత్య సరస్వతీ, విద్యా
వినోద, కవిభూషణాది బిరుదాదృతుం
డును నగు వేంకటస్వామి గుప్తచే
రచింపఁబడిన శ్రీమద్భృహన్మాత్రు
శ్వర పురాణంబునందుఁ
దృతీయాశ్వాసంబు.

---

శ్రీరామచంద్రాయనమః.

శ్రీజోగుళాంబాబ్రహ్మేశ్వరాభ్యాన్నమః

# శ్రీ బ్రహ్మేశ్వర పురాణము.

---

## చతుర్థాశ్వాసము

క. శ్రీమద్వేంకటగిరిపతి - కోమలతరపదజలరుహ-కుంరితభక్తి
ప్రామాణ్యాహృదయులారా! నామాతరపితరులార! నయమతులారా!! 1

వ. దయతోడ వినుం, డవ్వల సర్వలోకవశంకరుండును బాలితకింకరుండును
నయిన శంకరుండు శాంకరిం గాంచి, యీ ఫక్కిని వక్కాణించె, నట్లు
నైమిశాటవిని శౌనకాదులకు సూతపౌరాణికవతంసంబు దెల్పె. 2

మ. అగజా! దేవి! వినంగదే? నిజగుణం బాలించు మాత్రానఁబా
పగణం బాఁపెడు శ్రీనగాపరదిశాద్వారం, బలంపూర్ణమా
ఖ్యగురుక్షేత్రము సన్మహాత్త్వమును జెయ్యం దెల్పెదన్.—దాని దా!
మగమప్రక్రియ లెల్ల సూరులకు నిచ్చన్ మెచ్చు నచ్చెంబుగన్. 3

### శ్రీమద్బ్రహ్మేశ్వర లింగము.

మ. అట బ్రహ్మేశ్వరలింగ మొప్పెడి, నజుం డాలింగము న్నిల్పె, ను
త్కటమా భక్తిని "శంభు! శంకరుఁడ! శ్రీకంఠా! మహాదేవ! స
త్పటలారాధిత! సర్వగా! శివ! సురాధ్యక్షా! నతుల్ నీ”కఁటన్
పటుభావం బగు మంత్రముం జేదివి, సంప్రార్థింపఁగా నొప్పగున్. 4

వ. ఆప్రార్థనామంత్రం బెట్లనిన, 5

శ్లో. హర! శంభో! మహాదేవ! విశ్వేశాఽమరవల్లభ!
శివ! శంకర! సర్వాఽఽత్మన్! నీలకంఠ! నమోఽస్తు తే! ! 6

## నవబ్రహ్మలింగములు.

చ. అటులఁ జతుర్ముఖాజనిచితాభవలింగసమర్చనంబు న
త్కుటమతిఁ జేయఁ బోలు; నవకంజభవుల్ తగ నిల్పినట్టి వా
నిటలతటాక్షలింగములు నిస్తులవై భవ మొప్పి యొప్పు, ని
చ్చోట భవబంధమోచనవిశంకటశక్తియుతంబు లై కడున్. 7

శా. (1) బాలబ్రహ్మశివుండు, (2) నర్కుఁడును, (3) గుమారబ్రహ్మముల్, తారకా
ఖ్యాలీలుండును, (5) విశ్వనాథుఁడును, (6) బద్మాఖ్యాకుఁడున్, (7) గారుడ
శ్వేశాహ్వయుఁడు, (8) స్వర్గనాయకుఁ, డిఁకన్ (9) వీరుండనంగా నవ
శ్రీరాజీవభవప్రతిష్ఠితము లర్థిన్ లింగముల్ శైవముల్. 8

## జోగుళాంబిక.

మ. హరి బ్రహ్మేశుఁడె విశ్వనాయకుఁ, డెలంపూ రల్ల వారాణసీ
పురి, యా భాగీరథి తుంగభద్ర యిది, సంపూర్ణంబుగా నిక్క; మీ
తెఱఁ గి ట్లొప్పెడి; నింక న య్యెడను సద్విఖ్యాతచారిత్ర మే
ర్తైర నొప్పారెడి జోగులాంబ నతి భక్తిం జేరి, భక్తావళుల్. 9

శ్లో. లక్ష్మీస్వరూపేఽఖిలపుణ్యదాత్రి ! పుత్రప్రదాత్రీ! తవదృష్టిమాత్రాత్
కరాళవక్త్రే! కరుణాలవాలే! భజామిత్వాం జోగుళనామధేయాం 10

## పయినిశ్లోకమునకుఁ దెల్గు.

గీ. "శ్రీస్వరూప!సమస్తను-కృత్రప్రదాత్రి!దృష్టిమాత్రఁ బుత్రులఁజెలం-గించు తల్లి!
రో! కరాళముఖి! కరు-ణాకరమతి! సారిది నిన్ను భజింతును; జోగుళాంబ!!"

గీ. అనెడి భావముగల మంత్ర-మనుగఁజేదివి, జోగులాంబను బ్రార్థించి-శుద్ధమతిని,
జెంది, యామెకృపను జెంగు-శిష్టులకును,సకలవాంఛితంబులు దీఱు-సత్వరముగ.

## వీరభద్రుఁడు.

వ. పిమ్మట శ్రీవీరభద్రుని సన్నిధానంబును జేరి, 13

శ్లో. హేవీరభద్ర ! హరపుత్ర ! సుదీర్ఘమూర్తే
దక్షప్రజేశకృతయజ్ఞవినాశకారిన్!
శంభోర్జటోద్భవ! మహోహనకోపమూర్తే!
కందర్పసుందరవపుర్హననాదికారిన్ !" 14

## పయిశ్లోకమునకుఁ దెనుఁగుపద్యము.

మ. "శితికంఠోరుకసజ్జటాభవ! మహా శ్రీకాత్మ! దక్షప్రజా
పతిదీవ్యద్ఘనయజ్ఞనాశక! రిపుప్రాంచన్మహోధైర్యప
ర్వతసంపాటనభీకరాహవరుషారావప్రకారార్భటీ
యుత! దేవా! సుకుమారమారహరణోద్యోగప్రచండాకృతి
ప్లుత! నిన్నెంచెద; భక్తవందిత! యుదంశూ! వీరభద్రప్రభూ!!" 15

వ. అనెడి భావంబు గల మంత్రంబుఁ జేదివి, యతని సేవించి, జటేశ్వరుని గొల్చి, విఘ్నేశ్వరునకు నమస్కారంబు గావించి, శివాలయంబు వెల్వడి త్రిమూర్తులకు జోత లిడి, యచేటనె వేంచేసియున్న సూర్యనారాయణ స్వామికిఁ బూజానమస్కారంబు లొనరింపవలయును, ఇ ట్లెల్లఁ జేయుట మోక్షప్రదంబు; 16

ఉ. పుణ్యము, మోక్షమున్, శుభముఁ బొందఁగఁ జేయఁగఁ బోల్చు భాస్కర
ప్రోన్నతతీర్థరాజమయి పొల్పెసలారు సలంపురంబునం
దున్నసమస్త దైవతమహోన్నతరూపములం భజించి, భ
క్తిన్నళినాంబకారి దగు దేవళమందున నుండి వచ్చియున్. 17

## ఇతరదైవతములు

క. అక్షయరీతి బైట నరుదారెడు దైవతకోటి వేటి, కా
మాక్షి, సమస్తలోకచయమోరి మహామహిమాభిరామ, న

త్యక్షయభక్తి బ్రొక్కియును, నవ్వలఁ జండిక మున్నుగా నటన్
విక్షతి లేని రీతిఁ దగు వేల్పులఁ గొల్వఁ దగున్ యథామతిన్. 18

## శ్రీలక్ష్మీనారసింహులు.

ఉ. ఆవల నారసింహుని సదంతిక మందియు, నాదిమ
ధ్యావరణాతిదూరుని, దరారికరాంబుజు, నబ్జవాసినీ
భావజతేజభాస్కరుని, బద్మదళాక్షుని, నల్ల దేవతా
దేవుని, దీనబాంధవు నుతించియు, నందున వెల్గు మాధవీ
దేవికి, నాదిశక్తికి నతిం బొనరించియు, నాల, నిందిరా
దేవి చెలంగుదండ కరుదెంచి నమస్కరణంబుఁ జేల్పిరున్. 19

శ్లో. నాజ్మ్రయే! త్వంహరేఃపత్నీ, సర్వసంపత్ప్రదాయకే ! ! 20

వ. అను మంత్రంబుతో న మహాలక్ష్మీదేవిని నుతించి, యామెకు సంతృప్తిని
గల్గించి, మాధవీశక్తిం జేరి, నలువది రోజులో, యుండుసగంబో, యుప
వాసం బుండి, దేవిని బూజించి, పుత్రసంతానలబ్ధికై ప్రార్థించినచో, నా
దేవేరుల యనుగ్రహంబునం జేసి తప్పక పుత్రసంతతి గల్గుఁ; దత్సమయంబు
నందు జ్ఞాను లయిన భగవద్భక్తులకు సజ్జనులకు, భోజనమజ్జన స్రక్చందన తాం
బూల జాంబూనదాంబరా భరణాదిమర్యాదలం బొనరించి, వీల్కాలందిం
దక్షిణ లొసంగవలయు, వారి యాశీర్వచనంబు నీప్సితార్థసిద్ధికిఁ దోడ్పడఁ
గలదు. 21

శా. ఈ రీతిం దగ నైమిశాటవిని మౌనీంద్రుండు సూతుండు చె
న్నారం బల్కె నమందసుందరమరందాకారతం; దుంగభ
ద్రారాజత్తటవారుణ స్థలనుతీర్థ బ్రహ్మశంభుక్రమ
స్ఫాగ్రశ్రీగిరి పశ్చిమాఽలఘుతరద్వారప్రభావంబునం,
దో రాజాననరో! మ అౌక్క విషయం బొప్పార నాలింపుమా!! 22

ఆ. వె. మిగుల నుత్తమంబు - మేటి రహస్యంబు,
తీర్థమహిమ మిద్ది - తెలిసినట్టి
జంతు వెద్దియేని - జరయుఁ మృతియు లేక
యొంఁగు, మోక్షపదము - నెనయు ; నిజము. 23

ఆ. వె. ఒరుల కెరికేని-నొప్పఁ జెప్పఁగరాని, యీ రహస్యము విని-పించుచేంటి
భార్య వయిన నీకుఁ ; బరమ సాధ్వీమణీ ! కాన, దీని శ్రద్ధ-గల్గి వినుము.

## తుంగభద్రా మాహాత్మ్యము.

శా. శుక్లద్వాదశి, నూర్జమాస మెవఁడుఙ్ జొప్పొంది, సంసారదు
శ్శైవ్యక్లబ్యాంతక నుల్లికార్జునకుభృద్రాడ్ద్వారుణాశఙ్ మహా
త్వాక్లిన్నప్రభ, దుంగభద్రను గడుం బాటిం జలంబాడుఁ, బా
పక్లేశంబులు వానిఁ దత్పితరులఙ్ బాయుఙ్, నుకంబబ్బెడిఙ్. 25

సీ. ఆలుఁబిల్లలును లే కల్లాఁడు వారును, నగ్నిసంస్కృతి హీనులయిన వారు
శ్రాద్ధకర్మములేక రహిఁ జెడ్డ వారలుఙ్, బిండోదకాల్ లేక యుండు వారు
అగ్నిలోపలఁ బడి, యసువు లీఁగిన వారు, భృగుపాతమునఁ జేసి నగిన వారు
నీటిలోపలఁ బడి నీల్గిన వారును, మృగతతిచేత నీలిగిన వారు

గీ. విష, పశు, కిరాత, చండాల-వితతిచేతి
మృతిని గాంచిన వారలు ప్రేతరూప
మూని, యంతరిక్షమ్మున-మూఁగుచేంద్రు
బహులకష్టమ్ముతోడఁ; బర్వతకుమారి! 26

మ. అటులం బొల్చెడి పాపివారల కులంబం దొప్పు నేఁడేని, ను
త్కటపుణ్యప్రభ తుంగభద్రను రహిందానఁబు లాఁడుంగ, ని
ప్పటు పుణ్యంబునఁ ద, త్తదీయయువతీ, వంశస్థులుఙ్, వారివా
రటుచుండిం గను వారు దేవపదలాభానూనసౌఖ్యంబుఙ్. 27

గీ. తుంగభద్రాతటంబునం-దునను భక్తి
తో గయాశ్రాద్ధములు చేయఁ-దొడరు వాఁడు
తనరఁ బితృదేవతలఁ గూడి-వనజవైరి
ధారిలోకంబునందు నం-దంబుఁ జెందు 28

సీ. తుంగభద్రాతీరరంగంబునందు రం - గారు శ్రీకుధరాపరావకాశ
విలసితద్వారాన వెలయు గోపీజన-ప్రియుని శ్రీకృష్ణు సేవించియును, దు
లాపూరుషాఖ్యసత్క్రియయుక్తి శక్త్యను - సారదానంబును జేల్పునట్టి
సంకల్ప మెదయందుఁ జేల్పఁగా వలయును; ముక్తిస్థలిగ,గయాభూమియందు

గీ గంగ యమునయుఁ గలియుచోఁ, గడఁగి ధర్మ
పు పెడ యగు కురుక్షేత్రానఁ, బోరిని దండ
కాటవిని, నైమిశవనభా-గంబునందు,
బదరికాస్థలంబున, హిమ-వన్నగమున. 29

గీ. ఇంక మేదినిఁ గల్గు నె-న్నేనిఁ జోట్ల
దానధర్మంబులను జేయఁ-గా నెసఁగు మ
హాఫలము తుంగభద్రాస-దాపగాజ
లంబునం జేసినం గల్గు-డంబు గాఁగ. 30

గీ. సూర్యుఁడు కటకరాశిని-జొచ్చినపుడు
శ్రీనగాపరాశాస్థలిం-జెలఁగు తుంగ
భద్ర నీ రుమ్మట్టినంత నే-పరఁగఁ బ్రతిది
నమును గంగ నొక్కఁడు కా-లమగు వఱకు
మునుక లిడిన పుణ్యం బది-పొందు; నిజము. 31

కం. గంగాయమునాసంగమ, రంగస్నానంబు వత్స-రము సల్పు ఫలం,
బుం గల్గుఁ దుంగభద్రా, మంగళనదిని రవిసంక్ర-మపు టొక మున్కన్. 32

వ. మఱియును, శూర్పాకారము, నివృత్తియును, గంగాపాతాళసంజ్ఞకభాస్కర

క్షేత్రము (శ్రీశైలము)ను లోకంబునందు నసమానతీర్థరాజంబు; లీ యలంపురి
యును భాస్కరక్షేత్రంబు; దీని పడమటిదెసను బద్మాకరంబు గలదు; 33

మ. పడఁతీ! యే నరుఁ, డర్ధరాత్రమున దివ్యత్తీర్థమం దిందు నె
క్కుడు భక్తిం జలకంబు లాఁడి, శుచి యై, గో మొంద సంధ్యాదికం
బడరం జేల్పి, శరీరమంతటను భస్మాలేపనం బూని, యొ
క్కఁడుగా నూరికినిం బ్రదక్షిణమునుం గావించునో, వాని కా
మృడలోకంబున వాసమొప్పు, ఘననూర్నిప్రస్తుతప్రక్రియన్. 34

శా. స్కాందశ్రీకపురాణమందు, నిది శ్రీశైలాపరాశాకథా
బృందబ్రహ్మశివాభివర్ణనము నాఁ బెంపొందె భాగంబు తా
నందంబై నవమంబుగాఁ, దొలి సుమానారీమణింగూర్చి, య
ర్ధేందూదారకిరీటయుక్తుఁ డను న; ట్లిం కల్ల సూతుండు న
స్పందప్రక్రియ శౌనకాదులకు రేపం దెల్పుచేఁదంబునన్. 35

## తీర్థమాహాత్మ్యము.

శా. ఈ తీర్థంబుల, వారతీర్థచయమం దేఁడింట నేస్త్రీలు సం
జాతప్రీతిని వారవారమును స్నానంబుల్ పొన, ర్త్రల్ల వార్
జాతిన్ వంధ్యలె యయ్యు, సంతు గలుగున్; బ్రాంచద్దరిద్రత్వంపుం
భాతిం బొల్చెదరేని, సంపదలతోఁ బర్వంగ నా హార్యగన్. 36

సీ. నలుకోలంబులవారు నలువుగా నీతీర్థ-ముల మున్కలిడఁ, బాపములు నశించు;
పలుకఁబడ్డ తెలుంగు పరఁగంగ, వారతీ-ర్థస్నానములఁ జేయఁ దనర వలయు;
ఆతీర్థములయందు నేతీర్థమునఁ గాని, స్నాన మాఁడంగ మనంబునందు
సంకల్పమూనంగఁ జేసినంతమాత్రనే, రాజత్వసంసిద్ధి యోజఁ గల్గు;

గీ. ఎల్ల తీర్థములను మున్క-లిడెడు వారు;
బ్రహ్మహత్యాద్యఘములేని-బాసి, యిహము

నందు రాజ్యంబును, బరంబు-నందు ముక్తి
గాంతు రెంతయు మోదంబు-గడలుకొనఁగ. 37

ఉ. శాంతియుఁ, దాంతియుం, ధృతియు, సత్య మిఁకన్, శుచి, లోనుగాఁగ న
త్యంతలసద్గుణంబులు గలట్టి మహామహుఁ డైన బ్రాహ్మణున్
సంతసమొప్పఁ గొల్చియును, జయ్యన మేల్కపిలంపు టావు న
త్యంతముఁ జేర్చి యిచ్చునెడ, నయ్యది కోటి మడుంగు లొప్పిదున్. 38

గీ. బ్రాహ్మణుం జంపిన పరమ-పాపి యయినఁ,
బడఁతి జెదిపిన యత్యంత-పాపుఁ డయినఁ,
దల్లిఁ దండ్రిఁ దునిచిన పా-తకియు, నీను
తీర్థముల మున్క లిడిన, ము-క్తిని గడించు. 39

గీ. వారి కిహమున సర్వసం-పదలు గలుగుఁ,
బరమునందును మోక్షంబు-పరిఢవిల్లుఁ,
బుత్రపౌత్రాభివృద్ధియుం, బొరిని జెలఁగు
నెవ్వ రీ తీర్థవరము సే, వింతు రెలమి. 40

సీ. వే యేల? కాంతను, విప్రుని, దల్లిని, దండ్రిఁ జెదిపిన పాతకుఁడె యయినఁ,
బరసతితోఁగాని, వైదికసతితోడఁ-గాని రమించిన కలుషి యయినఁ,
బరమనీచవ్యాధిబాధల నెంతయు, దుర్వ్యథ లందెడు దోషి యయినఁ,
బ్రేతభూతపిశాచబేతాళదుర్గ్రహ-వితతిబాధితుఁ డగు వెకలి యయిన,

గీ. ఈ సుతీర్థంబులందున-నెసక మెసఁగు
భక్తిమై మున్గు మాత్రన-పరమయోగ్యుఁ
డింద్రియవిజేత యయి, ముక్తి-నెనయఁ గాంచు:
నిందు సందియమే యుండ; డిందువదన !! 41

## దుర్గాదేవి.

గీ. భూతబాధ గల్గిన వారు-పోరి నలుపది,
రోజులు జితేంద్రియు లయి, పా-ల్పుగ నిల శయ

నింపుచు, హవిష్యభోక్తలై, యెలమిఁదీర్థ,
ములమునుగుచు దుర్గను గొల్వఁ-బొనర విలయు. 42

ఉ. ఈ ఘనతీర్థరాజముల నెంతయుఁ బోలియు, సర్వదేవతా
శ్లాఘకుఁ బాత్రమైనవి, యిలాతలమందున నెందు నేని లే,
వో ఘనవేణిరో! యిఁకను నుండవు, తొల్లిని లేవు, వీని పు
ణ్యౌఘముతోడ సాటియగు నొయ్యన వీని సుపుణ్యరీతియే. 43

మ. ప్రతితీర్థమ్మున, రేయి రెండు తరులొప్పన్ స్నానముం జేసి, భ
క్తతతిం దానములిచ్చి కొల్చియును సంభావించు నవ్వారికిన్
శితికంఠాంతికలాభమున్, మఱియుఁ దచ్ఛ్రీకంఠసన్మానమున్
గుతుకం బొప్ప ఘటిల్లు సర్వదివిషత్కోటిప్రమాణత్వంబుగన్. 44

గీ. పశ్చిమద్వారతీర్థదీ-వ్యజ్జలముల, మును-కలిడి, శివదర్శనం-బును బొనర్చి,
యును, గదాధరుఁగొల్చి, రు-ద్రోరుపదము, గొల్చి, శ్వేతగిరిని గాంచి, గురుమతి మెఱయి,
శ్రాద్ధముల నిడ, నవి గయా-శ్రాద్ధతుల్య,మగుచుఁ బితరులకున్ ము-క్తి-నలరఁ జేయు. 45

గీ. పితరులఁదలంచు దినములన్-వెలయ నొక్క-,సారి-నలరఁ బంచారామ-సత్ప్రదేశ
దర్శనము సేయ నగు; నవ-తామరసజ, లింగముం గాంచేఁ బాపముల్-తీఱఁ గలవు. 46

## శ్రీజోగుళాంబ.

గీ. అపరదిగ్ద్వారమున నుత్త-రాశయందు,
నిర్ఋతి దిశ మూలగాఁదగి-నెగడు నొండు
బిలము, బ్రహ్మాదిదేవతా-వితతి సేవ్య
మాన మగుచుఁ, గృతిముక్తి-గాన మగుచు. 47

ఉ. ఆ బిలమధ్యమందు సకలాతిశుభాభరణాభిరామయై
శ్రీబహుళాంగియై, కనదరిప్రముఖాయుధయుక్తహస్తయై

జోబలయుక్తి, మంగళవిశోభిమనోజ్ఞ ముఖారవిందయై,
వేఁ బరఁగుక్ సమస్తసురవిశ్రుతసౌఖ్యద, జోగులాంబయుక్. 48

గీ. ఒగిని దద్దేవికిని షోడ-శోపచార
పూజలను జేయఁ, దరతరం-బునను దనరు
వారితోడ ముక్తినిఁ గాంచేఁ-బరఁగు; నమిత
వరద యా జోగులాంబ దా-భవ్యకృపను. 49

## శ్రీబ్రహ్మేశ్వరతీర్థమాహాత్మ్యము.

మ. అలఁ బ్రహ్మేశ్వరతీర్థమం దెవఁడు తాఁ బ్రాణంబులం బాయు? వాఁ
డెలమిం గాంచు శివాంతికాప్తి; యిఁక, బ్రహ్మేశాలయంబందు నె
ద్దొలయుక్ వారలు ముక్తి గాంత్రు, మదిలో నొప్పొందియో? లేకయో?
యలచో నొండొక నాడె యుండినను, మోక్షావాప్తి; ప్రాణేశ్వరీ !! 50

సీ. బ్రహ్మేశ్వరక్షేత్రపదమందు శ్రాద్ధాది-కార్యముల్ నేఁత మోక్షప్రదంబు;
శనివారము త్రయోదశిని శివలింగముఁ-జేసినక్, శివప్రదక్షిణములయినఁ,
జండీప్రదక్షిణసత్కృతియేనియుఁ-బరపినఁ, గైలాసపదవి గలుగు;
బిల్వపత్రములతోఁ జెల్వుగా శంకరుఁ-బూజింప సకలాఘములు దొలంగు;

గీ. స్కాందనుపురాణమందున-గ్రథిత మయిన
శ్రీశుధరపశ్చిమద్వార-రీతి దశమ
భాగకథ యిది వినినను, వ్రాసినను, ని
హామున సుఖముఁ, బరమున మోక్షప్తి గల్గు. 51

## ఆశ్వాసాంతపద్యములు.

మ. తగ బ్రహ్మేశపురాణమందును జతుర్థం బైన యాశ్వాస మి
ద్ది; గడిందిం దగు దోమ. వేంకటసుధీదివ్యత్కృతిశ్రీకమై,
నిగమానీకమహాపురాణచయనిర్ణిద్రస్తవౌఘార్హమై,
నగమంబై, యపవర్గభవ్యపదవీ శోభానుసంధానమై. 52

శా. "పరమేశానకథానకం బయిన యీ ప్రాంచత్కృతిన్, సజ్జనా
దరణీయాకృతిమై కృతిం దగ భవద్ధన్యాంఘ్రికంజాంకిత
స్ఫురణన్ మించెఁ బొనర్చి, నైహికసుఖంబున్ ముక్తియుం గల్గు"నం
చిర వా రీతి నిటుం బొనర్చితి; గరం బింపార నాలింపుఁడీ !! 53

ఉ. నా కృతిలోని నైపుణి ఘనం బగు కీర్తిని దానుగానె బల్
మీకును గూర్చు నంచుఁ గడిమిం దలపోయను; గాని, తద్గతా
స్తోకశివేట్కథాకథనశుంభదనూనసుకారణంబునన్
బ్రాకటకీర్తి మీకు దయివాఱెడు; నేను నిమిత్తమాత్రుఁడన్. 54

మ. కరుణానూనతరంగభంగికయశఃకల్యాణపల్యాణు లౌ
పరమేశుండు భవానియుం దయను, "రావా? పోవ?"యం చోద్ధృతి
స్ఫురణంబల్కఁగ, నింకనుం దమరిలోఁ బ్రాణైక్యముం జెందఁ జే
యరు రహిం బొల్చెడి మీ కృపారసము మా కొప్పిదే? యస్మద్గురుల్ !! 55

మ. దయయున్, ధైర్యము, సత్యమున్, శమమనస్థైర్యంబు, లాడంబరా
మయదూరత్వము, సంపదల్, సిరియు, సమ్యక్కీర్తి మర్యాద లెం
తయు మించున్ భవదీయసత్కృప యఖండం బౌటచేనే కదా ?
నయకారుణ్యనిధుల్! మదీయజనకుల్! నానాసుధీమానితుల్!! 56

## గద్యము.

ఇది.........వేంకటస్వామిగుప్తచే రచింపఁబడిన శ్రీమ
ద్బ్రహ్మేశ్వరపురాణంబునందుఁ జతుర్థాశ్వాసంబు.

శ్రీరామచంద్రాయనమః.
శ్రీజోగుళాంబాబ్రహ్మేశ్వరాభ్యాన్నమః.

# శ్రీ బ్రహ్మేశ్వర పురాణము.

## పంచమాశ్వాసము.

---

క. శ్రీమద్వేంకటరాట్పద, తామరసైకాలయ సుహృ-దయులార! యశ
స్సీమంతిన్యుపలాలన, ధామాంబాజనకులార! తతమతులారా!! 1

వ. అవధరింపుఁ డనంతరంబున, 2

### రసాసిద్ధ చరిత్రము.

ఉ. శంకరుఁ డద్రిజాతఁ గని చేయ్యన నిట్లు వచించె; న మ్మెయిన్
బొంకము మీఱ సూతుఁడు, ప్రపూతుఁడు, బుద్ధిసమేతుఁ డందు ని
శ్శంకత శౌనకాదిమునిసత్తములం గని నైమిశాటవిన్
బింకము గల్గ శ్రీగిరిపవిత్రచరిత్రముఁ దెల్పె నొప్పుగన్. 3

ఉ. శ్రీగిరి పశ్చిమస్థలిని జెన్నలరారు నలంపురంబునం
బాగు చెలంగు దేవళము బాగుఁ దొలిన్ విలసత్సనూఖ్యభూ
భాగవరుండు విఘ్నముల పా లొనరించె" ననంగ, గౌరియున్
వాగమృతంబు లొల్క నల ఫాలవిలోచనుతోడ ని ట్లనున్. 4

శా. "ఓ లోకేశ్వర! ప్రాణనాథ! శివ! శంభో! దేవ! దేవేశ! మీ
రోలిం బల్కిన దేవళంబు నట నేఁ డొప్పారఁగాఁ గొల్పె? వాఁ
డే లా గా నరనేత విఘ్నమిడె? నా కీ లాగు సర్వంబు ను
ద్వేలం బౌ కరుణన్ వినం జలుపుమా! వీనుల్ వినం గోరెడిన్. 5

ఉ. అందులకున్ హరుం డను; "శివా! వినవే! కృతకాలమందు సం
క్రందనుఁ డాదిగాఁ గల సురల్, మఱియున్, ఘన మౌ పురాణముల్

పొందుగఁ బల్కినట్లు మునిముఖ్యుఁడు సూతుఁడు శౌనకాదు లిం
పొందఁగ నైమిశాటవిని సూ క్తిమహత్త్వము మీఱ ని ట్లనెన్. 6

ఉ. ''మేరుయమాశయందుఁ గడిమిం దగు జాహ్నవితీరమందుఁ జె
న్నారు ననీనదీతటిని హార్ద్ర చెలంగెడుఁ గాశి; తత్పుర
శ్రీరమణీయరీతి వివరింప నిలింపమునీంద్రకోటికిన్
వారక యెంతయత్నపడినం దర మంచు వచింపఁ బోలునే ? ? 7

ఉ. ఆరమణీయపట్టణ ముదారధరాతలమందు భర్మప్రా
కారచిరత్నరత్నమయగణ్యసుతోరణమండితంబు నై
సారసపత్త్రినేత్ర జలజాసనవాసవముఖ్యభవ్యబృం
దారక సేవ్యమాన మయి, నల్వ గనున్ విభవాభిరామమై. 8

మ. జటులున్, జోగులు, సిద్ధులున్, గములుగా సద్భక్తిమైఁ బొల్చి, యె
ప్పటికిం గొల్వ, ననల్పవైభవముతో బాగొందెడుం దత్పురో
త్కటనాథుం డగు విశ్వనాథుఁడు, జగన్నాథుం, డుమానాథుఁ డ
చ్చేటఁ గారుణ్యసనాథుఁ డై ప్రమద మెచ్చేం బొల్చు భవ్యాకృతిన్.

ఉ. పొందుగఁ దెల్వినింగలిగి, పూర్ణతరం బగు భక్తిమైఁ జిదా
నందుని విశ్వనాథుని గనం దగి, యర్చన సేయు వార లై
నందిననేవ్యమానమదనాంతక మా శివలోక లాభముం
జెందుదు ; రిద్ది విశ్వపతి సేవఫలంబు, నుతింపశక్యమే ? ? 10

మ. అల గంగాతటినీతటీవిలసితం బౌ వారణాసీ పురిన్
దొలి నొప్పెన్ సుమతీసమాఖ్య, వనితాస్తోమైక రత్నంబు, ని
ష్కలదివ్యత్పతిదేవతామణి, యిఁకం జొప్పించెదఁ దద్భర్త శం
భులసత్పాద నవారవింద మధుపంబో నాఁగ, ధీగణ్యుఁడై. 11

ఉ. ఆ యమలాంగి యా సుమతి యందముఁ జందము ని ట్లఁటంచు నే
న్యాయముతోడ నేనిఁ దరమా ? కవిమండలికిన్ వచింపఁగా

నీ యిలయందు నెంచున? సహీనతదీయ మనోజ్ఞతాహతిన్,
బాయక పుష్పసాయకుని బారికి దేవతలే వెతల్ గనన్ ?? 12

చ. పదియును నెన్మి దేండ్లు దగు ప్రాయముతో నల యింతిమిన్న యొ
ప్పొదవ సమాంగకప్రకలితోత్తమయౌవనయుక్తయై, సమం
చదమలహావభావమహితాదరణప్రచురోపచారస
మ్మదితనిజేశమై, సుగుణమోదితసర్వబుధప్రకాండయై. 13

వ. మఱియును, 14

ఉ. వందనముం బొనర్చు నల పంకజనేత్ర నిరంతరంబు సం
క్రందనముఖ్యదైవతశిరస్థకిరీటసముల్లసన్మణీ
బృందపరిష్క్రియామితపవిత్ర చరిత్రపదారవిందని
వ్యందిమరందతోషిత నతాశ్రితపాళికి, నిందుమౌళికిన్. 15

మ. నిరతం బా సతి కాశికాపురమునం జెన్నొందు శ్రీవిశ్వభ
ర్త రహిం బొల్చు శివాలయంబున కొగిం దా నేఁగి, యెంతేనియున్
సదనూనం బగు బత్తితోడ, బహుధా సన్నుత్యనీకంబునన్
ముద మొందించును విశ్వనాయకు, నమత్పుంజార్థసంధాయకున్. 16

చ. అనుదిన మట్లు లా సతి యుదారసుభక్తిని వచ్చి మ్రొక్కుచుం
డినఁ, గని, విశ్వనాయకుఁడు డెందము నందము నొంది, యొక్క నాఁ
డొనరెడు పేర్మిఁగన్పడియు, "నో తరుణీమణిరో! భవన్మనం
బునఁ గల కోర్కెఁ దెల్పు; నది పొల్పుగఁ దీర్చెద"నంచుఁ బల్కఁగన్. 17

ఉ. అమ్మెయిఁ జెంత నిల్చిన యుమాధిపు, శంకరుఁ గాంచి, యామె పూ
ర్ణ మ్మగు భక్తితోడ నతులం బొనరించి, యఖండముక్తిలా
భ మ్మిడియున్, భవవ్యథలఁ బాఁపెడి శంభుని గాంచి, పుత్రలా
భ మ్మిడుమంచుఁ గోరె, నల పద్మను దమ్మిడి గోరుకైవడిన్. 18

ఉ. అందుకు "వల్లె" యం చేని, పురాంతకుఁడందునె మాటు నొందె; నా
సుందరి "యట్టులే తనకు సూనుఁడు పుట్టెన యేని, దీపముల్

పొందుగ నేతితో నునిచి, పోలు నివేదన లొప్ప పూజ ఖం
డేందుధరుంగుతించి పొనరింతు నటంచు పచించె బ్రొమొక్కగన్. 19

వ. పిమ్మట,

మ. తగ న క్కామిని శంభుపత్న్యపను సంతానంబునుం గాంచుటన్
నుగమోదారచరిత్ర, పుణ్యవతి నాఁ జొప్పొంద నా నొక్క కాం
త గనంబొల్చియు, బుత్రలాభమునకై యుల్లంబునం గోర్కెహె
చ్చేఁగ, న య్యింతి వితంతు వెంతయు నెదన్ సద్భక్తి ర క్తిం దగన్. 20

శా. శ్రీవిశ్వేశ్వరు దేవళంబున కొగిం జేరంగనై, భక్తిమై
సేవం జేల్పె వితంతువామె యపేటన్ జెన్నొందు విశ్వేశ్వరున్
దేవాధీశ్వరు ; నందు కాతఁ డెద నెంతే సంతసం బంది, తా
నా వామేక్షణకుం గనంబడియుఁ, "గాంతా ! నీదు కోర్కె?" మనన్. 21

శా. పౌనఃపున్యముగా నతుల్ నుతులు సల్పంబూని, యా నారి, "శం
భో ! నారాయణ ముఖ్యవందిత ! నమఃపుంజం బిదే చేసెదన్,
నూను న్నా కొకనిం గృపం గొలుపు, మా చో మైవ్రన, నీరాన దీ
పానీకం బిడి, నిన్నుఁ గొల్తు," నని నా యంభోజపత్రాక్షియున్. 22

మ. అది యాలించి, సనాతనుండును, సమస్తామ్నాయగేయాత్ముఁడున్,
త్రిదశాధీశ్వరముఖ్యవంద్యుఁ డగు నా శ్రీకంఠుఁ డింపార, నా
నుదతిం, బుణ్యవతిం బొడంగనియు, "నా శోభన్ రహిం బుత్రకుం
డొదవు న్నీకు" నటంచుఁ బల్కె, యటనే యొందెం దిరోధానమున్ 23

ఉ. ఆపయి న వ్వితంతువున కా యగజాధిపు నంశఁ జేసి ని
ష్పాపుఁడు పుత్రకుం డొ, కఁడు జన్మము నొందె శివాంకధారియై ;
పాపములేశ మిందునను బర్వదు ; కాని, పురంబునంతటన్
"బాపినిరా" యటంచు నపవాదము మించె దదంబుజాక్షికిన్. 24

ఉ. "రండల మేఁటి, పుణ్యవతి ఱంకుఁదనం బొనరింపఁ బుట్టెఁ బు
త్రుం డితఁ"డంచుఁ, దత్సుతుని దోరముగా జను లాడఁగాఁ, గడున్

"రండ సుతుం" డఁటం జేసెడి నామము వానికి రూఢి యయ్యెఁ, దే
వుం డొకరుండు నామెయెడను నుల్లములం గను వారు నిక్కమున్. 25

శా. వాఁ డా కట్టి పదేండ్ల వాఁ డయి, మతిం బా గొంది, యం దందునన్
"వీఁ డొఁ బూర్వసువాసినీసుతుఁ"డఁటన్ విఖ్యాతి త న్నొంద నా
జాడం గాంచి, కరంబు గుంది, జననీసాన్నిధ్యముం జేరి, బల్
గాఢంబైన విషాదవేదనను వక్కాణించె నక్కాంతకున్. 26

ఉ. "అమ్మరొ! నన్ను "ముండకొడు"కంచు వచించెద రెల్ల వారు గ్రా
మమ్మున; నాకు నద్ది చెడు మాఁట యఁటంచును నేఁటిదాఁక న
ర్థ మ్మెద నంద లే; దటులఁ దజ్జను లాడెడి నిందకెల్లఁ బా
త్రమ్మను నేను గాఁ దగు కతమ్ము వచింపఁ గదమ్మ! మ్రొక్కెదన్." 27

వ. అనవుడు. 28

చ. తొడరఁగ నవ్వు డా సతి సుతుం గని పల్కెఁ; "కుమారకా! యొగిం
బుడమిని నీవు పుట్టు నల మూలము శంకరు చెంత కేఁగియే
యడుగుము? యాతఁ డే కల యుదంతము నంతయుఁ దెల్పు"; నాఁగ, నా
బుడుతఁడు శంభు సన్నిధికిఁ బోయి, నతుల్ నుతులుం బొనర్చినన్. 29

చ. శివుఁడు కనంబడంగ, నల శ్రీగళుఁ గాంచియుఁ, గజ్జ మ్రొక్కియున్
మివులఁగ సన్నుతించి, "కడిమిం జననీమతి మేర కిందు నీ
దవు దరిఁ జేరినాఁడను; భవా! దయ నాదు భవంబురీతి బల్
నువిశదమైన పేర్మి దగు చొప్పునఁ జెప్పవె; నీకు మ్రొక్కెదన్." 30

చ. అనవుఁడు, శంకరుండు దరహాసమనోజ్ఞముఖారవిందుఁడై
తనయునిఁ గాంచి పల్కె; "బుడుతా! జనకుండను నీకు; నాదు నం
శను జనియించినాఁడవు; రసన్ "రససిద్ధుఁ" డఁ టన్న పేరు నీ
కెనయును; నాదు కోర్కెయు రహించెడు నొక్కటి; నీవు దానినిన్
బనిగొని తీర్పఁగా వలయుఁ బాయక, పాపఁడ వైన యందుకున్." 31

వ. అనవుడు, 32

గీ. అట రసాసిద్ధుఁ డభవు వ-ల్కా-లకించి
"యేమి యాజ్ఞ ? " యని యడుగ, నీశ్వరుండు
పలికె బాలుని గాంచియుఁ - బ్రమరమధుర
జలదగంభీరదివ్యభా-షణముతోడ. 33

సీ. "ఈ వారణాశికి నెనయ దక్షిణమంగు
శ్రీశైలమధరంబు చెలఁగుచుండు ;
దాని పశ్చిమదిశాద్వారంబునందు బ్ర
హ్మేశుండు పాల్చెడి నింపుమీఱ ;
నీ వటకు వెడలియు, నెటిని బ్రహ్మేశ్వరు
నకును దేవాలయం బొకఁ డపూర్వ
తరనైపుణీశోభితమ్ముగా నిర్మింపఁ
జేయుమా ! "యని పల్క-, శివుని గాంచి,

గీ. కుత్తి కేలొగ్గిడ్చి, "తండ్రి! నా-కు నిటువంటి
యాన తిడినావు ; ధనము లే-నట్టివాఁడ!
బాలకుఁడ ; నాకు నదిసాధ్యపడునె ?" యనఁగ
దరహసితముఃఖుం డగుచు శం-కరుఁడు పలికె. 34

మ. "అట, బ్రహ్మేశుఁడు, జోగులాంబికయు, విఘ్నాధీశుఁడుఁ భైరవుం
డెటనుం గీర్తిని గన్న పార్వతియుఁ, బర్తింతు, రమ్మటి స్నీవు వే
నటకుం బోయియుఁ, వారికి న్నతులఁ జేయన్, వారు ప్రేమైకలం
పటహృద్రీతి రసానుకూలతనుగొల్పం బోల్తు, రెంతేనియున్. 35

ఉ. నీ వట కేఁగి వేఁడ, నల నిత్యులదైవత జాల మెంతయున్
భావుక మైన పేర్మిఁ గన, భవ్యతరం బగు శక్తి యప్డు నీ
కావహిలున్ ; దదాదృతిని నాదటఁ గార్యముఁ దీర్తు వీవు ; పా
మ్మా ! వహి నాదు మాట వినుమా ! యనుమానము మాని, పూనుమా ! ! 36

## పుణ్యవతి నీటిచే దీపములతో విశ్వనాథుని బూజించుట.

మ. అని పున్నాగతరుస్థలస్థుఁడు శివుం డంతర్హితుం డయ్యె; నం
తను, నద్దేవుని యానతిన్ శిరమునం దాఁ దాల్చి, గేహంబు సే
రి, నెఱిన్ దల్లికి నల్లరీతి యన, నీరేజాక్షి య క్కాంత యా
ప్తనుమానింపని భక్తి కి యొప్పు, గిరికన్యానాథ సంప్రీతిగన్. 37

గీ. నీటితో వేయి దీపముల్ – నిలిపి, యిసుక
నిడియె నైవేద్యముగ; నల – నీరు నూనె
యయ్యె, నిసుక శర్కర యయ్యె, నామెను దొలి
నవ్వి నట్టిరు మనిని జింతను గనంగ. 38

మ. ఇటు లా కామినిచే సమర్చనము నెంతే శంకరుం డొందు పి
మ్మట, బాలుండు హరార్చనానిరతుఁ డై మవ్వంబుగా నెమ్మదిన్
నిటలాక్షానుమతిన్ వహించి, యది పోణిం దీర్చ, యామ్యస్థలీ
పటలాంచన్ముఖుఁ డై చనెన్ బెరిమమై బ్రహ్మేశ్వరుం గాంచఁగన్. 39

వ. ఆ రసాసిద్ధుండు బాలుం డటు సనిచేని, 40

మ. పరఁగం జేరె సురాసురప్రణుతమున్, బ్రహ్మేశ్వరావాసమున్
బరమామ్నాయని కాయగేయమును, విద్వన్మండలీమండనా
దరమున్, సంసరణాబ్ధితారణగుణోద్యత్తుంగభద్రామహా
సరిదంచత్తటమున్, మదిం జెలఁగు దోసంబుల్ ప్రశాంతిం గనన్. 41

మ. ఇది శ్రీస్కందపురాణమందుఁ గల శ్రీపృథ్వీధ్రపూర్వేతరా
శఁ దగం దెల్పు సుభాగమందుఁగడు నంచద్రీతి నొప్పారెడున్
ఒనొకొండో దగు పాలు; వేంకనను నే వ్రాయన్, రసాసిద్ధ మం
చుఁ దగన్ దెల్గునను ప్రబంధకవితాశుంభత్ప్రకారంబునన్. 42

మ. ఇటు లా బాలుఁడు శ్రీగిరీంద్రవరుణాశాంచన్మహాక్షేత్ర మె
క్కటిపైఁ జేరియు, బ్రహ్మశంకరుని, విఘ్నాధీశ్వరున్, జోగుళా

పటుశక్తిఁ, గిరిజాత, భైరవుని, సద్భక్తిం దపోరీతియు
త్కటతం దన్పి, నతుల్ నుతుల్ సలిపి తద్భవ్యాంతికం బందునన్. 43

## రసాసిద్ధుఁడు రసార్థమై దేవతలను వేఁడుట.

సీ. "బ్రహ్మాదివంద్యాయ, బ్రహ్మేశ్వరాయ, దే-వాదిదేవాయ, తుభ్యన్నమోఽస్తు;
విఘ్నేశ్వరాయ, పాపఘ్నాయ, కరిరాజ-వదన పద్మాయ-తుభ్యన్నమోఽస్తు;
అఖిలాండకోటినియంత్ర్యై, మహాజోగు-లాంబికాయై చతుభ్యన్నమోఽస్తు;
అగరాజకన్యకాయై, దేవపతిముఖ్య-వందితాయై చ తుభ్యన్నమోఽస్తు;
గీ. భైరవాయ, దిగంబరా, యారవాతి
భయగతారిబృందాయ తు-భ్యన్నమోఽస్తు
శ్రీకుధరయామ్యభాగవ-ర్తిష్ణు భవ్య
దేవతాభ్యో నమో" యంచు-నా విమలుఁడు. 44

చ. కరముల మోడ్చి నిల్చి, సదఖండతరం భగు భక్తితోడ, నో
నిరుపములార! కాశిపురి నిస్తులరీతిని విశ్వనాయకుం
డోరిమ వచించినట్టు లిట నొయ్యన దేవళముఙ్ రచింపఁ జే
య రసము నిం; డొసంగుఁడెడ, నమ్మి యిఁ జేల్పెదమీ మహోఽఽద్కృతిన్.

## రసలబ్ధి.

సీ. అనవుడున్ వారు మహాహ్లాద మొంది, ర-సాసిద్ధునకును రసంబు నిడిరి;
తలనుండి బ్రహ్మేశుఁ, డొలయంగ నాభినుం-డి గణేశుఁ, డెడమ కాల గిరి జయును,
మోముఁ దామరనుండి మొగి జోగులాంబయు, వడిఁ గుడి తొడనుండి భైరవుండు,
సరగ నీ రీతిరసంబు రసాసిద్ధు-నకు నల దేవతల్ నలువుగ నిడ,
గీ. తద్రసం బెల్ల నొక్క పా-త్రమున నిడియు,
దాన శివగేహము మహోన్నతముగఁ గొల్పఁ

బూని, నెమ్మది నెంతయుం-బూన్కి చెలఁగఁ
గాశికావిశ్వనాయకా-జ్ఞాప్రకృతిని. 46

## దేవాలయనిర్మాణములు.

సీ. చతురాననాంబుజాసనశివలింగగే-హము, నాల నవపద్మజాగజేశ
లింగాలయములు, లలితమెయిఁగామాక్షి గే-హమును, నేకామ్రేశు నాలయంబు,
జోగులాంబాదేవి చోప్పొందు నిలయంబు, వీరభద్రాలయశ్రీరుచియును,
దేవతాద్రోణ్యాదితీర్థస్థలాలంక-రణవిధానంబులు రంగుమీఱ,

గీ. మఱియు, భైరవదుర్గా వి-మలతలములు,
కలకలేశ్వర క్షేత్రంబుఁ - గ్రాలఁ జేయు
నంత, నా రసాసిద్ధున-కంత మంతి
క మయి, విన నయ్యె నప్పు డా-కాశవాణి. 47

## ఆకాశవాణి.

గీ. "అందుమా! శంకరునితోడ - నైక్య మీ వ
హో! రసాసిద్ధుఁడా! యని-సారభటిని
నింగి వచియించె నప్పు డ-నేకములుగ
నవశకునముల్ గలిగె భూన-భోఽంతరముల. 48

ఉ. చుక్కలు రాలె, నగ్గి గొని సూఁడియు మాడిన భంగినిం బొగల్
దిక్కులయందుఁ గ్రమ్మెఁ, గడుఁ దీండ్రముగా నఱచెన్ ధరాస్థలిన్
నక్కలు మున్నుగాఁ, జెదలుసందుననుండియు నల్ల వాక్కు స
మ్యక్కమనీయబుద్ధి యగు నాతనికిన్ విన వచ్చినంతటన్. 49

చ. ఇది వచియించి, సూతుఁడు మునీశ్వరకోటిని గాంచి యిట్లనున్
"సదమల బుద్ధులార! యిట జేర్చిన రీతిని వింటి రొక్కఁ, డిం
కఁదనరు నన్య, మయ్యది వినం దగు" నన్న, మునీంద్రు లెంతయున్
ముదమున నాలకింపఁగను బూనిరి, సూతుఁడు వారి కిట్లనున్. 50

## విలసదాఖ్యనృపాలుని చరిత్రము.

గీ. ద్వాపరయుగాంతమున నొక-ధరణిధవుఁడు
విలసదాఖ్యుం డిలను ధర్మ-విమలనీతి
నేలుచుండెను ; గాలక-ర్మద్ధరీతి
నతఁడు ధర్మదూరుఁ డయి దు-ర్యశము నందె. 51

## విలసన్నృపాలరసాసిద్ధుల యుద్ధము.

మ. పొరి నా భూపుఁ డమాత్యబృందములతోఁ బోల్పార నోజించియున్
ధరణిన్ సంగరయాత్రకై తరలె నుద్యద్విక్రమాటోపసం
భరితస్యందనదంతిఘోటకభట వ్రాతైకభీమంబుగా,
నురుతద్ధూళి నకాలసాంధ్యరుచితో వ్యోమంబు రంగారఁగన్. 52

ఉ. ఎందఱినో యరాతుల దినేంద్రకుమారుని చెంతఁజేర్చె ; మ
ధ్యందినసూర్యమానిత పరాక్రమశాలుర నెంత మందినో
మ్రందఁగఁ జేసె ; నేనుఁగుల రం గడఁగించెఁ , దురంగమంబులం
డిందఁ బొనర్చె ; దుల్చెను గడింది వడిం దగ స్యందనంబులన్. 53

మ. ఇటులన్ సంగరరంగరంగదతిభీమేద్ధప్రభావస్ఫు
త్పటువోర్దండపరాక్రముండు, విలసద్ధారుణ్యాధీశుండు, మి
క్కుటమౌ గర్వము డెందమం దొలయఁగా, ఘోరాస్త్రశస్త్రాళితో
దిటమై మార్కొన నేఁగె, శంకరనమద్ధీరున్, రసాసిద్ధు, ను
త్కటమానీడ్యసుధీసమృద్ధు, శుభకృత్కార్యాతిసంబద్ధునిన్. 54

గీ. అల రసాసిద్ధు మహిమచే-నల్ల చోటు
తొలిని నిర్జనమై యుండి-యు, లలి నిపుడు
సమదచతురంగబలభరి-త మయి తోఁచె
విలసదాఖ్యునితోఁ బోరు-సలుపుకొఱకు. 55

చ. హరులు హరుల్, భటుల్ భటులు, హస్తులు హస్తులుఁ, దేర్లుఁ దేరులున్
బోరిని జెలంగి, మార్కొనుచుఁ, బూర్ణపరాక్రమపుం బ్రదర్శనం
బోరిమను జేయుచున్ విలసదుర్వితలేంద్రరససిద్ధపక్షముల్
పరఁగఁగఁ బోరుటం దగె నభంగురసంగరరంగమందునన్. 56

శా. దైవోదారకృపారసోదితచమూతండం బఖండంబుగా
సేవం జేసియుఁ దోడు నూపఁగ, రసాసిద్ధుండు శ్రీగర్వదు
ర్భావాఢ్యున్ విలసన్నృపాలుఁ జిటికల్ పర్వించు మాత్రంబులో
శివిర్ సర్వము దుల్లఁ జేసెఁ దన ధాటిన్ మేటు లగ్గింపఁగన్. 57

సీ. కొండల పిండు నా దండిగా నుండిన - కుండాలతండంబు గండడంగ,
ననిలానిలాహార హరజవాజన్యవహారి-హారినికాయం బెల్ల హరువు చెడఁగ,
ప్రావృట్పయోధరభంగి నెసంగు శ-తాంగసంఘం బెల్ల నంగుఁ బాయ,
ఖండితాంగకపాదకరమూలకరశిరః-కంఠవక్షుల్ భటుల్ కరము బెగడ,

గీ. భయదమై, సర్వథా౽తిబీ-భత్సమగుచు, శాకినీ ముఖాభీలపి-శాచదత్త
షడ్రసాన్నమై, యట్టహా-సద్విలయక, శింజెలంగె నా సంగ్రామ-రంగమపుడు

మత్తకోకిల. ఈ రహిన్ విలసన్నృపాలుని యింపు సొంపు సమస్తమున్
సారుఁ డా రసిద్ధు విక్రమశక్తి ముందఱ డీల్పడెన్ ;
"భూరిసత్కృతిఁ దాఁ బొనర్పఁగఁ బూన, నేమిది?" యం చొగిన్
సారె కా రససిద్ధుఁ డెంతయు స్వాంతమందున నెంచియున్. 59

శా. ఈ గాఢార్తికరాజవంజవభయం బెంతే మనం బేచఁగా,
వాగీశాదికలోభనీయ భవదభ్యంచన్మహాసేవకై
రాఁగా, నిందునుగూడ విఘ్నము లిటుల్ రా నయ్యె ; విశ్వేశ్వరా !
దాగం బోయిన చోట దయ్యముల బాధల్ గల్గు చెందంబునన్. 60

మ. విలసన్నామకుఁ డీ నృపుండు "నృపుఁ"డన్ పే ర్దాల్చియుం గూడ, ని
య్యిల రక్షింపఁగఁబూన, కార్తి కర, మెంతేఁ బాపభూయిష్ఠ మా

లలి డెందంబునఁ బూని, నాపయికి సంగ్రామార్థి యై వచ్చె, లోఁ
దలపం డయ్యెను నే భవత్పదనతోద్యద్బుద్ధి నం చేసియున్. 61

క. వచ్చెను దన్నెఱుఁ, డనిలో, నొచ్చెను నాచేత ; నీఘనోద్రేకమునన్
విచ్చెను , నా మది మఱియున్, వచ్చెను నీ కృతిని; దండ్రి! పరమగురుమణీ!!

చ. కువలయనాథచూడ! జనకుండవు నీ వయి యుండ నాకు, ని
క్కువలయనాథమాత్రుఁడు దిగుల్ గలిగింపఁగఁ జాలు నొక్కొ ? నా
కు వలయు నర్థ మేదియును గుంభినియందును గాన రాదు ; భో
గివలయ ! తావకైక్యమును గీల్కొలుపం గదె ? నీకు మ్రొక్కెదన్, 63

మ. సకలార్థంబుల నీయఁగా నగు భవత్సంప్రీతిలాభంబు నా
కకళంకంబుగ నుండ, నన్యఫలమేనాత్మస్థలింగోరనే
టికి? శంభో! యఖిలాండకోటివిభు! తండ్రీ! యెట్లు నీనుండి పు
ట్టుకనుం గొల్చితి, వట్లు లోఁగొనుము! మోడ్పుం గేలు సంధించెదన్. 64

శా. నా పుణ్యంబున నింద్రముఖ్యదివిషన్నాథాతిసంలోభనీ
యాపారోరుశుభాభిరామభవదీయాంచత్కృపాలాభ మే
నేఁ బారం గని నాఁడ, దానిఁ దగినట్లేవాడుకో కున్న, నా
సాపత్న్యంబునఁ బొల్చు మూఢులను గాంచేన్ వచ్చునే యొందునన్?? 65

సీ. అంచు వేడు కొడుకు నారాటముల నెల్ల-నాలకించియుఁ, నల్ల యాలవాయి
దయ్యంబు బమ్మశివయ్య నెయ్యము డెంద-మందు నందం బొంద, నప్పు, డార
సాసిద్ధు ముంగలన్ వాసిమైఁ గనుపట్టి-నెన రెంతయేనియు నిగుడ, నంగ
సాఁచి, పేరిమి కుఱ్ఱఁజెయ్యనఁ దిగిచియుఁ, నంకెకుఁ దార్చియు,నదమికొనియు

గీ. వెలుఁగు వెలుఁగునం జేర్చిన-లలిని జెలఁగ
నా రసాసిద్ధుఁ దనలోన-నక్కె చేర్చి
కొనియు, నొకటి నొందించె మే-లెనయ, వేల్పు
మూఁక లెల్ల "జే" యంచును-బొగడుచుండ. 66

ఉ. ఆమ్మెయి బ్రహ్మశంకరుని యైక్యము నా రససిద్ధుఁ డొంద, ధై
ర్యమ్మునఁ గ్రుంగియుక్, విలసదాఖ్యుఁడు తా రససిద్ధుఁ గాంచి, యు
ద్ధ మ్మొనరించు పూన్కిని నుదారజవంబున సిద్ధు వెన్కనే
యమ్మహితాభవాలయము నంతరమందునఁ జొచ్చి, యప్పుడుక్. 67

సీ. గర్భగుడియుఁ, గవాటాదికములు, సందు
గొందు లన్నియుఁ, దెగఁ గాంచి, యందుఁ దన వి
రోధిఁ గాంచే లేక, పరాభ-వాధరిక్ర
తాశయుండయి, యప్పు డా-భువనవిభుఁడు. 68

గీ. నిండుకొని మెండుకొని యుండు - దండుతోడ
"నొక్కడై రాగి నా చివ్వ - నొంచె" నంచు
నాత్మ నవమానభరముతో-నరిగె నింటి
కప్పతితముఖ్యుఁడు విలస-దాఖ్యుఁ డపుడు. 69

ఉ. పాపయుతుండు తాఁ జేలుపుఁ పాపనికాయపుఁ బంట గాఁగఁ బ్రే
రేపునుదైవ మీయఁగఁ, బోరిం భయదాఽరిజితత్వ మొంది, ను
ర్వీపటురాజ్య మెల్లను హరింపఁబడంగ, ధనమ్ము వోయి, య
త్యాపదనొంది, కాననమునందు వసింపఁగఁ బోయె నొంటిమై. 70

ఉ. ఆలియు వీడె నా నృపుని, నాత్మజులుం జేని, రెంతయేని ను
ద్వేలత నంగసంగతవిభీషణసేనలు రూపుమాసె, ని
ష్ఠాలిగ నొక్క భృత్యుఁడు మహోన్నతభక్తుఁడు వెంట రాఁగ, దు
శ్శీలుఁడు వాఁడు కానను వసించెడుఁ దా విలసన్నృపుం డొగిక్. 71

ఉ. కింకరయుక్తుఁడై ఐని నొగి న్నివసింపుచు, నా నృపుండు లో
డొంకును గొంకు నూనక, కడుంగడు దుష్టతతో, సతంబు, ని
శ్శంకత మద్యమాంసములు చేయ్యన భృత్యునిఁ దేరఁజేసియుం
బింకము మీఱ మెక్కుచును బెక్కువ నిక్కుచు నుండె నోలిమై. 72

మ. ఒక నాఁ డాతనికై పొలంగనుచుఁ, దా నొక్కచోటనుం గాంచె సే
వకుఁ, డుద్యత్తృణఖాదనోత్సుకను, దీవ్యత్కాంతిమన్మాంసలాం
గక, నత్యంతమనోజ్ఞమూర్తియుతన్, వాయూల్లసద్వేగ, న
త్యకలంకామలతామనోహరయు,నై హార్వొందు నేణీమణిన్. 73

శా. దానిం గాంచియు, రాజభుక్తి కది తద్దం బొల్చునం చెంచి, వే
గానన్ వాఁ డురిత్రాఁడు దానిపయికిం జో నేయఁగాఁ గాంచి, యా
యేణీరత్నము విస్మయాస్పదముగా నిట్లంచు వాక్రుచ్చె న
వ్వానింగాంచి, మనోజ్ఞమానవవచోవ్యాపారమేఁపాఱఁగన్. 74

శా. అన్నా! భృత్యుఁడ వీవు; సామిపనికై యాత్మం దగం బూని, యి
ట్లన్నన్నుం జేదుపంగఁ బూనితివి! యిప్డు న్నాదు విజ్ఞాపనం
బు న్నీ వొక్కటి యాలకింపవలె, నీ ప్రొద్దే తగం బిడ్డలం
గన్నా, నే నల శాబకంబులకు స్తన్యం బిచ్చి యేతెంచెదన్. 75

శా. ఆలస్యం బొనరింప! నా దయిన వాక్యం బాలకింపం దగున్;
మేలుం దీనిఁ బొనర్పవన్న! "యని నెమ్మిన్ లేఁడియున్ వేఁడఁగా
నా లాగున్ మది నమ్మ లే దతఁడు; తద్వ్యాపారముం గాంచి, తా
నా లేఁ డిట్లనె స్వీయవాక్యముల, నొయ్యన్ వాఁ డెద న్నమ్మఁగన్."76

మ. "వినవా? తోఁపటి కింద ఐత్తు, నటు రీవిం జేయనేనిన్, దొలిన్
ఘనపాపుం, డపకీర్తి మూర్తి, విలసన్నామావనీంద్రుండు దు
ష్ఫలముందేనిని జెందునో? యదె ననుం బ్రాపించు, నిద్దాననే
నెలమి న్నీ వెద నన్ను నమ్మవలె; నోయీ! భృత్యుఁడా! యెంతయున్.77

శా. ఈ యానన్ విని యల్ల భృత్యుఁ డపు డయ్యేణీమణిం గాంచి, "లేఁ
డీ! యిత్సేరియు, బిడ్డలం దనిపి రమ్మా!" యంచు వాక్రుచ్చి, లో
నా యానం గుటియించి, యందుఁ గల స్వీయాధీశు పేరెంచి, యెం
తో యాశ్చర్యముతోడ వాఁడు సనె స్వీయోర్వీశ్వరుం జేఁరగన్. 78

ఉ. చేరియు, రాజుఁ గాంచి, నతి చేసియుఁ బల్కె:— "నృపాలచంద్రమా!
మీఱిన వింత నొందు గడిమిన్ విన, గల్గితి నేఁడు; నీదు మేల్
కీరితి బండి నున్న, యపకీర్తి ప్రపూర్ణము, పాపమెంతయున్
బారములేక యున్నదని బాధముగాఁగ నెఱిఁగి వచ్చితిన్. 79

గీ. తిండికై మృగములఁ బట్టఁ-దిరుగుచుండి,
యొక్క లేఁడిని గాంచియు, నురిని బన్నఁ
బోతి; నంత నయ్యదియు "నీ- ప్రొద్దె బిడ్డ
లఁ బ్రసవించితి, వానికి-లలిని బాల
నిచ్చి తేఁపు వచ్చెద"నని-నచ్చెఁ బల్కె,
యందుకుం దప్పిన, విలస-దాఖ్యనృపుఁడు
చెందిన దోసంగు నేనును-జెందెద" నని
యొట్టు వెట్టికొనియె; నంత-నొగిని నేను
దానికిం గడు విడి వచ్చి-నాఁడ; తేఁడ!! 80

మ. అన, ఘోరాఽశనిపాతభూపతితపన్యాఽగంబు చేందంబునం
జనవర్యుం డిలపైన వ్రాలి, తెలివిం జెయ్యం బోడంగాంచి, నె
మ్మనముం దెంతయు వంత నొందియును, నామాద్యన్మహాఘంబు నిం
తని వల్కం దర మానె? భృత్యవచనం బావంత లెక్కించినన్. 81

మ. హరిణీరత్నమ దేదో? యద్ది యను నట్లా నా దోసం గేదో? దు
దుఃసారితం బయ్యది యెంత యున్నొ? యదియుం దోరింప నే యుక్తిపా
ల్పరునో? యెప్పుడు తెల్లవాఱు? నెపుడుం బాఱంగ నా కాన? కె
ష్టర లే కేను బునీతభావమును జెన్నారం గనం జెల్లునో?? 82

ఉ. కానకు నేఁగఁ గావలయుఁ గంజహితుం డుదయించు నంతటన్;
గానఁగఁ జెల్లునమ్మృగిని; గాంచి, మదీయమహాఘ మేదియో
దాని వచోగతిం దెలియఁ దగ్గ; దెఱింగిన యంత, నా యఘం
బే నిరతిం దరింప నగు నెంతయుఁ జేకుఁ గనుంగొనన్ వలెన్. 83

చ. అని, నిమిసంబు వర్షముగ నా నృపుఁ డా నిసి దాఁటఁ జేసియున్
దినమణి పుట్టినంత, సముదీర్ణజవంబునఁ గాల్యకృత్యముల్
వొనరిచి, భృత్యు వెంటఁ గొనిపోయియు, నిన్నఁటి చెంకిఁ జేరునం
తను జేనుదెంచె నమ్మృగి యథార్థవచో విలసత్ప్రకారయై. 84

ఉ. వచ్చియు, రాజభృత్యుఁ గని, "పావనుఁడా! ననుఁ జంపి, నా పొలన్
జెచ్చెరఁ గొంచుఁబోయి, నృపశేఖరు భక్షణ సేయఁ జేయుమా !
మచ్చిక మీఱఁగా"ననుడు, మానవనాథుఁడు లేడి చెంతకున్
హెచ్చిన పేర్మి వచ్చియు, "మృగీ! విను! నావలు!" కంచుఁ బల్కెయున్.

ఉ. భావిపురాతనాద్యతనభావములం గనఁ జాలు దాన వై,
వావిరి తెల్వితోడఁ బొలుపారెడి నీకు నమస్కరించినన్,
శ్రీ వెలయున్, మృగమణి! పోరిన్ ; విలసన్నరనేత నేను ; నా
దై వెస నొప్పు దోసము సుదార మఁటంచును బల్కినావు గా
దా ? వహి సద్దోసంగెసెయొ ? దానికి నిష్కృతి యేదొ ? తెల్పుమా !
నీ వచనంబు సేవకుఁడు నిన్న వచించిన దాది, చాల దుః
ఖావిలమయ్యె డెందము; మహాఘభయంబునఁ జేసి యెంతయున్
బోవఁ గదే సుపుణ్యమునఁ, బోలఁగ నా కిది మేలుఁ గూర్చియున్?? 86

శా. "ఈతండే విలసన్నృపాలుఁ" డని యా య్యేణీవతంసంబు, "భూ
నేతన్, బాపిని వానిఁ జూడఁ గడుఁ బాపం"బంచు, నన్యాశమో
హై తా నిల్వఁగ, రాజు న ద్దెసకు నొయ్యన్ వచ్చె; న య్యేణి మో
దాతాత్పర్యముతోడ మాఱు దెస కాస్యం బూన్పఁగా, భూపుఁ డ
క్లై తా నా దెస కేఁగె, లో వినుఁగు నింతేనిం గనం డా క్రియన్. 87

వ. అట్లా జనవరుం డొనరించి, యామృగిముందఱ సాగిలపడి నమస్కరించి,

ఉ. "పాతకుఁడన్, ఖలాత్మకుఁడ, బాలిశుఁడన్; మఱి నా మనోవ్యథా
గీతిని నిష్ఠె తెల్పితిఁ; బోరిన్ మదఘుం బది తెల్పి, దానికే

దో తరణప్రకారము ? మహోన్నత సత్కృపమై వచింపవే !
నా తెలుఁగుం జనంబులఁ బెనంపఁగదే ? మృగి ! నీకు మ్రొక్కెదన్. 89

చ. అనవుడు రాజుఁ గాంచి, హరిణాంగన వల్కు :—మహాఘవర్తనం
బునఁ దగు దాన నే నగుటఁ, బూర్ణతరాఘుఁడవుగ్, శివాలయో
ల్బణతర నిర్మితిన్ సిలుగుఁ గ్రాలఁగఁ జేసిన నిన్నుఁ గాంచేఁగా
నొనరెఁ గదా ? దోసం ; గిది యెటో తరియించు నుపాయ మారయన్ ??

ఉ. పాపము సల్పు నీకు, నల పాపిని నిన్నుఁ గనంగ నాకునుం
బాపపులోక మెందు టది పర్వెడు నిద్దతి ; కి ష్టపాయమో
భూపతి ! నిన్నుఁ బోలుమను బొల్చెడి బొమ్మ నొకండు, నింక, నా
రూపున నొక్క బొమ్మఁ గడుఁ బ్రోదిని గొల్పుము జేఁపు డాలపైన్. 91

శా. "దేవద్రోణి" యఁ టన్న తీర్థ మది యెంతేఁదా నలంపూర్పురిన్
భావంగమ్యముగా నెఁగు ; నల చెంతం గంబముల్ సల్పి బల్
రీవి న్నిల్పియు, ద్వారబంధమును గొల్పింపఁగఁ, బార్శ్వంబులన్
దావెల్గన్ ప్రతిమాద్వయం బరుగు యాత్రాకాలంబునం, దంతదా
కే వేవో జనులందుచుందువు, కడున్ హేయక్రియల్ సల్పుచున్ 92

సీ. పయి జని న్నీ వొక భల్లూకమ వగుదు ;
వాపయిఁ బల్లివి నగుదు ; వింకను
గ్రద్దవై పుట్టెదు, క్రమముగాఁ గుక్కవు
నగు ; ది ట్టిరువది యెం డగు జననము
నందుఁ గిరాతుండ వై పుట్టి, యొక నాఁడు
మృగయకై యడవికి నేఁగి, యవేట
జంతువులం జంపి, చేర్వ్యాన నల మాంస
మును గొని, రాత్రిగాఁ బొనర, నొక్క

గీ. జీర్ణశివగేహముం జేరి, చెలఁగ దాని
లోన సమ్మార్జనము సల్పి, ప్రోది దీప

మిడిరియు, దెలవారు పఱ కట - నెసఁగి, వెళ్లు
చుండ, నొక వ్యాఘ్రము గొను నీ - యనుదు లపుడు 93

ఉ. ముందటి రేయి, శైవగృహముం జేని, దానిని బా గొనర్చి, యం
దుండియు దీపము న్నిలిపి, తోఁగల మాంసము నల్ల శూలికిన్
ముందఱ నుంచి, మేల్కనియుఁ బోవుట, శంభుప్రదోషజాగరా
స్పందపమర్చన క్రమలసత్కృతి యై, యటుపైని జన్మలోన్. 94

గీ. నీ వొక నృపాలకులమున - నెటఁ బొడమువు,
వార్య ధర్మవర్తనమునన్ - హరువు గాఁతు,
పటుపయినినుండి మోక్షంబు-నందఁ గాంతు,
విపుడు వెళ్లి నా ప ల్కా-స-రింపు మొగిని. 95

క. అని మాయ మర్త్యో నచ్చెట-ఘనవిస్మయ మొదవ మృగియు,క్ష్మాపతి యపు డో
య్యాన కాఁగంబంబుల పైఁ, దన రూపమ్మ మృగిరూపుఁ దనరించి, వెసన్.

శా. దేవద్రోహికిఁ జెంతఁ దచ్ఛిలల వర్తిల్లంబొనర్పించి మేల్
శివిం ద్వారము గొల్పె; లేఁడి యనినట్లే భూవరుం డండె నా
నావిన్యాసము లైన జన్మముల, నంతంబందు బోయండు నై
తా వెల్గొందియు, నొక్క నాఁడు మృగయార్థంబై వనింజేరియున్. 97

ఉ. ఈటె, లురుల్, వలల్, జిగురు, లెంతయు వాఁడి, మృగంబులన్ గడున్
బోటుతనంబునం దునిమి, పొల్పుగ వాని కళేబరంబులన్
మూఁటగఁగట్టియుం, దనదు మూఁపునఁ గైకొని పోవుచుండె నా
యాటవికుం డిఁకం దనకు నానుక మో ? సిలుగో? యెఱుంగకే. 98

వ. అంత, 99

సీ. వనమునందును వనస్పతు లెల్ల నీరెండ-చేత బంగారంపుఁ జెల్వు నంద,
పగటి యెండకును, మాపటి సీతునకు సంధి-సమయ మై శీతోష్ణసమత దనర,

పరిసరసరసీజ సరసీరుహాకషాయ - గంధయుగ్వాతార్భకము లెసంగ,
ఆనీయమాననానాహారభరచంచు - శాఖిగంబులు గూండ్లకడకుఁ బాఱ,

గీ. అంత కంతకు నపరది-శాంగనామ
ణీపటాంచేలావృతుఁడుగా - నోఁపె ననఁగ
నతని వెనువెంట నల కాంతి యడఁగుచుండ,
గ్రమత నస్తంగతుం డయ్యెఁ గంజహితుఁడు. 100

వ. అపుడు. 101

చ. క్రమముగ జారచోరుల కఖండముదం బిడువేల్పుఁజెట్టు, వ
ల్లము నిఁక మిఱ్ఱి నేక మను లాగును గొల్పెడు న్యాయమూర్తి, య
ల్పమయిన కాంతి గల్గు నుడువర్గము నిక్కు మహావకాశ, మి
చ్ఛ మెయిని దుష్టసత్వములు సాఁగు తమంబు చెలంగె నంతటన్. 102

శా. అంతన్ మించె దినాంత, మంతటను వర్షాక్రాంతమై సంతత
ధ్వాంతం బెంతయు నిండె; భీమజలముక్తండోరుగర్జాధ్వనుల్
స్వాంతంబుల్ వగులింప సాఁగె; నపు డా వ్యాధుండు విశ్రాంతికా
కాంతారంబున నొక్క జీర్ణపు శివాగారంబు జేరం జనెన్. 103

సీ. అంటినమాత్రాన నవనిపై దడదడఁ - గూలెడి గోడల ఱాలతోడ
సకలజంతువ్రాతసతతవిశ్రాంతిజా - సహ్యపురీషవాసనలతోడ
ఎండవానల చెల్మి యొసఁగి పుట్టిన క్రిమి-కీటకంబుల కిచెకిచెలతోడ
అంతటనాక్రాంతమై, మొగంబుల వ్రేలఁ - బడియెడు సాలీంద్ర వలలతోడ

గీ. "గర్భగుడి యిద్ది, యిద్ది ప్రాకార"మనెడి
భేద మింతయుఁ గన రాక, వెలయు చుట్టు
పట్లఁ గల చీఁకటిని దల్ల - వన్నెఁ దోఁచు
చీఁకటి కోట యెసఁగె నల్ల - శివుని గీము. 104

సీ. సాలీంద్రుడు పెట్టిన సన్నదారపువలల్ - మంచి మల్లీపుష్పమాలిక లట,
కలసి మెలసి యొప్పు లలి జంతువు లిడు నీ-ర్వాకలే తీర్థాభిషేక మచట
కుటిలాటవీచరద్ఘోరడాకిన్యాది-భూతంబులే భృత్యపుంజ మందు
ఉద్దండతపనతాపోల్లసచ్చండమా-ర్తాండుఁడే యాతపత్త్రి మల చోట

గీ. నయ్యె హరునకు; నిట వింత-యలరునొక్కొ?
తనరు శ్రీకాళహస్తి-సత్కథయ కాదె?
సాలెపురుఁ గేన్గుఁ దిన్నఁడు సల్పు సేవ
లెట్టు, లవి తానె యిట నంద నెసఁగె శివుఁడు. 105

సీ. చేరియుఁ జెకుముకిచే దూది వెల్గించి,యొక పెంకులోనఁ గ్రొవ్వొనరఁ బోసి,
ప్రేకలి యిడి, దివ్వె వెలిఁగించి యుంచి, యా-పొంతఁ దెచ్చిన పాల మూట నుంచి
తోలుసంచిని నున్న తోయముతో శివు-తోఁ గూడు - శిలలఁ జేతులను గడిగి
మృగభీతి నా రేయరుగు దాఁక మేల్కని, చింత మది లేక యుండె నందు

గీ. నల్లవ్యాధుఁ; డవలఁగోడి - యఱచెఁ; జుక్క
వొడిచెఁ; దెలతెలవారె; సూ-ర్యుండు వొడిచె,
వ్యాధుఁ డటనుండి యిలుమొగం - బగుచు నడిచెఁ;
గాని, తనకురాఁగల ముప్పు - గనఁ డతండు. 106

ఉ. "తా నొకఁ డెంచె దానికిని దైవము వేఱుగ నెంచుచుండు"నన్
జొను జగంబునం దెసఁగుఁ; జెయ్యన నమ్మెయి బోయ యాతఁ డెం
తేని రహిం గృహంబునకు నేఁగుచు నుండ, వినంగ నయ్యె న
వ్వాని కజాండభాండదళనామితభీమమృగాదనధ్వనిన్. 107

శా. గాంద్రిం పయ్యది యాలకించి, మృగయాగ్రణ్యుండు వ్యాఘ్రం బుదో
వేంద్రం బయ్యది యంచులో నెఱిఁగి, వేవే నీటె నొం డందుపైఁ
దీంద్రం బొప్పఁగనేయఁ, గాలగతి నెంతే నద్ది వమ్మయ్యె; నా
గంద్రం దంద్రములఁ జేరఁ బంచె నల వ్యాఘ్రం బంతటం గిన్కమై. 108

ఉ. చెచ్చెఱ నిట్లు చిత్రవధఁ జెందిన బోయని జీవుకోసమై
వచ్చిరికాలుసన్నిధిని బర్వెడి దూతలు, కీలికీలపై
మచ్చెరమూనియుం గరము మండెడు కన్నులు, ధైర్యరీతి మేల్
పెచ్చు నడంగఁజేయఁ గల భీషణవేషము లూని యప్పుడున్. 109

చ. కరములయందు దండము, లఖండరుషానలకీల మోములం
దొరిమను దాండవింపఁగ, మహోన్నత మా ధృతి గల్గు వానికేన్
గరముభయంబునుం గొలుపఁ గల్గు భయంకరవేషముల్, కరం
బరుదుగ, నల్ల కాలభటు లాతని జీవుని లాఁగ సాగఁగన్. 110

ఉ. ఆ యమకింకరుల్ తివియు నట్టి మహావ్యథ కల్ల వారగ "లో
బోయఁడ ! నీదు పాపముల పున్నె మిదే !" యను సూటిపోట్లు, "క
ర్మా!" యని యార్చుచున్, వసఁట నందుచునుండె నతండు ; వింత యొం
డా యెడ నప్డు సొంపెసఁగె, నార్యజనస్తవనీయమై కడున్. 111

ఉ. ఆతతరీతి వచ్చిరి పురాంతకదూతలు, సంసృతివ్యథా
త్రాతలు, మోక్షదాతలు, దురంతపు జింతల పాలి కెంతయున్
ఘాతలు, వైరిజేతలు, వికాసము గోరు ముముక్షుపాలికి
న్నేతలు, వేఁటగాని నల నీలగళాలయ మందఁ జేయఁగన్. 112

ఉ. ఘోరనిదాఘతాపమునఁ గూరెడువానికి శీతలాంబుకా
సారము గానుపించినటుఁ జాల ముదంబును గాంచెఁ దన్మృగ
వ్యారతు జీవ మప్పు, డల యంతకదూతల వంతనుండి త
న్నా రహి శంభుదూతలు భయంబును బాఁపియుఁ బ్రోవఁ బూనఁగన్.

చ. ఒక్కట నెండ మాడ్పఁగ, ని కొక్కట వెన్నెల యింపు గూర్పఁగా,
నొక్కట నగ్ని యేఁచఁగ,నిఁ కొక్కట మంచు లలిం బొనర్పఁగాఁ,
జిక్కను జెల్వఁ జెందుచును జీవము బోయని దప్పె నెంతయున్
స్రుక్కుచు నిక్కుచుం దనరె సూర్యసుతాభవదూతలందునన్. 114

మ. అప్పు డా శంభుని దూత లంతకుని దూతాళిం బొడఁగాంచి, "మీ
రిపు డీ జీవుని వీడుఁడీ! లలి నితం డెంతేనియున్ దేవమా
న్యపదంబుం గన సర్వ మా సుకృతముం గావించియున్నాఁడు; పా
పపుఁ బొ ల్పింతయు వీనికిం దగదు" నాఁ; బ ల్కద్ది యాలించి, తా
పు డర్కాత్మజు దూతలున్ వికవికన్ హాసంబు గావించి, "చి
త్రపు టాశ్చర్యము గంటి మిం దకట! యీతం డన్న, ఘోరాఘుతం
డపు రూపం; బిటువంటి వాఁడు కరమున్ భవ్యాత్ము లౌ మిమ్ముఁ బో
లు పటుశ్రీకులఁ గాంచుటా? విడుఁడు! దుశ్శ్లోకాత్ము నిష్ఠేని యున్. 115

చ. జననమునుండి జంతువులఁ జంపుట దక్క మ ఱొక్క చేక్క నా
పని జరుపండు, వీనికిని బర్వఁగ జేయఁగ నారకవ్యథల్
ఘనతనకుఁ దగ్గ వుండ, విఁకఁ గ్రన్ననఁ గ్రొత్తవి గొల్పఁగావలెన్,
గనుకను వీని వీడుఁడి! గుణప్రచురాత్మకులార! మీ రొగిన్. 116

చ. పొరపడి యుంద్రు మీరు; పొరవోవుటసాజ మ దెల్ల వారి; కే
త్తెరమెయి నెన్ని సార్లుగనొ తెచ్చితి మొక్కఁ డఁటంచు నొక్కనిన్;
నెఱను నెఱింగి వీఁడితిమి; నిక్కము మీ రటులే పొనర్చియుం
దు; రది తలంపుఁడీ!" యనిన, ధూర్జటిభృత్యనికాయ మిట్లనున్. 117

చ. "సరిగఁ దలంప రీ; రితఁడు సర్వమహాఘపరంపరా౽౽వళిం
జేరపిరొ యుండుఁ గాక; ఘనసత్త్వముఁ డీతఁడు శంభుసత్కృపా
గరిమకుఁ బాత్రుఁ డయ్యె; నల కాలగళాజ్ఞనె వచ్చినా మిటన్;
మఱిమఱి మాట లేల? యనుమానము మానుఁడి! కాలకింకరుల్!! 118

ఉ. నిన్నఁటి రేయి నీతఁడువనిం జరియించి, పొరిన్ మృగంబులం
గొన్నిఁటిఁ జంపి, యింటి కవి గొంచును వచ్చుచు నుండఁ, ద్రోవలో
న న్నెఱిసంజ గ్రమ్మ, నళినాప్తుఁడు గ్రుంకి తమంబు నిండఁగాఁ
గ్రన్నన దుష్టసత్త్వ భయకారణ మొప్పఁగ, నప్పు డీతఁడున్. 119

శా. ఆ మార్గంబున నుండు జీర్ణశివగేహం బొం ; డటం జేరియుఁ
దీపుం గ్రొవ్వునఁ బెంకులో నిలిపి, నిద్రింపంగ, సమ్మార్జనం
బే మైఁ జేల్చియు, భక్తిశ్రీకాగతజలం బీశానుపైఁ జిందె ; నీ
లో మాఁ పేఁగ, నతం డటం గదలియుఁ ద్రోవం బడెఁ వ్యాఘ్రిచేఁ.

సీ. హరుదేవళము వీఁడు టూది సామరణంబు-నే యఘం బితఁడు గావింప లేదు;
నిన్నటి రాతిరి నీలకంఠాలయం-బున దీప ముంచుట పొరిని శంభు
నకును పారాధనం బయ్యె ; మాంస మా-తనికడ నుంచుట తగెనివేద దీ
నంబుగా ; భక్తిజలంబులఁ జిందుట - యభిషేక మయ్యె నంబాధిపునకు;

గీ. రాత్రి యట మేల్కనియె, జాగ-ర మది యయ్యె;
తోడరి జాగర ముండి ప్ర-దోషపూజ
శివునకుం జేసిన ఫలంబుఁ - జెంద వలదె
వీఁడు ? స్వర్గపాత్రుండు - గాఁడె వీఁడు ?? 121

మ. శివపూజానియమంబు లెల్ల లలిఁ దీర్చెఁ వీఁడు ; పూర్వోరువై
భవపుణ్యంబునఁ జేసి తోనె మృతి ని వ్వాఁ డొందె , శేల్ కంకణాల్
రవమొప్పారఁగ ముక్తికాంత పిలిచెఁ "ర" మ్మంచునివ్వాని ; శాం
భవ మీ నిర్ణయ , మంతకాశ్రితులు! మీ రాపుఁడు దూరంబుగన్."122

వ. అనుడును 123

ఉ. అంతట నేఁగి రంతకభటావళి; పిమ్మట శర్వదూత ల
త్యంత కుతూహలంబు దనరారు మనంబులతోడ, దేవతా
కాంతలు గొల్చుచుండఁగ, నఖండరమావిభవంబు నిండు బల్
సంతస మా పదంబును నెసం గఁగఁజేసిరి వాని కిమ్మగన్. 124

క. పిమ్మట వాఁ డొక రాజకు
లమ్మున జనియించి, ధర్మ-లలితుండై, తా
నిమ్మగ శివుఁ గొల్చియు, ని
త్యమ్మగఁ గైలాసపదవి - నందె ననఘుఁడై. 125

మ. విలసద్భూపచరిత్ర మిద్ది పెరిమన్ విన్నట్టి వాఁ డెంతయున్
జెలు వొందం భువియందు సర్వసుఖముల్ శ్రీ మించేఁగాఁ గాంచియున్,
లలి నంతంబున నాకలోకసుఖముల్ గాంచుం గరం బిమ్ము డం
బొలయ న్నిక్కువమంచు నూతుఁ డనె వాన్యుత్తంసులం గాంచియున్. 126

మ. ఇది శ్రీస్కాందపురాణమందుఁ గల శ్రీవృక్షధరేంద్రాపరా
శఁ దగం దెల్పు కథన్ శివుండు శివకున్ జెయ్యార్ వినంజేసి న
ట్టిది, బ్రహ్మేశపురాణనామకము; ధాటిన్ ద్వాదశాధ్యాయ మ
ద్యోఁ దదాదిత్యసుభాష; నైదవదిపా లేఁపొందు నాంధ్రంబునన్. 127

## ఆశ్వాసాంతపద్యములు.

శా. లీలం గానఁగ వచ్చు దేవతలు, తల్లిందండ్రియుం; గాన, మీ
ర్వ్యాలాయంబుగ ముక్తి గూర్తు రను భావంబందు సందేహ మెం
దే లాగేనియుఁ గాన రాదు; దయ మీ రీ గ్రంథముం జెంది, నా
కీలాలోపమితాఘముల్ సదుపుఁడీ! కీర్త్యంబితుల్! మద్గురుల్!! 128

ఉ. పొందుగఁ గోటమాంబిక సుపుణ్యచరిత్రను లోక మెక్కు; గో
విందసుధీంద్రు కీర్తి కడు వెల్గుత దిక్పికరంబునందు; న
ర్ధేందుకళాకిరీటుఁ డతిహృద్యకృపారసధారఁ జెంచి, య
స్పందతఁ దల్లిదండ్రులవి చేందము లందముగాఁ బొనర్చుతన్. 129

మ. శివుఁడే దైవము, శైవనామమహిమం జెప్పంగ బ్రహ్మాదులే
ని వెసం బోలరు; శంభుసత్కరుణ వన్నెన్ వాసినిం గూర్చు; వే
దవిదుల్, మానులు, దేవతల్, సతము తత్సాంబాంఘ్రికంజాతపూ
జవిధానం బపవర్గలబ్ధికయి మింపేం జేతు రత్యంతమున్. 130

ఉ. ఇందుధర ప్రకారమును నెంతయుఁ జెందిన కోటమాంబ గో
విందసుధీంద్రులుం జనకవిశ్రుతి నూనఁగ, వారిగుర్తుగాఁ

బొందఁగఁ, జేర్మి నీశివుని పుణ్యకథానకముం బొనర్చి నా,
నందముఁ జెందముం దగ, మహాఘపరంపర లూఁడి పోవఁగన్. 131

గీ. ఆంగిరసగోత్ర మనెడి వైశ్యకుల "పగిడి
కుల" నుగోత్రంబు గల "దోమ" - విలసితాన్వ
యమునఁ దనరిన గోవింద-యార్యునకును
గోటమాంబిక కిది కృతి - పాటి మీఱ". 132

శా. భూమీజేశకృపాకటాక్ష కవితాపుత్రాత్ముఁడై, శ్రీగిరి
శ్రీమద్వారణ దిక్కవాటమహిమన్ జెల్వార నాంధ్రంబునం
దీ మై వ్రాసె, నలంపురీనిలయ బ్రహ్మేశార్చనోద్యన్మతిన్
దోమా. వేంకటస్వామిగుప్త కవి, కన్నూల్మందిరుం డొప్పఁగన్. 133

గద్యము.

ఇది శ్రీతుంగభద్రానదీతీర విరాజమాన కందనవోల్నగరీ మందిరుండును, శ్రీమద్వేంకటేశ్వర కరుణాకటాక్ష వీక్షణానందితార్య వైశ్యరత్న దోమాన్వయ పయఃపారావారరాకాసుధాకర శ్రీ గోవిందార్య తత్సహధర్మచారిణీ శ్రీ కోటాంబికామణీ నందనాగ్రజుండును, శ్రీరామచంద్ర పాదారవింద మరందపానేందిందిరాయమానమానసుండును, సరసకవితారచనాభిప్రాయుండును, సకల సుధీజనవిధేయుండును, నానాదేశ బుధానీకప్రదత్త శ్రీమదాంధ్ర విద్యావాచస్పతి, సాహిత్యసరస్వతీ, విద్యావినోద, కవిభూషణాది బిరుదాదృతుండును, నగు వేంకటస్వామిగుప్తచే రచింపఁబడిన శ్రీమద్బ్రహ్మేశ్వర పురాణంబునఁ బంచమాశ్వాసంబు సంపూర్ణంబు.

సమాప్తము

శ్రీమద్బ్రహ్మేశ్వరార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీరామచంద్రాయనమః.

# కొన్ని ప్రాస్తావిక పద్యములు.

కొడంగల్లు శ్రీకొంపినమఠము - శ్రీవిరూపాక్ష స్వాములవారి గురువు లయిన
శ్రీబసవలింగస్వాముల వారిని గుఱించి:—

శ్లో. నిత్యాహార్యకుమారికారమణ పాదాంభోజమోద క్రియా
రంగ ద్భృంగశుభాంతరంగకలితానందాతిరేకాంచితం
అంతేవాసినికాయ మానసగతధ్వాంతార్క-బింబోదయం
వందే తం శివయోగినం బసవలింగస్వామినం సర్వదా.

## శ్రీవేంకటేశ్వర స్తవము.

సీ. ఏఁడు కొండలపైన నింపుగాఁ గొలువుండి
యీరేఁడు జగముల నేలువాఁడు
అలమేలుమంగమ్మ యను మహాలక్ష్మితో
నమితమోదమ్ముతో నలరువాఁడు
బ్రహ్మాదిదేవతాపటలవందితమై వి
డంబించు పాదపీఠంబు వాఁడు
పుండరీకంబుల పోలు పొందు కన్నులఁ
జల్లని దయ వెదఁజల్లు వాఁడు

గీ. అరిదరమ్ములు కరములఁ - బరఁగు వాఁడు
రంగుబంగారుకొంగు సీ-రాడు వాఁడు
నల్ల నయ్యా, బ్రహ్మాండాళి - కెల్ల యయ్యా
క్రాలు వేంకటేశుండు మా-కన్నతండ్రి.

## శ్రీకేశవవాచనాలయము - కొడంగల్లు.

ఉ. శ్రీశకృపాతిరేకము పొరిం దనరారఁ గొడంగ లన్ పురిన్
లేశము సందియం బెసఁగ లేని తెలుంగున నెల్ల వారికిన్
పేశలభావ్యవైఖరులు వృద్ధి గనుంగొనఁ జేయు చెంతయున్
గేశవవాచనాలయము కీర్తికిఁ దానక మై చెలంగుతన్.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీః.

# రాఁబోవు పొత్తములలోని మచ్చుపద్యములు.

చ. నయనము గ్రుచ్చుకొన్నను గనంబడ నంతటి రాత్రి యుండఁ గా
దె? యినలు జంద్రచంద్రికల యందము తాఁ గమనీయ మయ్యె? న
మ్మెయిఁ గద; దుష్కవీశ్వరులు మేకొను దానసె సత్కవీశ్వరుల్
నుయశము నందుటల్? కనుకఁ జొక్కుచు మ్రొక్కెద దుష్కవీశులన్.

(ప్రథమాశ్వా: శ్రీపరకాల విలాసము ప్రబంధము)

---

సీ. శ్రీకృష్ణభక్తి రాజిల్లదే గురునిచే,
గురువు గాఁ డతఁ డొక్క పురువుగాని,
శ్రీకృష్ణభక్తి రాజిల్లదే తండ్రిచేఁ,
దండ్రి గాఁ డతఁ డొక్కయెండ్రిగాని,
శ్రీకృష్ణభక్తి రాజిల్లదే రాజుచే,
రాజు గాఁ డతఁ డొక్కఁగాజుగాని,
శ్రీకృష్ణభక్తి రాజిల్లదే హితులచే,
హితులు గా ర్వారు దుర్గతులుగాని,

ఆ. విష్ణుభక్తిలేని ద్విజునికన్నను గృష్ణ। భక్తి గల్గునట్టి శ్వపచుఁ డెచ్చు।
శ్వపచుఁ డైనఁ గృష్ణభక్తి గల్గినఁ, దన। వారితోడ ముక్తిపదవిఁ గాంచు.

(ద్వితీయాశ్వా. శ్రీ బ్రహ్మవైవర్తపురా: బ్రహ్మఖండము).

---

శా. ఆ సాయంసమయం బతీవసుఖదం బై యిట్లు చెల్వార, "నా
పై సూర్యుం డపరాశ పేరి తరుణిన్ బాణిగ్రహం బొందనే
మో సల్పుం జలకం బనంగ, నపరాంభోరాశిఁ గ్రుంకెం దదా
శాసద్రాగము రాగ మై తనర దృష్టాంతంబుగా నెంతయున్.

(తృతీయాశ్వా. ప్రేమాభిరామము. ప్రబంధము).

ఉ. కాలినరుండు సంద్రి మను గణ్యునకుం బహుమాన మూనుఁగా
నో[illegible] పైఁడిపట్టు నిడుటో యిటు లన్నిటువంటి మాడ్కిఁ దా
మేలి తెలుం[illegible] యిమ్ముచు సక్రమమ్ముగా
ప్రాలి నపూర్వదివ్యరసరమ్య[illegible] దినవారము[illegible].

(ద్వితీయాంకము. చంద్రకళాసు దర్శనము (నాటకము)).

---

మ. మతి లేకో, యధికారగర్వముననో, మా లేని వేరొక్కధరా
నుతనుం గైకొని పోతి; వా మెను విడక్ సాం పొందు; లేపన్న, ను
ద్ధత సౌమిత్రివిముక్తమార్గణగణోద్యచ్ఛేదరక్తాతప
త్రతతచ్ఛాయ గడల్చ్యానక్, యమునిజేరం బోదు విష్టాళితోక్.

(దూతాంగదము—శ్రీసుభట మహాకవి విరచిత సంస్కృత
చ్ఛాయానాటకమునకుఁ దెలుఁగు).

ఈ గ్రంథము లన్నియును శ్రీదోమా. వేంకటస్వామిగుప్త గారిచే రచింపఁబడినవి. త్వరలో గ్రంథమాలా ముఖమున వెలువడి యెడిని.

పయిని పుస్తకములందుఁ బయిఁదెల్పిన, పాటి పద్యంబులు పరశ్శతంబులుగా నున్నవని పెద్దలయభిప్రాయము. ఈ పద్యములు మచ్చుగాఁ జూపుట వలన ఈ పద్యములు మాత్రమే యందమయిన వనియు, ఇట్టివియును, నింతకన్నఁ బొంకమయిన పద్యములును పయిని పాత్రములో లే వని తలంప రాదనిమనవి. ఈపద్యము లాపాతముగా నెత్తి యిటఁ జూపఁబడినవి. సాధారణముగాఁ బయిని పాత్రము లన్నియు నన్ని పట్టులలోను బాగుగా నుండు నని పెద్ద లనిరి.

శ్రీవాఙ్మయ వినోదినీ గ్రంథమాల,

జి. టి. మద్రాసు.

---

Printed at the India Printing Works, Madras.